# తెలుగుపై
# ఉర్దూ పారశీకముల ప్రభావము

డాక్టర్ కే. గోపాలకృష్ణారావు, ఎం. ఏ; పిహెచ్. డి.
రీడరు, తెలుగు శాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయము.

# ప్రస్తావన.

1940 నాటి సంగతి. భువనగిరి పాఠశాలలో ఎనిమిదవ తరగతిలో నున్నపుడు ఉర్దూతోపాటు పారశీకమునుకూడ బోధించినారు. మాకు ఉర్దూపాఠము చెప్పెడి మౌల్వీసాహెబుగారే పారశీకముకూడ చెప్పుచుండెడివారు. వారు బోధించిన పాఠము మఱునాడు ఒప్పచెప్పనిచో జరుగవలసిన మర్యాద జరిగెడిది. తత్ఫలితముగ ఒకటి రెండునెలలలో 'ఆమదన్' కంఠస్థమైనది. హైదరాబాదు వచ్చిన తరువాత ఉన్నతవిద్య ఉర్దూద్వార అభ్యసించుట. స్వయంకృషివలన పారశీకము నందలి కొన్ని పాఠ్యములు చదువుకొనుట, సిటీకళాశాలలో ప్రముఖ కవులును విమర్శకులును అయిన మక్దూం మొహిఉద్దీన్‌వంటి గురువులవలన గాలిబ్, మీర్, ఇక్బాల్, ప్రేమచందు మున్నగువారి రచనలను పాఠ్యములుగ చదువుట మొదలగు అంశములు నాకు ఉర్దూఫారశీక భాషా సాహిత్యములపై అభిమానము అభిరుచి ఏర్పడుటకు దోహదమొనగినవి.

తీరిక కలిగినపుడు ఉర్దూగజళ్ళు, రుబాయీలు, నవలలు, కథానికలు చదువుటతో తెలుగుపై ఆ భాషాసాహిత్యములు ముద్రవేసినట్లు తోచింది. వివిధగ్రంథావలోకనమువలన ఈ పరిభావమును సుస్పష్టముగ గుర్తించగలిగితిని. ఈ అంశమునుగూర్చి కొన్ని వ్యాసములు వ్రాయవలయునను సంకల్పము కలిగెను. కాని పట్టుదలతో ప్రయత్నము చేయలేదు.

రెండు సంవత్సరములకు ముందు ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీవారు "తెలుగుపై ఉర్దూపారశీకముల ప్రభావము" అను అంశముపై వ్రాసిన ఉత్తమగ్రంథము నకు బహుమతి నొసగుదుమని ప్రకటించియుండిరి. మనసులో బీజప్రాయముగనుండిన సంకల్పమునకు అకాడమీవారి ప్రకటనము అమృతసేచనముచేసినట్లయినది. ఈసందర్భ మును పురస్కరించుకొని నాకుతోచిన అభిప్రాయములను గ్రంథస్థముచేయుటకవకాశము లభించినది. ఈగ్రంథమునే ఉత్తమగ్రంథముగ నిర్ణయించి అకాడమీవారు రెండువేల రూపాయిల బహుమానమును ప్రకటించుట నాకు ఆనందప్రోత్సాహముల నొసగినది.

సాహిత్యఅకాడమీవారు సూచించిన పరిధిలో రచనసాగినది. వ్రాయదగిన అంశమింకను కలదనియే తోచుచున్నది. బ్రౌను పండితుల మిశ్రభాషా నిఘంటువును ఆధారముగగొని అరబీ, ఉరుదూపారశీకములకు సంబంధించిన అన్యదేశ్యముల నిఘంటు వును కూర్చుట అవసరము. ఈఅంశము "పరిశిష్టము"న వివరింపబడినది. ప్రభు త్వమువారుకాని, సాహిత్యఅకాడమీవారు కాని బృహత్ప్రణాళికను సూచించి నిఘంటు నిర్మాణమునకు పూనుకొనినచో సాహిత్య అకాడమీవారు ప్రకటించిన అంశమునకు సంపూర్ణస్వరూపము ఏర్పడుననుటకు సందేహములేదు.

విస్తృతమైన పరిధిగల అంశమును సత్యానుసారముగ వివరించితిని. నేను ఏర్పరచికొనిన ప్రణాళికయందుకాని, విషయవివరణమునందుకాని, ప్రమాదవశమున లొసగులు దొరలియుండును. పండితులు సవరణలు సూచించిన ప్రసన్నభావమున స్వీకరించెదను

ఈ కృషిని బహూకరించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ వారికిని, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికిని హృదయపూర్వక కృతజ్ఞతలు. ముద్రణవ్యవహా రమున తోడ్పడినఆప్తులు డా. కోవెల సుప్రసన్నాచార్యులకు కృతజ్ఞుడ. సకాలమునకు అచ్చువేసిఇచ్చిన వేంకటరమణ ముద్రణాలయమువారికిని కృతజ్ఞతలు తెలుపుట నావిధి. ఎంతశ్రద్ధగా చూచినను ముద్రారాక్షసమునకు గురికాక తప్పలేదు. సహృదయులు మన్నింప ప్రార్థితులు.

జనవరి '68
ఓరుగల్లు.

కే. గోపాలకృష్ణారావు.

# అనుక్రమణిక

# భూమిక

ఆంధ్రభాషా సాహిత్యములపై తొలిదశనుండియు నన్యభాషల ప్రభావము ప్రగాఢముగ నుండెననునది చారిత్రిక సత్యము. ఆర్యభాషా కుటుంబమునకు జెందిన సంస్కృతభాషాసాహిత్యప్రభావము ద్రావిడ భాషలపై ప్రసరించినది. తమిళము–కన్నడము–ఆంధ్రము మున్నగు ద్రావిడభాషలలో సంస్కృతమును తనదిగ జేసికొని సర్వాంగ సుందరముగ వికసించినది తెలుగుభాషాసాహిత్యములు మాత్రమే. సంస్కృతమును తెలుగువా రాదరించినట్లుగ మఱియే ద్రావిడభాషయు నాదరించలేదనుట నిర్వివాదాంశము.

ప్రాకృత సంస్కృతముల సంపర్కమున తెలుగు పుష్టిని చేకూర్చుకొనినది. సోదర భాషలగు తమిళ కన్నడల ప్రభావమునుకూడ పొందినది. మహమ్మదీయుల సంపర్కము వలన ఉర్దూ పారశీకముల చేతను ప్రభావితమైనదను అంశము ప్రస్తుత విషయము

ఈ సందర్భమున మహమ్మదీయులతో నాంధ్రులకేర్పడిన సంబంధమును చారిత్రకదృష్టితో బరిశీలించుట అవసరము. గజనవీ సుల్తానులలో విజేతగా బ్రసిద్ధి వహించినవాడు సుల్తాన్ మహమూద్. భారతదేశము బంగారుదేశమనియు నిచట సైకత రేణువులు సైతము స్వర్ణ పూర్ణములనియు విని ఈతడు దాదాపు పండ్రెండు మారులు భారతదేశముపై దండెత్తి ఇచటి ధనరాసులను దోచుకొనెను. సుల్తాన్ మహమూద్ దండయాత్రలు భారతదేశమున మహమ్మదీయ సామ్రాజ్య స్థాపనకు రాచబాట నేర్పఱచినవి.

నిర్వీర్యులైన గజ్నవీ వారసుల నోడించి, హిందూదేశమును కొల్లగొట్టి ఉత్తర భారతమున సుస్థిరమైన సామ్రాజ్యమును స్థాపించినవారు గోరీవంశీయులు. వీరి ప్రాభవము క్రీ. శ. 1152 నుండి 1206 వఱకు నుండెను. షహబుద్దీన్‌గోరీ మరణానంతరము ఆతనియొద్ద బానిసగానున్న కుతుబుద్దీన్ 1206లో స్వాతంత్ర్యమును బ్రకటించి రాజ్యాధికారమును స్వీకరించి నాలుగేండ్లు పరిపాలించెను. ఆతని వంశము బానిసవంశముగ జరిత్రలో బ్రసిద్ధము. ఈ వంశము క్రీ. శ. 1288 సంవత్సర

ములో నంతరించినది. ఢిల్లీ సామ్రాజ్యము ఖిల్జీల హస్తగతమైనది. ఢిల్లీ చుట్టునుగు ఉత్తరభారత ప్రాంతములకే పరిమితమై యుండిన మహమ్మదీయ సామ్రాజ్యము ఖిల్జీయుల కాలమున ప్రప్రథమముగా దక్షిణాపథమున విస్తరించుటకారంభమైనది. అల్లాఉద్దీన్ ఖిల్జీ యువరాజుగ నున్నపుడె కొన్ని వేల సైన్యముతో క్రీ. శ. 1293 లో దేవగిరిని కొల్లగొట్టెను. అల్లాఉద్దీన్ దండయాత్రనాటికి దక్షిణాపథమున కొన్ని ప్రధాన రాజ్యములు వివిధప్రాంతములలో నాధిపత్యము వహించుచుండెను. దేవగిరిలో యాదవుల సామ్రాజ్యము, తెలంగాణమున కాకతీయ సామ్రాజ్యము మున్నగునవి ఇట్టివి.

క్రీ. శ. 1303 సంవత్సరములో అల్లాఉద్దీన్ దండయాత్ర లాంధ్రదేశముపై ఆరంభమైనవి. మొదట రెండు దండయాత్రలు విఫలమైనవి. 1309 లో నాతడు ఓరుగంటి రాజునోడించి ఢిల్లీశ్వరునకు కప్పము కట్టునట్లొనర్చెను. ఈదండయాత్రలో నతనికి కుడిభుజముగ నిలచినవాడు మాలిక్ కాఫర్

క్రీ. శ. 1320 సంవత్సరమున ఖిల్జీరాజ్యము తుగ్లకుల వశమైనది. గయాసుద్దీన్ పెద్దకుమారుడు ఉలగ్‌ఖాన్, పూర్వపుటంగీకారమును త్రోసిపుచ్చి ఢిల్లీ సుల్తానునకు కప్పము చెల్లించుటకు నిరాకరించిన ప్రతాపరుద్రునిపై దండెత్తి 1321 లో ఓరుగల్లు కోటను ముట్టడించెను. కాని 1303 నాటి దండయాత్రవలె నిదియు విఫలమైనది. ఉలగ్‌ఖాన్ మహమ్మద్ అని పేరు పెట్టుకొని తండ్రి మరణానంతరము 1326 లో ఢిల్లీ రాజ్యమున కధీశుడయ్యెను. ఈత డరబీ పారశీకములందు గొప్ప పండితుడు. విద్వాంసుడు. ఈతని పరిపాలనాకాలమునాటి సంఘటన మొకటి చరిత్రప్రసిద్ధమైనది. అది ఢిల్లీనుండి రాజధాని దేవగిరికి మార్చుట. తుగ్లకుకు అపకీర్తి నాపాదింపజేసినదీ సంఘటన. రాజధాని మార్పిడివలన ఢిల్లీనుండి ఎందఱో మహమ్మదీయులు దక్షిణాపథమునకు తరలి వచ్చిరి. దేవగిరినుండి రాజధాని మరల ఢిల్లీకి మారుటలో నంతకు మున్ను వచ్చిన వారు కొందరు మరలఢిల్లీకి వెళ్ళుట కిచ్చగింపక ఇచటనే స్థిరపడిరి.

తుగ్లకు అధికారులలో ప్రభువువలె అరబీ పారశీకములందభిరుచి ప్రవేశములు కలవారున్ను పండితులును నుండిరి. అధికారులతోపాటు వచ్చిన సామాన్య ప్రజలును నిచట ఎందఱో స్థిరపడిరి. క్రీ. శ. 1328 ప్రాంతములో ఓరుగల్లు సుల్తానుపురమగుటతో స్థిరపడిన మహమ్మదీయ అధికారుల సంఖ్యయు సామాన్య కుటుంబముల సంఖ్యయును వృద్ధియయ్యెను.

పారశీకముల ప్రభావము

ఓరుగల్లు మండలమును మహమ్మదీయుల అధీనమునుండి తప్పింపవలయు నని ముసునూరి నాయకులు శక్తికొలది కృషి సలిపిరి. వారు కొంతవఱకు సఫలులైరి. కాని చివరికి దేశములోని అధికప్రాంతము మహమ్మదీయులకు వశమైనది. క్రీ. శ. 1347 ప్రాంతములో అల్లాఉద్దీన్ హసన్‌గంగూ స్వాతంత్ర్యమును ప్రకటించి కలబరిగి (గులబరగ) రాజధానిగ బహమనీ సామ్రాజ్యమును స్థాపించెను. తెలుగు దేశముపై మహమ్మదీయుల ఆధిపత్యము సుస్థిరమగుటకు దారితీసిన చారిత్రాత్మక సంఘటన యిది. బహమనీ సామ్రాజ్యము ప్రధానముగ మహారాష్ట్ర ప్రాంతమునం దాధిపత్యము వహించి యుండెను. కలబరిగి విజయనగరమున కుత్తరమున ఓరుగంటికి పశ్చిమమున దాదాపు 150 మైళ్ల దూరములో నున్నది.

బహమనీ సామ్రాజ్యమును అల్లాఉద్దీన్ హసన్ (1347–1358) మహమ్మద్‌షా (1358–1375); మహమూద్‌షా (1378–1397); ఫిరోజ్‌షాహ (1396–1442), అహమ్మద్‌షా వలి (1422–1435); అల్లాఉద్దీన్‌షా (1435–1457); రెండవ మహమ్మద్‌షా (1463–1482); మహమూద్‌షా (1482–1518); అను రాజులు పరిపాలించిరి. వీరిలో రెండవరాజు మహమ్మద్‌షా అరబ్ పారశీక దేశములనుండి విద్వాంసుల రావించి గౌరవించెను. అల్లాఉద్దీన్‌షా కాలమున దక్కన్ తురుష్కులకును పారశీక దేశమునుండి వచ్చిన తురుష్కులకును మనస్పర్థలేర్పడెను ఈ రెండు సంఘటనలు ప్రధానమైనవి. పారశీక పండితులిట స్థిరపడుటయు నప్పటికే స్థిరపడిన విద్వాంసులకు ఒకవిధమైన స్వాభిమాన మేర్పడుటయు జరిగినది. మొదట స్థిరపడిన వారు స్థానికులైనారు. తరువాత వచ్చిన వారు పరాయివారైనారు.

చివరి బహమనీ సామ్రాజ్యాధినేత కాలమున బహమనీ సామ్రాజ్యము విచ్ఛిన్న మైనది. బీదర్‌లో బరీద్‌షాహి (1492–1656) వరాద్‌లో ఇమాంషాహి (1484–1582) అహమద్‌నగర్‌లో నిజాంషాహి (1489–1637) విజాపురములో ఆదిల్‌షాహి (1489–1686) గోలకొండలో కుతుబుషాహి (1512–1687) అను అయిదు రాజ్యములేర్పడినవి.

విజయనగర సామ్రాజ్యమునకును బహమనీ సామ్రాజ్యము తదనంతర మేర్పడిన అయిదు రాజ్యములతోడను రాజకీయ సంబధములుండెను. మహమ్మదీయ వాహినీ విజృంభణమునకు విజయనగర సామ్రాజ్యము గొప్ప చెలియలికట్టగా నుండెను. నిజాంషాహి వంశీయులలోని హుస్సేన్ నిజాంషా పరిపాలనాంతమున (1565) చరిత్ర ప్రసిద్ధమగు తాళికోట యుద్ధము జరిగినది. విజయనగర సామ్రాజ్య

ప్రాభవ మీయుద్ధములో సన్నగిలినది మహమ్మదీయుల ఆధిపత్యము తెలుగుదేశములో నిరాటంకముగ సాగుటకీ యుద్ధము తోడ్పడినది.

తెలుగు దేశముతో సన్నిహిత సంబంధముగల గోలకొండ సామ్రాజ్యమును గూర్చి ఇట కొంత గ్రహింపవలసియున్నది. గోలకొండ ప్రాంతమునకు సుబేదారుగ నుండిన కులీకుతుబుషా 1512 లో స్వతంత్రుడై గోలకొండ సామ్రాజ్య స్థాపకు డయ్యెను. తూర్పుతెలుగునాడీలని ఆధీనమునందుండెను. ఇబ్రహీం కుతుబుషా (1550—1580) విజయనగర ప్రభువు నాశ్రయించి తన్ను కాపాడిన రామరాజుపై దండెత్తి తాళికోట యుద్ధములో నతనికి అపజయము కలిగించి అపకీర్తిపాలయ్యెను. ఆత డాంధ్రభాష కొనర్చిన సేవ ఈ అపకీర్తిని కొంతవరకు క్షాళిత మొనర్చుచున్నది. మరికిఖరాముగ కీర్తింపబడిన ప్రభువు ఇబిరాహీం. అద్దంకి గంగాధరకవి తపతీ సంవరణోపాఖ్యానము నితనికే అంకిత మొసగి యుండెను. ఈ ప్రభువు అధికారులలో కొందరు తెలుగు కవులను ఆదరించియుండిరి అట్టివారిలో యయాతి చరిత్ర కృతిపతి అమీన్‌ఖాన్ ప్రముఖుడుగ గన్పట్టుచున్నాడు.

కవిగా భాగ్యనగర నిర్మాతగా ప్రసిద్ధిపహించిన ప్రభువు మహమ్మదు కులీ. ఈతడు దక్కనీ ఉర్దూలో చక్కని ప్రణయగీతముల రచించెను అక్కన్న మాదన్న లను ప్రధాన అధికార పదవులందు నియమించి రామదాసువంటి మహాభక్తునివలన పేరు ప్రఖ్యాతులు వడసిన రాజు తానీషా. గోలకొండ రాజకీయ చరిత్రలో నితని పేరు చిరకాలము నిలువదగినది. 1687 లో ఔరంగజేబు గోలకొండను జయించి తానీషాను దౌలతాబాదు దుర్గములో చెరపెట్టెను గోలకొండ ఖుతుబ్‌షాహి సుల్తానులు తెలుగు దేశములోని వివిధ మండలములను దాదాపు 175 సంవత్సరముల వరకు పరిపాలించిరి. ఈ సామ్రాజ్యము 1682 లో నంతరించినది. ఉత్తర సర్కారు మున్నగు ప్రాంతము లలో నవాబులు చిన్న చిన్న సంస్థానమున కధిపతులై మొగలు సుల్తానులకు కప్పము చెల్లించుచుండిరి. మొగలురాజుల ప్రాభవము తెలుగుదేశములో నధికమైన కాలము ప్రధానముగా గణింపదగినది. ఉత్తర సర్కారు ప్రాంతములందే దాదాపు 30 జమీందారీలుండెను.

తెలుగు దేశములోని అధిక భాగమును తమ సామ్రాజ్యమున కంతర్భాగ ముగ నేలిన వారిలో గోలకొండ సుల్తానుల అనంతరము ఆసఫ్‌జాహీ వంశీయులు ప్రధానముగ పేర్కొనదగినవారు. భారత స్వాతంత్ర్యానంతరము హైదరాబాద్ సంస్థాన విలీనీకరణము వరకును తెలంగాణ ప్రాంతమును ఆసఫ్‌జాహీ వంశీయులే పరి

పాలించిరి. తదితర ఆంధ్ర ప్రాంతములందు కొన్ని మహమ్మదీయ నవాబుల సంస్థానము లేర్పడి యుండెను. భాషా రాష్ట్ర స్థాపనముతో మూడు ముక్కలుగా నుండిన తెలుగుదేశ మేకమైనది.

ఓరుగల్లుపై దండయాత్రలారంభమైన నాటినుండి భాషారాష్ట్రస్థాపనము వఱకును మహమ్మదీయ సుల్తానుల ప్రాభవము ఏదియో నొక రూపమున నిరంతరము సాగుచునే వచ్చినదని పై చారిత్రకాంశములు నిరూపించుచున్నవి. విజేతలలో అరబులు, తురుష్కులు, అబిసీనియన్లు, పఠానులు, మొగలులు మున్నగు వారెందరో వచ్చి యిచ్చట స్థిరపడిరి. ఉత్తర భారతమున హైందవ మహమ్మదీయుల సమ్మేళనమున వినూత్నమైన భాష రూపొందెను. అదియే తొలిదశలో రేఖ్తాగా వ్యవహృతమై కాలక్రమమున హిందుస్తానీ, హిందూస్తాని నామములనొంది ఉర్దూగా ప్రసిద్ధి నొందినది. ఉన్నత వర్గములవారు అరబీ పారశీకములతో వ్యవహారము కొనసాగింప సామాన్య ప్రజానీకము క్రొత్త రూపురేఖలు దీర్చుకొనిన రేఖ్తా ఉర్దూ భాషలలో నిత్య వ్యవహారమును సాగించుచుండిరి.

అరబీ పారశీకముల ఒడిలో పెరిగి పుష్టి నొందిన భాష తరువాత మహమ్మదీయులకు మాతృభాషగా వర్ధిల్లినది. మహమ్మదీయులు భారత దేశమునందలి ఏ ప్రాంతములకు వెడలినను అరబీ పారశీకముతోపాటు ఈ క్రొత్తభాషకూడ వారి వెంట వచ్చినది.

మహమ్మదీయులతో నాంధ్రులకేర్పడిన రాజకీయ సంబంధముల చరిత్ర ఇది. ఈ సందర్భమున మఱియొక అంశము ముఖ్యముగా గమనింపదగియున్నది. ఇది భాషా దృష్టితో పరిశీలించినచో నెంతయు ప్రాధాన్యముగలది. మహమ్మదీయుల దండయాత్రకు పూర్వముకూడ భారత దేశముతోడను, ప్రధానముగ ఆంధ్ర దేశముతోడను, అరబ్బు దేశీయులకు తదితర మహమ్మదీయులకు సంబంధమేర్పడియుండెను ఇట్టి సంబంధము కేవలము వర్తక వ్యాపారాదుల వఱకు మాత్రమే పరిమితమై యుండెను.

క్రీస్తు పూర్వము నుండియు తెలుగువారు సముద్ర వ్యాపారమున నిపుణులై యుండిరి. శాతవాహనుల చరిత్ర, బౌద్ధ జాతక కథలు, ఎల్లోరా అజంతా శిల్పములు. నాణెములు మున్నగునవి ఎన్నియో ఈ అంశమును నిరూపించుచున్నవి. క్రీ. శ. ఏడవ శతాబ్దినుండి అరబ్బులు మనదేశములో పెద్ద ఎత్తున వర్తక వ్యాపారములొనర్చుచుండిరి. పదియవ శతాబ్దము ఆరంభము నుండియు నాంధ్రులకు మలాకా మున్నగు

ద్వీపములతో వ్యాపార సంబంధము లేర్పడి యుండెను. మలాకా ద్వీపమునుండి వచ్చిన వస్తు జాలమును తెలుగువారు ఆదేశనామములతో వ్యవహరించుచుండిరి. పాలకురికి సోమన్న పేర్కొనిన మలక బెత్తములు మున్నగునవి ఇట్టివి. మలకలు అనగా క్రమముగా మహమ్మదీయులను అర్థముకూడ ఏర్పడినది.

అరబ్బు దేశీయులతో వర్తక వ్యాపార సంబంధము లేర్పడిన సందర్భము లందును [1] సముద్రయాన మొనర్చి తెలుగువారు అరేబియా మున్నగు దేశములకేగిన సందర్భములందును అరబీ భాషా ప్రభావము తెలుగుపైనను ద్రావిడ భాషా ప్రభావము అచ్చటి భాషలపైనను ప్రసరించి యుండునని విశ్వసించుట కాధారములు కలవు.

ప్రాచీనాంధ్ర నౌకా జీవనము గూర్చి సుప్రసిద్ధ పరిశోధకులు చారిత్రకులు శ్రీభావరాజ వెంకట కృష్ణారావుగారు గ్రంథము వ్రాసినపుడు నౌకాయానమునకు జెందిన పారిభాషిక పదములను సేకరించి ప్రకటించుటకు ప్రయత్నములు కొనసాగియుండెను. కాని అట్టి పట్టికను గ్రంథముతోపాటు వారు ప్రచురింపలేక పోయిరి. ఆ గ్రంథ పీఠికయందు ప్రకాశకులు "కారణాంతరములచే నావికా పరిభాష నిందు పొందు పడుప జాలకున్నందులకు చింతిల్లెదము" అనివ్రాసిరి.

ఈ విషయమున డా॥ చిలుకూరి నారాయణరావుగారొనర్చిన కృషి ప్రశంస నీయము. వారి పరిశోధన ఫలితముగ నాడాంధ్ర భాషపై అరబీ భాషా ప్రభావము ప్రసరించెనని స్పష్టమగుచున్నది. నావికుల వ్యవహారమునందుగల పారిభాషిక పద ముల పట్టికను స్థిర పరిచి వాని అర్థములనుగూడ వివరించిరి. నారాయణరావుగారి భాషా చరిత్ర ప్రథమ సంపుటపుటనుబంధమున ఈ పట్టిక అర్థ వివరణములో ప్రకటితము. ఈ పదముల స్వరూపమే వింతగా నున్నది. అరజ్-ఉల్-బలద్. అను పదమునకు అరుజు అను తెలుగు రూపము అని సులభముగ గుర్తింప వచ్చును. తక్కిన పదములగూర్చి ప్రత్యేకముగ పరిశోధనము జరుగ వలసి యున్నది.

---

1 "పదియవ శతాబ్ది ఆరంభము నుండి యాంధ్ర దేశమున పరిస్థితులు మార్పుచెంద సాగెనని చెప్పవచ్చును. ఆకాలమున వలస స్థాపనములు గావింపక పోయినను జను లుత్సాహముతో చీనా, జపాను, బర్మా, సయాంకాంబోడియా దేశీయులతోడను, మలాకా ద్వీపకల్పముల తోడను ప్రాగ్ద్వీపసమూహముల తోడను వాణిజ్యమును మరల సాగించియుండిరి".

—ప్రాచీనాంధ్ర నౌకాజీవనము – పుట 112

కాల్డువెలు పండితుడు ద్రావిడ భాషల ప్రభావము పాశ్చాత్య భాషలపై పడినదని నిరూపించు సందర్భమున తోకై మున్నగు పదముల స్వరూపమును గూర్చి వానిఅర్థములగూర్చి వివరించెను. నెమలి అని నేడు వ్యవహార సిద్ధమైనది. పూర్వము ఈ పక్షిని తోకై యనుచుండిరి. అరబీ పదము "తావుస" ఈపదమునుండి యేర్పడినదే. [1]

ఈ చారిత్రికాంశములను బరిశీలించినచో వర్తక వ్యాపారములకు వచ్చి అరబ్బుల వలనను, రాజకీయ ప్రాబల్యమును సంపాదించుకొనిన ఢిల్లీ సుల్తానుల వలనను ఆంధ్రభాష ప్రభావితమైనదను అంశము స్పష్టమగుచున్నది.

ఢిల్లీ సుల్తానుల వెంట సైనికాధికారులతోపాటు పారశీక విద్వాంసులును వచ్చియుండిరి. తెలుగు మండలాధికారులు రాజులు ఢిల్లీ సుల్తానుల తోడను, మహమ్మదీయ అమీరులు, మలిక్‌లు మున్నగువారితోడను పారశీకము మున్నగు భాషలలో రాజకీయ వ్యవహారములు సాగించుచుండిరని శ్రీనాథుని పద్యమువలన తెలియుచున్నది. బెండపూడి అన్నయ్య మంత్రికి "అరబీ భాష తురుష్క భాష గజకర్ణాటాంధ్ర గాంధార ఘూర్జర భాషల్ . .. . భాషా విశేషంబులచ్చెరువై వచ్చు" నని భీమఖండమున శ్రీనాథుడు వర్ణించెను. [2]

అన్నయ మంత్రి శేఖరుడహమ్మదుసేను వదాన్య భూమి భృ
త్సన్నిధికి న్మదిన్సముచితంబుగ వేమమహీ సురేంద్ర రా
జ్యోన్నతి సంతతాభ్యుదయ మొందగ బారసి భాష వ్రాసినం
గన్నులపండువై యమరుఁగాకిత మందలి వర్ణపద్ధతుల్.

భీమ. ఖం. 1 — 74

---

1 "The ancient name of the Peacock (in Tamil–Malayalam) is "tokei", the bird with tail"

"The oldest Dravidian word found in any record in the world appears to be the word for Peacock in the Hebraw Text"

"It may here be added that fron the Dravidian "tokei" would naturally be derived the Arabic Tawas"

dwell

. Comparative grammer of
Dravidian Languages P. 88—89

ఇంతియగాక జన్నయ సిద్ధమంత్రి "ఆత్మీయలిపియట్టు లన్యదేశంబుల లిపులను జదువంగ నిపుణుడయ్యెనని" జక్కన విక్రమార్క చరిత్రమున (1—50) వివరించిన అంశమును బరిశీలించిచూడ నాటి హైందవులు పారశీకాది భాషల నభ్యసించిరనియు నా లిపిలో వ్రాయుటకును సామర్థ్యమును సంపాదించుకొనిరనియు స్పష్టమగుచున్నది. ఉన్నతాధికారులు అరబీ పారశీ భాషలలో వ్యవహారము సాగింప సామాన్య మహమ్మదీయ ప్రజానీకము అప్పటికే రూపొందిన రేఖ్తా భాషనుపయోగించు చుండి యుందురని భావింపవచ్చును.

కాకతీయ రెడ్డిరాజుల యుగములందు ప్రారంభమైన అన్యభాషా ప్రభావము లనంతర యుగములనుండి ప్రగాఢమగుచువచ్చినది. బహమనీ గోలకొండ సామ్రాజ్యములు భాషా విషయమున అవలంబించిన రాజనీతి ఇందులకు దోహదమొనగినది. బహమనీ సుల్తానులు పారశీని రాజభాషగ స్వీకరించిరి. ఉర్దూభాషకూడ వారి అదరాభిమానములనొందినది. దక్కనీ ఉర్దూ గోలకొండ సుల్తానులకాలమున రాజాదరము నొందినది. స్థానిక మహమ్మదీయులకును, పారశీకదేశములనుండి వచ్చిన మహమ్మదీయాధికారులకును ఏర్పడిన స్పర్థలు భాషా విషయమునకూడ ప్రభావమునుగలిగించినవి. గోలకొండ సుల్తానులు పారశీతోపాటు దక్కను భాష నాదరించుట పరిశీలింపదగిన అంశము. అసలు ఉర్దూ ఉత్పత్తినిగూర్చి విద్వాంసులు పరిశీలనము జరిపినప్పుడు ఉర్దూ దక్కనులోనే ఆవిర్భవించినదని విశ్వసించువారును కొందరుకలరు. ఈ వాదములోని సత్యాసత్యములెటులున్నను దక్కనీ భాషాభిమానము గోలకొండ సుల్తానులకు మిక్కుటముగ నుండెననునది సత్యము. పాలిత ప్రభువుల ఈ అభిమానదృష్టి తెలుగు కవులను కూడ ఆకర్షించినట్లె తోచుచున్నది. ఈ యుగముననే అచ్చ తెనుగు కావ్యము తొలిసారిగ వెలువడుటకు పై అంశమే ప్రధానకారణముకావచ్చును. అన్ని కారణములతోపాటు పై కారణముకూడ తెలుగు కవులను అచ్చమైన తెలుగు రచనలొనర్చుటకు దోహద మొనర్చియుండును.

సుల్తాన్‌ఖులీ తెలుగులో పద్యరచనచేసినట్లు డా. జోర్‌గారు కులీ జీవిత చరిత్రలో వివరించిరి కాని అట్టి పద్యములు నేటికిని లభించలేదు. గోలకొండ సుల్తానుల అధికారము మచిలీపట్టణమువఱకు వ్యాపించియుండెను కనుక నాడు ఉర్దూ పారశీకముల ప్రభావము కేవలము తెలంగాణమువఱకే పరిమితమైయుండలేదు.

గోలకొండ ముట్టడితో ఈ ప్రాంతములు మొగలు సుబేదారుల అధీనములో నుండెను ఔరంగజేబు మరణానంతరము ఈ ప్రాంతములందంతర్యుద్ధము లారంభ

మైనవి. సుబేదారులు ఎవరికివారు తమతమ మండలములందు స్వాతంత్ర్యమును ప్రకటించిరి. పదునెన్మిదవశతాబ్దిపూర్వార్థమునందు నిజాముల్ ముల్కు తెలంగాణము నందు ఆసఫియా సామ్రాజ్యమును స్థాపెంచెను. పారశీ ఉర్దూ భాషలకు వీరొసగిన అత్యధిక ప్రాధాన్యము తెలుగుపై ఆభాషల ప్రచార మత్యధికమగుటకు దోడ్పడినది. ఆసఫ్జాహి ప్రభువులు పారశీకమును రాజభాషగా స్వీకరించినను ఉర్దూ భాషకును తగిన గౌరవస్థానము నొసగిరి. పదునెన్మిదవ శతాబ్ది చివరను పందొమ్మిదవ శతాబ్ది ఆరంభమునను తెలుగు భాషపై పారశీ భాషా ప్రభావముతోపాటు ఉర్దూ భాషయొక్క ప్రభావము కలుగుటకు కారణము బందోబస్తు ఆభాషలలో జరుగుటయే

తెలాంగణపు తెలుగుభాషపై పారశీ ఉర్దూలప్రభావము మిక్కుటముగ నేర్పడుటకు రెండు సంఘటనలు ప్రధానముగ గలవని స్పష్టమగుచున్నది.

ఆసఫ్జాహి ప్రభువులలో నవాబు మహబూబ్ అలీఖాఁగారి పరిపాలనా కాలమున క్రీ. శ. 1890 ప్రాంతమునందు రాజభాషనుగూర్చి అధికారికముగ కొన్ని చర్చలు జరిగినవి. నాటివఱకు ప్రభుత్వ వ్యవహారములు పారశీలో జరుగుచుండెను. కోర్టులలో నాజిమ్లు (న్యాయాధిపతులు) తమ తీర్పులను పారశీకమునందే వ్రాయు చుండిరి సాక్షుల అభిప్రాయములనుకూడ వారు పారశీకమునందే వ్రాసికొనుచుండిరి. తరువాత అదాలతు నాజిమ్లు సాక్ష్యములను ఉర్దూలో వ్రాసికొనుటకు ననుమతింపబడిరి నాలుగైదు సంవత్సరముల అనంతరము 1894 ప్రాంతమున కోర్టు వ్యవహారములు, సాక్ష్యములు, తీర్పులు మున్నగునవి ఉర్దూలో మాత్రమే వ్రాయవలయునను నిర్బంధ మేర్పడినది. కోర్టు వ్యవహారములకు సంబంధించినవారు తమ దరఖాస్తులను పారశీకమునందుకాని ఉర్దూ యందుకాని వ్రాయవచ్చునను సౌకర్యము మాత్రముండెను. రెవిన్యూ. బందోబస్తు మున్నగు శాఖలకు సంబంధించిన వ్యవహారమంతయు ఉర్దూలో జరుగవలయునని నాటి ప్రభుత్వమాదేశించినది. తదితర శాఖలందిట్టి నిర్బంధము లేనందున ప్రభుత్వ వ్యవహారమునందొక విధమైన ద్వంద్వ విధానమేర్పడినది. కొన్ని శాఖలందు పారశీకము మఱికొన్ని శాఖలందు ఉరుదూలో వ్యవహారము సాగుటవలన సంకట పరిస్థితి ఏర్పడినది. దీనిని తొలగించుటకు 1884 సంవత్సరములో నొక ప్రత్యేకమైన ప్రభుత్వాజ్ఞ వెలువడినది. ఇది చరిత్ర ప్రసిద్ధమైనది. ఈ "జరీదగైర్ మామూలీ" 23 రబ్బీసాని 1301 హిజరీలో ప్రకటితము.

తెలంగాణా ప్రాంతములందు ఈ జరీదాప్రభావము మిక్కుటముగా బడినది. గ్రామస్థాయివఱకు పటేల్ పట్వారీలు తమ తమ పత్రములను, ప్రజల నుంచి

పొందిన విన్నపములు తెలుగులో నుంచుకొనవచ్చునను సౌకర్యము తరువాత కలిగినది. నాటినుండి నేటివఱకును పహేలు పట్వారీల తెలుగుభాష పారశీ ఉరుదూ పదముల మేళనముతో రూపు దిద్దుకొనియున్నది.

ఇక రెండవదియు నతిముఖ్యమైనదియునగు సంఘటనము ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపనము. రాష్ట్రమందలి హైస్కూలు తరగతులనుండి ఎం. ఏ. వఱకును ఉరుదూ బోధనాభాషగ స్వీకరింపబడినది. ప్రభుత్వోద్యోగముల నాశించువారును, ఉన్నత విద్యాభ్యాస మొనర్చువారును నిర్బంధముగ నుర్దు నేర్చుకొనవలసి వచ్చినది సామాన్య జనవ్యవహారమునను ఉర్దూలో పరిచయముగలిగి యుండుట తప్పనిసరియైనది ప్రాథమిక, మాధ్యమిక ఉన్నత తరగతులందు తెలుగు ఐచ్ఛికముగ బోధింపబడుచుండెను. ఆసఫ్‌జాహి వంశీయులు తెలుగుభాష నాదరించుపట్ల ఏమాత్రము ఆసక్తిని చూపలేదనుట చారిత్రకసత్యము. ఢిల్లీ, అలీగడు, లక్నోలవలె దక్షిణమున హైద్రాబాదు ఉరుదూ పారశీకములకు ప్రధాన కేంద్రముగ నుండెను. ఉరుదూ పారశీకములకు కంచుకోటగా నిలిచినది హైదరాబాదు

ఇట్టి వాతావరణమున ఇచ్చటి తెలుగుభాషపై ఉరుదూ పారశీకముల ముద్ర అత్యధికముగ గన్పట్టుటలో నాశ్చర్యము లేదు.

పంథొమ్మిదవ శతాబ్దివఱకు పారశీ ఉరుదూల ప్రభావము కేవలము భాషా విషయకముగ ప్రాధాన్యము వహించుచున్నది. మిశ్రభాషా కవిత్వము ఈ యుగము నాటి ప్రత్యేకత. ఈ శతాబ్దమునుండియే పారశీ ఉరుదూ సాహిత్యములు తెలుగుపై ప్రభావమును గలిగించినవి. ఉరుదూ పారశీకములను బాగుగ నభ్యసించినవారును, ఆయాభాషల సాహిత్యముతో నాంగ్లము మున్నగు భాషలద్వారా పరిచయముకలవారు ఉరుదూ పారశీక సాహిత్య సంప్రదాయములను తెలుగులో ప్రవేశపెట్టిరి వినోద కథలు, నవలలు, కథలు, పద్యకావ్యములు, గజళ్లు, శాస్త్ర గ్రంథములు తెలుగులో ననూదితములైనవి. కేంద్ర రాష్ట్ర సాహిత్య అకాడమీలు భారతీయభాషల సాహిత్యములను పెంపొందించుకృషిలో ఇరుగు పొరుగు సాహిత్య సంప్రదాయములు తెలుగులో నెన్నియో ప్రవేశించినవి. అతివిస్తృత పరిధిలో గన్పట్టుచున్న ఈ ప్రభావమును బరిశీలించుటకు కొన్ని పరిమితు లేర్పఱచుకొనుట ఆవశ్యకము:—

# పరిశీలనా విధానము

తెలుగుపై ఉరుదూ పారశీకముల ప్రభావమును గూర్చి పరిశీలించుటకు పూర్వము ఈవిషయమున నింతకు మున్ను జరిగిన కృషిని సంగ్రహముగ బరిశీలించుట అవసరమని తోచుచున్నది. ఈ రంగమున కృషిచేసినవారిలో డా॥ చిలుకూరి నారాయణ రావు, సురవరము ప్రతాపరెడ్డి, కోరాడ రామకృష్ణయ్య, తూమాటి దోణప్ప మున్నగు వారు ప్రముఖులుగ గన్పట్టుచున్నారు. బ్రౌన్ మున్నగు పండితుల కృషి ప్రత్యేకముగ గమనింపదగినది. ఈ పండితుడు ఉరుదూ పారశీకములతోపాటు తదితర అన్య దేశ్యముల ప్రయోగములను నిఘంటువు రూపమున సంతరించెను. మిశ్రభాషా నిఘంటువు, జిల్లా డిక్షనరీ మున్నగునవి వీరి పరిశోధన కృషి ఫలితములు.

డా॥ చిలుకూరి నారాయణరావుగారు ఆంధ్ర భాషలోని అన్య దేశ్యములను గూర్చి ఆంధ్రభాషా చరిత్రమున ప్రత్యేక ప్రకరణములో విపులముగ వ్రాసిరి.[1] శబ్దములందును అర్థములందును వచ్చిన మార్పులను భాషాశాస్త్ర దృష్టితో వీరు విశదముగ బరిశీలించిరి. శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు ఆంధ్రులసాంఘికచరిత్రమను గ్రంథమునందును, శుకసప్తతి మున్నగు గ్రంథముల లఘుటీకలందును తదితర వ్యాసములందును ఉరుదూపారశీక శబ్దముల గూర్చి ఎన్నియో వివరములొసగిరి. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు "ఆంధ్ర దేశము-అన్య దేశ్యము[2]" వంటి ఉత్తమ వ్యాసములు ప్రకటించిరి. ఇటీవల శ్రీ తూమాటి దోణప్పగారు "శ్రీనాదయుగము—అన్య దేశ్యములు" అను శీర్షికతో నాంధ్ర ప్రదేశ్ పత్రికలో చక్కని పరిశోధక వ్యాసములు బ్రకటించిరి.[3]

ఆచార్య గంటి సోమయాజిగారి పర్యవేక్షణమున శ్రీ లకసాని చక్రధర రావుగారు ఆంధ్ర భాష యందలి అన్య దేశములగూర్చి ప్రత్యేకముగ బరిశోధన మారంభించియుండిరి. వారి కృషి ఫలితమునుగూర్చి ఎట్టి వివరములు దెలియవు.

వీరందరును భాషాశాస్త్ర దృష్టితో నన్య దేశ్యములనుగూర్చి మాత్రమే పరిశీలించిరి. అన్యదేశ్యములలో మహారాష్ట్రము మున్నగు భాషా పదములు చేరును.

---

1 ఆంధ్ర భాషా చరిత్ర I vol 1937 తెనుగునఁజేరిన యన్య దేశీయ శబ్దజాలము" పుటలు 575—621 వఱకు.

2 భాషా చారిత్రక వ్యాసములు 1954

3 ఆంధ్ర ప్రదేశ్ మార్చి 63 నుండి జూలై 63 వఱకు

పారశీ ఉరుదూలనుగూర్చి పాక్షికముగకాక ప్రత్యేకముగా బరిశోధనము జరుగవలసి యున్నది. పదునాల్గవ శతాబ్దినుండి తెలుగు కావ్యములలో బ్రయోగములుగన్పట్టు చున్నను నవి వ్యాకరణ కర్తలను విశేషముగ నాకర్షించినట్లు తోచదు. అప్పకవి వంటి ఒకరిద్దఱు వైయాకరణులు అన్య దేశ్యములగూర్చి తమ లక్షణ గ్రంథములందు నిశిత పరిశీలన మొనర్చిరి.

జలశయన యాంధ్ర దేశ్యం
బులు రెండు తెఱంగులయ్యె భువిశుద్ధాంధ్రం
బులు నన్య దేశజాంధ్రం
బులునాఁగామెపలినామ పురవరధామా అప్ప క. ప్రథమ-105

తెలుగులో బ్రవేశించిన వేలకొలది పారశీక ఉరుదూ పదములగూర్చియు, ఆ భాషల ప్రభావమున పదములందేర్పడిన మార్పుల గూర్చియు, సాహిత్య ప్రభావమును గూర్చియు, ప్రత్యేకముగ తెలంగాణపు తెలుగుపై ఆ భాషలు ప్రసరింపజేసిన ప్రభావమును గూర్చియు బరిశోధనము జేయుటకు జరిగిన తొలి ప్రయత్నము ప్రస్తుత గ్రంథ రచనము.

విషయ మతివిస్తృతమైనది. కావ్యప్రయోగములు అర్థ వివరణము, పద బంధములు, క్రియా రూపములు, భాషాశాస్త్ర విశేషములు, సాహిత్య ప్రభావము మున్నగు అంశములలో నొక్కొక్క విషయమునుగూర్చి ప్రత్యేకముగ బరిశీలింప దగినంత అవకాశము కలదు. గ్రంథ పరిమితిని దృష్టిలోనిడికొని ఈ అంశముల గూర్చి సాధ్యమైన కృషియొనర్చి ఒక్కొక్క అంశముపై సమగ్రము కాకున్నను స్థాలీ పులాక న్యాయమున కొన్ని విశేషముల జూపుటకు ప్రయత్నించితిని.

గ్రంథమును ప్రధానముగ రెండు భాగములుగ సంతరించినాను. ప్రయోగ ప్రకరణము భాషా విశేషములు ఒక భాగము సాహిత్యప్రభావము మఱియొక భాగము. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీవారు తెలుగుపై పారశీ ఉరుదూ సాహిత్యముల ప్రభావము అను విషయముపై రచనలు వెలువరించుటకు ప్రకటించిరి. కేవలము సాహిత్యమునుగూర్చి పరిశీలింపక కావ్య ప్రయోగములు భాషా విశేషముల గూర్చి వివరించుట విషయ పరిధికి అతీతమని సామాన్య దృష్టితోజూచిన దోపవచ్చును. కాని కావ్యము నుండి శబ్దార్థములను విడదీయలేము. ప్రాచీనాలంకారికులు కావ్యములందు శబ్దార్థములకు సముచిత ప్రాధాన్యము నొసగియున్నారు. కావ్య నిర్వచనముపట్ల వారి దృష్టి ఎట్టిదో ఈ నిర్వచనముల బరిశీలించినచో స్పష్టమగును.

1. కావ్యశబ్దోఽయం గుణాలంకార సంస్కృతయోశ్శబ్దార్థ యోర్వర్తతే–
(కావ్యాలంకార సూత్రవృత్తి)
2. నను శబ్దార్థౌ కావ్యం – (కావ్యాలంకారః)
3. శబ్దార్థౌ సహితౌ వక్ర వ్యాపార శాలిని .. ... (వక్రోక్తి జీవితమ్)
4. గుణాలంకార సహితౌ శబ్దార్థౌ ......కావ్యమ్ (ప్రతాపరుద్రీయమ్)
5. శబ్దార్థౌ సహితౌ కావ్యం–
6. తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ క్వాపి –

మున్నగు నిర్వచనములిట్టివి. కావ్యశైలికి వన్నెగూర్చు ప్రయోగములు, మిశ్రభాషా పద్య రచనము, ఈ కారణములచేత బ్రధానముగ బరిశీలింపదగినవి. భాషా సాహిత్య ప్రభావమును నిరూపించుటకు కావ్య ప్రయోగములు చూపుట ఆవశ్యకము. తత్ప్రభావ విశేషములను జూపుటకు భాషాశాస్త్ర దృష్టితో ప్రయోగముల బరిశీలనముకూడా అత్యావశ్యకము.

ప్రాచీనార్వాచీన కావ్యములలోని ప్రయోగముల నన్నింటిని చూపుట అనవసరమని భావించి ఒక్కొక్క యుగమునందలి విశిష్ట కావ్యములందును, ఆయా యుగములలోని రచనలందును గన్పట్టు విశిష్ట ప్రయోగములను శైలీ వైవిధ్యమునకు వన్నెగూర్చిన ప్రయోగములను గ్రంథ పరిమితిని దృష్టిలో నిడికొని పరిశీలింపనైనది ఉర్దూభాష సంకరభాష. అందు సంస్కృతము, ప్రాకృతము, హిందీ, తుర్కి, అరబీ, పారశీ మున్నగు భాషా పదములు చేరినవి. తెలుగువారికి ఉర్దూ భాష ద్వారా పరిచితములైన కొన్ని శబ్దములును నిందుచేరినవి. భిన్న విభిన్నములైన సాహిత్య ప్రక్రియలందును ఉర్దూ పారశీక ప్రభావమును సూచించు పదజాలమును గూర్చియు వివరములొసగబడినవి. ఆధునిక సాహిత్యమున ఉరుదూ పారశీక పదముల ప్రయోగములు లెక్కకు మీరి యున్నవి. స్థాలీపులాక న్యాయమున కొన్ని ప్రయోగములే ఉదాహృతములు. పూర్వకవి ప్రయోగములే అనంతర కావ్యములందు గన్పట్టినప్పుడు అవి సందర్భానుసారముగ కొన్ని మాత్రమే వివరింపబడినవి. ఈ ప్రయోగములను భాషా శాస్త్ర దృష్టితో పరిశీలించుటయు జరిగినది.

రెండవ భాగమున అనువాద సాహిత్యము విమర్శింప బడినది. సాహిత్య సాంప్రదాయములను నవలలు, కథానికలు, వినోదకథలు, పద్యకావ్యములు, గీతికలు, శాస్త్ర గ్రంథములు మున్నగు వానిని గూర్చియు, ననువాద రీతులను గూర్చియు నిశితముగ బరిశీలింపనైనది. పద ప్రయోగ ప్రకరణమునందు పదములకు మాతృక సూచింపబడినది. అవసరమగు పట్ల అర్థ వివరణముకూడ కలదు.

# కవి ప్రయోగములు

## నన్నయ - నన్నెచోడుడు

నన్నయ, నన్నెచోడుల కావ్యములందుగల కొన్ని పదముల ప్రయోగముల గూర్చి పండిత పరిశోధకులలో భిన్నాభిప్రాయములు గలవు. వీరు నన్నయ నన్నెచోడుల ప్రయోగములగూర్చి చక్కని పరిశోధక వ్యాసములు వ్రాసిరి. శ్రీ దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారును, శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారును ఈ ప్రయోగములు పారశీ భాషా మూలకములని నిరూపించుటకు ప్రయత్నించిరి. శ్రీ తూమాటి దోణప్ప గారు ఈ పదముల వ్యుత్పత్తిని గూర్చియు, నర్థముల గూర్చియు, ప్రయోగముల సాధుత్వమును గూర్చియు విపులముగ జర్చించి అవి పారశీభాషాజన్యములు కాని అరబీ భాషాజన్యములు కాని కావని వివిధ ఆధారములతో నిరూపించిరి.

నన్నయ భారతమున కిన్పట్టు 'గాడీ' అను పదము అన్యదేశమని దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారి అభిప్రాయము.

అవిరళక్షరిత దానార్ద్రి గండస్థల
 గజ సహస్రంబును గనకరత్న
రచితమై తురగ సారథి సహితంబైన
 రథ సహస్రంబును రమ్యభూష
ణాలంకృత స్త్రీ సహస్రంబు గాంచన
 శిబికా సహస్రంబుఁ జిత్రలలిత
గతి నొప్పు నే నూఱు గాడిదలను [1]
 సింధు బాహ్లిక కాంభోజ పారశీక

జాతమైన తురగశత సహస్రము లక్ష
గోధనంబు నధిక ఘోర వీర
దర్ప యుక్తులైన దశలక్ష దాశార్హ
వరుల నరణ మిచ్చె వామనుండు.

నన్నయ- ఆది ప. VIII 221

---

1 "ఏనూఱుగాడీలు" పాఠాం

సంస్కృత మూలమునందు "అశ్వతరీణాంచ" అని యున్నందున, కంచర గాడిదలను అరణమిచ్చుట తెలుగువారి సంప్రదాయమునకు విరుద్ధమని భావించి నన్నయగారు అనువాదమున ఏనూఱుగాడీలని మార్చిరని దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డి గారి వాదము. ఆంధ్ర దేశమునందలి వివిధప్రాంతములలో లభించిన ముద్రితా ముద్రిత భారత ప్రతులలోని పాఠములనెత్తిచూపి శ్రీదోణప్పగారు "ఏనూఱుగాడీలను" పాఠాంతరముగనే గ్రహించిరి.

నన్నయ భట్టారకుడు సంప్రదాయ విరుద్ధమని భావించి మూలమును మార్చ లేదనియే దోణప్పగారి అభిప్రాయము. "చిత్రలలిత గతి నొప్పునవిసజీవములగు 'గాడిద' లేగాని నిర్జీవములగు 'గాడీలు' కావు" అని దోణప్పగారి వ్యాఖ్యానము. కొన్ని ప్రతులలోని పాఠాంతరములను ఆధారముగ గ్రహించిన అదియే సరియైన పాఠమని విశ్వసించి నన్నయ అన్యదేశములను బ్రయోగించెనని నిర్ణయించుట సమంజసముగ గన్పట్టదు. ఈ సందర్భమున శ్రీ దోణప్పగారి అభిప్రాయములు సోపపత్తికములు గను, అంగీకార యోగ్యములుగను నున్నవి. [1]

ఇక నన్నెచోడుని ప్రయోగముల గూర్చి విచారింపలసి యున్నది. కైఁవు, తరివారి, బాఁకు అను పదము లన్యదేశములనియు నవి నన్నెచోడుని కాలమును నిర్ణయిం చుట కాధారములుగనున్నవనియు శ్రీ వేదం వేంకట రాయశాస్త్రిగారి వాదము [2] ఇవి అన్యదేశ్యములుకావని శ్రీ తూమాటి దోణప్పగారి అభిప్రాయము.

కుమారసంభవ కావ్యమందు కైవు అనుపదము పదునాలుగు పద్యములలో గన్పట్టు చున్నది. వానినిలో కొన్ని ఇవి:—

1. "భానుగఁగనికై
   పున మండెడు సూర్యకాంతపుత్రిక వోలెన్. II 43

2. కైవునదాకి యేకాదశరుద్రు లుత్కల శీకరాఖ్యుల గెలిచిరి 12–60

---

[1] నన్నయ, నన్నెచోడుల ప్రయోగములగూర్చి దోణప్పగారు "నన్నయ అన్యదేశ్యా భాసములు, నన్నకవిద్వయము అన్య దేశ్యాభాసములు, అను పరిశోధక వ్యాసములను ఫిబ్రవరి, మార్చి, నవంబరు, డిసంబరు 1962 సాహితి సంచికలందు వ్రాసిరి.

[2] నన్నె చోడుని కవిత్వము. (1963)

3. ........ జెట్టిగ వీరులైదురము
సేసిరి కైపున నీటెకాఱినిన్- 11-148

4. . ... సురాసుర వీరులొండొరులంగని కైపుమిగిలి మహాఘోర యుద్ధంబు సేయ దొడంగిన 11-115

5. ఘనతర దీర్ఘ దంతములు
కైపున నూఱియు- 12-72

మున్నగు ప్రయోగములు పరిశీలనార్హములు, కైపు అను పదము కొన్ని పద్యములందు సబిందుకముగను మఱికొన్ని పద్యములందు నిర్బిందుకముగను ప్రయుక్తము; అరబీ పదమగు కైఫ్‌నుండి ఈ కైపు ఏర్పడినదని శాస్త్రిగారి అభిప్రాయము. ఇది సమంజసముగా లేదని సబిందుక రూపమే ప్రమాణముగనున్నది. నన్నెచోడుడు ఉద్రేకము, కోపము, ద్వేషము మున్నగు అర్థములందీ పదమును బ్రయోగించెననియు, అరబీ కైఫ్‌నకివి భిన్నముగా నున్నవనియు నిరోపించిన దోణప్పగారి అభిప్రాయము సమ్మతముగ నున్నది.

తరవారి:- నన్నెచోడుడీ పదమును మూడు పద్యములందు ప్రయోగించెను.

ఇలఁజిత్రము తారకకర
తల సంగతమైన ఘోర తరవారి సొరిన్
నిగువగుఁదను జొరకడరినఁ
దలమునుక యగు న్విరోధితతి కజ్జభవా

కు. సం. 4-14

భూరి తరవారి వారిరు
హారావానంత నాగహరి భూధర ల
క్ష్మీ రమణీ శోభితుఁడై
వీరధిపతిఁబోలె వాహినీ విభుడగుటన్ 11-15

ముంచిరి శర వర్షంబుల
జించిర దృఢకవచ సమితిఁజేద్వడి రిపులన్
దుర్రించిరి నిజ తర వారుల
నించిరి తమ కీర్తి దిశల నెఱయగ సుభటుల్ II-116

తరవారి, అమరము మున్నగు సుప్రసిద్ధ సంస్కృత కోశములందు గన్పట్టదని వేదం వారి వాదము. సంస్కృత నిఘంటువులేకాక క్రీ.శ. ఏడవ శతాబ్దికి పూర్వ కావ్యములందును నీ పదము ప్రయుక్తమైనదని దోణప్పగారు గ్రంథ ప్రయోగముల్ జూపిరి ఇది తత్సమ పదమనియే దోణప్పగారి నిశ్చయము. ఈ విషయమునందభి ప్రాయ భేదమున కాస్కారము లేదు.

బాకు:- దేవ సైన్యములు కుమారస్వామి ఆధిపత్యమున తారకాసురునిపై దండెత్తిన సందర్భమున 'నిజాధీశ్వరుల కుత్సాహంబుగా వీరపురుషులు మహోత్సాహంబులు పలుకు' ఘట్టమునందు నన్నెచోడకవి వ్రాసిన పద్యమిట్లు కలదు.

పోరఁబాకు దాల్చి నీరుగొన్నటు ప్రతి
బలమునెల్లఁబాయదడఁగఁదోలి
గొడుగు క్రింది రూపుఁబొడిచి జయంబు నీ
కిత్తు నధిప నన్ను నింతనమ్ము- 11-37

పోరబాకు దాల్చి అను ప్రయోగము ఒకటి రెండు సందర్భములందు కలదు. వానినాధారముగ గ్రహించి వేదం వేంకటరాయశాస్త్రిగారు బాకు అనగా కత్తి అను అర్థమున గ్రహించిరి. వీరి పాఠాంతరము గ్రహించినచో నన్వయము సరిగా కుదురదు. నీరుగొన్నటు పదమునకర్థము కుదురదు పోరఁబాకు దాల్చి అనుటయే అన్వయమును సరిగా కుదుర్చుచున్నది. "పాఁకు దాల్చు నీరు గొన్నటు" అను అన్వయ క్రమము సమంజసముగా నున్నది. ఈ దృష్టితో బరిశీలించినచో "బాకు" పదప్రయోగము గూర్చి సమస్యలేదని దోణప్పగారు నిర్ణయించిన విధము సముచితముగ నున్నది.

ఈ ప్రయోగముల ఆంతర్యము బరిశీలించినచో నన్యదేశ్య ప్రయోగము లొనర్చినవారిలో నన్నయ నన్నెచోడులు ప్రథములుగారని స్పష్టమగుచున్నది. తిక్కన ప్రయోగముల గూర్చి ఎట్టి సందేహమునులేదు. తిక్కననాటికి మహమ్మదీయులాంధ్ర దేశమునందు దాడులు సలుపలేదనియు భావించుట పొరపాటు. అరబ్బు దేశీయులతో డను తురుష్కులతోడను మనకు క్రీ.శ 1300 సంవత్సరమునకు బూర్వమే సంబంధ మేర్పడిన అంశము చారిత్రక సత్యము. శ్రీనాథ యుగమునాటికి మహమ్మదీయుల దండయాత్ర లారంభమగుటయు వారు రాజకీయముగ దేశమును ప్రభావిత మొనర్చు

టయు చారిత్రకాంశములు. ఈ యుగమునాటి పారసీక పదప్రయోగములు ఎన్నియో తార్కాణముగ నున్నవి.[1]

## తిక్కన సోమయాజి

తిక్కన సోమయాజి ఆంధ్రమహాభారతమునందు ఒకటి రెండు పారసీ పదములను ప్రయోగించెను. ఈ పదముల వ్యుత్పత్తినిగూర్చి కాని అర్థములందు కాని వివాదాస్పదములగు అంశములుకాని సందేహాస్పదములగు విషయములుకాని లేవు.

త్రాసు = ఇది తరాజూ అను పారసీ పదమునకు తెలుగు రూపము. మహమ్మదీయులు మనదేశముపై దండయాత్రలు సలుపకపూర్వమే కొన్ని పదములు దేశ వ్యవహారములో ప్రచలితములైనవని ఈ పద ప్రయోగములు నిరూపించుచున్నవి. తిక్కన ప్రయోగములు కేవలము అన్యభాషా పదముల నుపయోగించు మోజుతో నొనర్చినవికావు అవి సందర్భశుద్ధి కలవిగను, భావస్పష్టతకు దోహదకరములుగను ప్రయోగింపబడినవి

1. "... త్రాసు లంటోవి చిత్తంబుల తోడుత" శాంతి $2\text{-}37_4$

2. ధనము కలిమియు లేమియు త్రాసునందు
   నిలిపి యెత్తంగ ములుసూపెనిర్ధనత్వ
   మెక్కుడై దానిదిక్కున నెట్టులన్న
   వినుము గుణదోషములభంగి విస్తరింతు. శాంతి 4-33

తక్కెడ అను అర్థమునందే తరాజు పదముయొక్క వికృతరూపము త్రాసు ఇట ప్రయోగింపబడినది.

తిక్కన శిష్యుడును. నతని సమకాలికుడగు కేతనయు త్రాసు పదమును ప్రయోగించెను.

---

[1] శ్రీనాథ యుగములోని కొన్ని కావ్య ప్రయోగములు విశిష్టములైనవి. నా దృష్టికిరాని కొన్ని ప్రయోగములను గూర్చియు, నన్నయ నన్నెచోడుల ప్రయోగముల అంతర్యమును గూర్చియు శ్రీ దోణప్పగారు వ్రాసిన వ్యాసములు నాకు మిక్కుటముగ దోడ్పడినవి.

అచ్చులుఁ దాసులుఁ దూములుఁ
బొచ్చెంబుగఁజేసి కపటమున నమ్మెడి యా
మ్రుచ్చు వణిజులొక్కొక్కఁడ
యచ్చుగఁ బండెడు మాడలరువగవలయున్.

విజ్ఞానేశ్వరము-ప్రాయశ్చిత్తకాం. 65

సత్యదినంబున సరితాసు పూజించి
యందు దిక్పాలుర నావహించి

—విజ్ఞా—వ్యవహారికాం. 117

పదునాల్గవ శతాబ్దిలోనుండిన నాచన సోమనయు ఈ పదము నుత్తరహరి వంశమున ప్రయోగించెను.

• విసరి త్రాసునందూచు వారునుంబోలె— IV—256

శ్రీనాథుని కావ్యములందును నతని యుగములో నుండిన జక్కన, నంది మల్లయ ఘంట సింగనల కావ్యములందును ప్రయోగములు గలవు.

1. గడసిల్లు ధరయొద్ద గెడనైన నెవ్వాడు
తాసుపైఁగల్గె చందమునవంచె. భీమ. II—77

2. ఇరుపురందునప్పు డెక్కువతక్కువ
యింతలేక కూర్మి యెలుకపడియె
సహజరీతిఁ బుష్పశరుడు తాసునఁదూచి
ప్రియముతోడఁ బంచిపెట్టినట్లు. విక్ర. చ. IV-183

3. గుంపుగూడి పాదు గంధర్వ బాలికలఁ ద్రాసులందూచు బంగారు ప్రతిమల విధంబున.

వరాహ— 12 – 43

దొర : మహాభారతమునందు 'దొర' అను ప్రయోగము పలుతావుల గన్పట్టుచున్నది. 'దారా' ఈ పదము ద్రావిడ భాషలో ప్రవేశించి, తెలుగునకువచ్చినదో లేక తాసు పదమువలె వ్యవహారసిద్ధమై వచ్చినదో నిర్ణయించుటకు ఆధారములు లేవు. దారా- దొర శబ్దమాత్ర సాదృశ్యముగల పదములగుటయు సంభవమే. దారా అను పదమునుండి దొర ఏర్పడియుండునని అనుమానము మాత్రము కలుగుచున్నది.

## నాచనసోమన 1350

కోహాళి : కులహ్ శబ్దము వర్ణవ్యత్యయమున కోహాళి యైనదని తోచును. శిర్షాచ్ఛాదనము. ఉల్లడ అను అర్థములందు ప్రయుక్తము.

పార్వతీ పతికిఁ బ్రిఖాత ధూళపతిగొన్న
యలరుఁగెందమ్మిగొన్న కోహాళియసింగ

ఉ- హ- 3—86

ఈ శబ్దమును శ్రీనాధుడుకూడ ప్రయోగించెను.

"మౌళిం గోహాళి సంఘటించిన క్రియ౯ మధ్యాహ్నవేళ౯ "

హర. వి. 7—109

రంగనాథరామాయణము:- ఈ కావ్య కర్తృత్వము వివాదాస్పదమైనట్లే కవికాలము కూడ ఖండన సాధ్యముకాని విధముగ నిర్ణయముకాలేదు. నాచన సోమునకు కొంచెము ముందువాడో సమకాలికుడో స్పష్టముగా నిర్ణయించుట కాధారములులేవు. ఈ కావ్యమునందలి ప్రయోగములలో పౌజు, కుందనము, అపరంజి, అనుపదములు విచారింపదగినవి.

పౌజు:- వావిళ్ళవారు ప్రకటించిన ప్రతిలోని రూపము నిర్భంధిపబడినదిగా నున్నది. ఇదియే సరియైన రూపము.

పచ్చమిన్న సలాక పౌజుపై వేడ్కఁ
గ్రుచ్చిన ముత్యాల కోవలై యొప్పెడి.

రం. రా. అరణ్య కాం. పుట 133

అపరంజి కుందన శబ్దవిచారము శ్రీనాధ ప్రయోగములలో నొనర్పబడినది.

## శ్రీనాధుడు :-

అసలు:- అచ్చమైన మడికార రూపమున శ్రీనాధుడీ ప్రయోగము నొనర్చెను, ఇది భావపుష్టికి తోడ్పడిన ప్రయోగము.

అమ్మ నీయల్లుని నసలే నెరుంగ
ఏ రీతి చెలియుదు నేయుపాయంబు

పల్నా. చ. పుట 73 పంక్తి 78,78

ఈ పదము నేటికిని నుడికార రూపమున నిలిచియున్నది. ఇది అస్ల్ అను అరబీ పారశీక పదమునుండి ఏర్పడిన రూపము.

ఖర్చు:- నిత్య వ్యవహారమున నలిగిన పదమిది. ఖర్చ్ అను అరబీ శబ్దభవము, వ్యయమని అర్థము. ఈ భావమును వ్యక్తీకరించుటకు వ్యయము అను పదముకంటె ఖర్చు అను పదమే వ్యవహారమునందు బహుళముగ గన్పట్టుచున్నది.

అన్నపు ఖర్చుల కాకుపోకలకు
ఈ నున్న దేమైన యిపుడె యిప్పించు.

పల్నా. చ. పుట 79 పంక్తి 116, 117

గుల్లాము:- ఇదియు భావపుష్టికి ప్రయోగింపబడిన పదము. గులామ్ శబ్దభవము.

"లంజ తల్లియె యిదియు గుల్లాముగాక." క్రీడా.

మైజారు - బజారు:- పారశీపదములను ప్రసిస్థానములందు ప్రయోగించి శైలికిని భావమునకును వన్నెగూర్చిన కవి శ్రీనాధుడు. అనంతర యుగములందిట్టి పద్ధతి బహువిధముల ననుకరింపబడినది.

పూజారివారి కోడలు
మైజారగ బిందెజారి దబ్బునఁబడియెఁ
మైజారు కొంగు దడసిన
బాజారే తిరిగిచూచి పక్కున నవ్వెఁ.

—చాటువు

బాజారే తొంగిచూచె జనసందోహము చూచెనని భావము. అలంకారిక ప్రయోగమిది బాజార్ పారశీ శబ్దము. మైజారు శబ్దమునుగూర్చి చర్చింపవలసి యున్నది. సందర్భమునుబట్టి మై+జాఱు=శరీరమునుండి. జారుకొంగు అని సరసమైన అర్థము సాధించుట కవకాశము కలదు కాని మి జర్ అనుశబ్దమే మైజారుగ ప్రయుక్తమని తోచుచున్నది. మొనకు కట్టుకొను వస్త్రమని అర్థము.

దస్త్రాలు - కలములు

'దస్త్రాలుఁ మసి బుర్రలుఁ' అని శ్రీనాథుని చాటువు. వేపారిని వర్ణించిన పద్యమిది. దిఫ్తర్ అను పదము నుండి దస్త్రము ఏర్పడినది. ఖలమ్ అను పారశీ శబ్దభవము కలము.

కమరు:- అన్య దేశ్యములను తత్సమ పదముల తోడను. సంస్కృత సమాసమధ్యమున ప్రయోగించుటయందు శ్రీనాథుడు సిద్ధహస్తుడు. లలి కింపయుక్త మగునట్లు పదముల నాతడు స్వీకరించెను కమర్ అను పారసీపదమునకు కమరు తెలుగు రూపము. నడుము అని అర్థము. నడుమునకు అలంకరింపబడెడు ఆభరణ విశేషమను నర్థమున శ్రీనాధుడు ప్రయోగించెను. ఒడ్డాణమని అర్థము.

(1) కటి మండలము మీఁద వజ్రాల కమరు గర్వించుచూప.

కా. ఖ. III 240

(2) వజ్రాల కమరు నిల్పి — కా. ఖ. VII. 147

(3) వజ్రాల కమరు రేవ విడంబనము సేయు
నే కొండ మొలచుట్టు నిండుతనయు.

శివ. రా. II. 3

(4) యానచక్రోద్ధురంబగు నితంబము మీఁద
నవరింపవేల వజ్రాలకమరు.

శివ. రా. II. 26

కుల్లా:- "కుల్లా యుంచితి కోక చుట్టితి మహా కూర్పాసముందొడిగి" అనను పద్యమునందెత్తు గడలోనే పారశీ పదమును స్వీకరించి తానను భవించిన ప్రాభవమును కన్నడ రాజ్యలక్ష్మికి నివేదించెను. బట్టటోపి అను అర్థముగల ఈ పదమునకు పారశీ కులహ్ శబ్దము మూలము.

కుల్లాయి గట్టితేనేమి మాగాంధి కోమట్టై పుట్టితేనేమి అను ఆధునిక ప్రబోధ స్తుత్యాత్మక గేయమునందును ఈ పదము ప్రయోగింపబడినది.

జరి:- జర్ అను పారశీకపదమునుండి ఏర్పడిన రూపము. ధనము. బంగారు అని అర్థము. శ్రీనాధుడును అనంతరకవులును ఈ పదమును బంగరు నూలి

పోగు, బంగరు మొలాము అను అర్థములందు ప్రయోగించిరి. జరీతార్ అనుపదమే జలతారు అయినది.

జరిగొన్న వెలిపట్టు జన్నిదంబులతోడ
రత్నాలతారహారము ధరించి.

శివ. రా. II 90

జరికొన్న వెలిపట్టు జన్నిదంబులుగ- క్రీ. డా. 42

రమణీయమైన వర్ణన యొనర్చు సందర్భమున జన్కు_న ప్రయోగ మీ సందర్భమున గమనింపదగినది.

వెన్నెల జరియిడ్డ వెండి తీగెలఁబోలు
యజ్ఞోపవీతంబు లఱుత నమర,

విక్రమ చ. VII 43

జలపోసనము:- జర్‌పోష్ అను పారశీ పదభవము. బంగారుపూత అని అర్థము.

వలచేత బంగారు జలపోసనముతోడ
బ్రిన్నని పట్టు తోరము ధరించి.

క్రీడా. p. 14

పైఁడి జలపోసనపు కసీనంబు పట్టునింతి.

కాశీ. VI. 161

నువ్వులనూనె అనినట్లు పైడి జలపోసనము ప్రయుక్తము. జలపోసనము పూత అను అర్థమునందే స్వీకృతము. సూక్ష్మముగ పరిశీలించినచో పైఁడి జలపోసనము, బంగారు జలపోసనము. అను ప్రయోగములలో "పైఁడి, జల," బంగారుఅను అర్థము నిచ్చు పదములే.

బరాబరి:- రాజరీవిని ప్రదర్శించుపట్ల దర్బారు సంప్రదాయానుగుణముగ స్వీకరింపబడిన పదమిది. బరాబర్ అను పారశీ పదమునకు నుడికారార్థము గలిగించిన ప్రయోగములు తెలుగులో పెక్కుగలవు.

1) పటువేత్రికుల్ బరాబరు లొనరించి.

హ. చ. పు. 15 పం. 33

2) ప్రజ తండములు బరాబరిసేయ.

(గౌరవ) ద్వి. హరిశ్చంద్ర ఉ. భా 283

రోజు:— ప్రజలనోట నలిగిన మాట ఇది. రోజ్ అను పారశీ పదము నుండి ఎర్పడిన రూపము.

అమాట మీదట నమ్మరో నీవు
ముట్టవి వేసితి మూర్ఖత తోడ
అయిదు రోజులదాక . . . పల్నా.చ.ప్ర 42 పం. 80-82

పంజు :— కాంతి- ప్రకాశము అను అర్థములుగల పారశీ పదము పంజ్ దీనికి మూలము.

మాటుగా వైచిన మాంజిష్ఠ తెరయెత్తి
పంజు మంచమ్ముడిగ్గె మంజుఘోష-

హర- VII-137

నందిమల్లయ్య ఘంటసింగనలుకూడ ఈ పదమును ప్రయోగించిరి.
పెంటపంజువలె తద్రాకాదినాంతంబునన్-

ప్రబోధ. చం. IV-48

దుకాణము :- దుకాన్ అను పారశీ పదము దుక్కాన్ అను అరబ్బీ పదము దీనికి మూలము.

"ఒయ్యారంబు జూపన్ దుకాణముపై బొందిరి యోర్తువిల్చె"

—శ్రీనాధుని చాటువు.

హజారము:- హజ్రాయను పారశీ పదము దీనికి మూలము. ఆస్థానము సభ, కొలువుకూటము, మొగసాల అని అర్థము. తెలుగు కావ్యములందు బహుళముగ ప్రయోగింపబడిన పదమిది. హజ్జారము అను రూపాంతముకూడ కలదు.

1) . . .పొడుపుగొండపయిన్ రవి యొప్పెజూడగా
సమధిక లీల నింద్రుని హజారపుమేడకుఁ బైడికుండయై.

కాశీ. 1-125

2) నిరాఘాటమగు హజారంబుకడకు. వరాహ. 2-4

3) హజారంబు డాయంబోయి. .. 6-90

4) తనరు, ముగిళుల దరిహజారములు.

ద్వి. హరిశ్చ. ఉ. పు. 320

సేబాసు :- ... సంగ్రా

మాంచలమున నిదె నను మె

చ్చించెదవేనపుడు నిన్ను సేబాసందుౝ.

హర. వి. 7-63

శేబాసు- షహబాష్ అను రూపములుకూడ అనంతర కావ్యములందుకలవు. ఇది షాద్‌బాష్ అను పదభవమని తోచును.

గసగస :- ఖష్‌ఖష్ అను పారశీ పదమునకు వికృతి. ఒకరకపు దినుసు గింజలు. ఆకారమున ఆవాలకంటె చిన్నగను తెల్లగను నుండును. గసగసాలు అను పదమే గసాలు అయినది.

"గసగసలివయును." భీమఖం. 3-57

"గసగస యెసక మెసగె." కాశీ. 3-23

బిబ్బీ :- బిబి. బీబి. అను రూపములుకూడకలవు.

మబ్బు కురులుబ్బు నగవులు

బిబ్బీలకుగాక కలవె పృథివీ స్థలిపై

శ్రీనాథుని చాటువు.

బిబీ అన అంగన. బీవి దీనినుండి యేర్పడిన రూపమే. భార్య అని అర్థము. హమ్మదీయాంగనలను అర్థమునందే ఈ పదము బహుళముగ బ్రయుక్తము.

తేజీ :- ఉత్తమాశ్వమని అర్థము. అరబ్బుదేశీయమైనది. తేజి అను రూపమునందును ప్రయోగింపబడుచున్నది.

హురముౘజు బలుతేజి హరులుదెచ్చె.

హర. వి. పీఠిక 26

పడివాగె తేజీలు పాలకీజ-ళ్ళు.

పల్నా. చ. పు 4 పం. 112

అనంతర కవులును ఈ పదమును బహుళముగ ప్రయోగించిరి.

1) తేజీలు, మదమెత్తి తిరుగు నేనుగులు
నవనాథ. చ. పు 25

2) సాంబ్రాణి తేజీలు. ద్వి. హరి. ఉ. 283

3) "అంచతేజీ నెప్పళమునెక్కి" వరాహ. 7-33

వాహనమను అర్థమునందును ఈ పదము ప్రయుక్తము. అచ్చ తెనుగు కావ్యకర్త లీ పదమును దేశ్యముగా గ్రహించి ప్రయోగించిరి.

కుందనము :- పరిశుద్ధమైన లోహమని 'కుందన్' అను పారశీ పదముసకర్థము. శ్రీనాథుడు స్వర్ణమను అర్థమున బ్రయోగించెను.

1) పదియాఱు వన్నెకుందనపుఁదగడు దెగడుచు.
భీమ. ఖ. 2-55

2) కడాని కుందనంబు. కాశీ. ఖ. 7-126

తరువాతి కవుల ప్రయోగములసంఖ్యాకముగ లభించుచున్నవి. అచ్చమైన తత్సమ పదముగా గన్పట్టినను ఇది అన్యదేశ్యము.

1) కోమలికాంతితోఁ గుందనంబు. విక్రి. చ. (4)-19

2) చందంబున బుష్పంబు గుందనమున శృం. శా. 2-62

3) కుందనపు గాహళంబులు. వరాహ. పు. XI-44

4) పోరిపోరినొప్పు సలాకల
నొరసిన కుందనపుఁబూదెయును బోలె. ప్రబోధ. 1-29

సన్నాయి :- షహ్నాయ్ అను పారశీ పదము దీనికి మూలము. ఒక విధమైన వాద్యము.

శంఖసమూహంబు సన్నాయిజోళ్ళు.

పల్నా. చ. పు. 4 పం. 142

హద్దు:- పరిమితి, అవధి అను అర్థములందు కన్పట్టు ఈ పదమునకు మూలము పారశీభాష యందలి హద్ అనుపదము. అద్దుపద్దు అనుజాతీయమీపదభవమే.

1) తూరుపు దిక్కుకు తుదిమేరసుమ్ము
దక్షిణదిశహద్దులు తగవివరింతు. పల్నా. చ. పుట 87
పంక్తి 67. 78

2) పడమటికిని హద్దు బాలచంద్రుండ
కొదమ గుండ్లయనెడి గురిగ్రామమొకటి. పల్నా.చ.పుట. 87
పం. 71. 72

2) ఉభయపక్షంబుల బప్పైన బలము
నివసించి యున్నది నిశ్చలమతిని
హద్దులు చెప్పెద. పల్నా.చ.పు. 87 పం, 62, 64

సరిహద్దు:- సర్‌హద్ అనుపారశీ పదమూలకము. పొలిమేరఅని అర్థము.

చక్కగా మిరియాల సరిహద్దుదాటి
ప్రజల మేలిమి చింత పల్లెయుదాటి. పల్నా.చ.పు. 33 పం. 82,83

పౌజు – పౌఁజు ఈ పదము పంజు శబ్దభవముగా గ్రహింపబడినందున బిందుయుక్తముగను, అర్ధానుస్వారయుక్తముగను కావ్యములందు ప్రయోగింపబడినది. ఫౌజు సరియైన రూపము. ఫౌజు అను పారశీపదమునుండి ఏర్పడినది. సైన్యము అను అర్థమునందును, దండు, బృందము, గుంపు అను అర్థములందును ఈ పదము ప్రయోగింపబడినది. పవుజు అను రూపముకూడ కలదు. మధ్యయుగమునాటి శృంగార కావ్యములందును, తదితర కావ్యములందును బహుళముగ ప్రయోగింపబడినపదమిది. శ్రీనాథయుగములోని ప్రయోగములు:—

1) "పౌజుపైనడచిరి బాలురార్వురును" పల్నా చ. పు. 114 పం. 154
2) చిలుక గుఱ్ఱపుఁబౌఁజు సిరులతోడ విక్ర. 8-57
3) పార్థుని బౌజులుసేయఁబంచి జై. భా. III 98
4) పడవాలు విరూపాక్షునీక్షించి పౌఁజు లాయితంబు చేయుమనిన
వరాహ XI 57
5) విఱిగె నీ పౌజంచు విన్నవింప వరాహ XI 103
6) ఏమికారణమున మన పౌఁజురణములోన, భగ్నమయ్యె- XI 103
7) మన పౌఁజులముందర నిలిచె. ప్రబోధ 4-60

చబుకు:- చాబుక్ అనుపారశీ పదమునుండి ఎర్పడినది. కొరడాఅనిఅర్థము.

వాజి శవంబులు వడిమీర నెక్కి
చబుకుల గొట్టుచు చనుమనువారు, పల్నా. పుట 119 పం. 26 27

పిల్లలమర్రి పినవీర భద్రుడును ఈ పదమును ప్రయోగించెను.

సమరసముఁ జూపి నెఱయఁబగ్గములు వదలి
సైంధవంబుల ఛేయని చబుకు సేయ. జై. భా. 6–53

ముఖమల్లు - ముఖమాలు

మఖ్‌మల్‌ అను పదమునకు వికృతి. ఒకవిధమైన మెత్తని పట్టు వస్త్రమని పారశీ పదమునకర్థము,

1) అంతట కింకరులతివేగమునను
తూలికా తల్పంబు దూర్చియట్టి
ముఖమల్లు గుడ్డలు మునుకొని లెచ్చి. పల్నా. పుట 17 పం. 143

2) ముఖమాలు పట్టులు మొగములగట్టి
అందెలు పదముల నాయత్తపరచి .. 29 పం. 71, 72

3) కూర్చిన గంతలు కుదురుగా వెన్ను
పై గప్పి ముఖమాలు పరుపులు వేసి. .. 30 పం. 117, 118

మోళము:- ములామ్ అను పారశీ పదభవము. పూఁత అని అర్థము. "జమునినాలుకతో నెకసక్కెమాడదమకపడు పైడిమోళము గటారి" అని శ్రీనాధుని నైషధ ప్రయోగము VI 94

మలక:- మలకవారు అనగా మహమ్మదీయులని అర్థము. మలాకానుండి వచ్చిన బెత్తములను మలక బెత్తములనియు. వ్యవహరించుచుందరి. "కొత్తమలకవాళ్ళ కిల్లు చెప్పులని" క్రీడాభిరామమునందు వర్ణితము– (54)

కర్తారు - మసీదు - తురకలు

తుర్కీ దేశమునుండి వచ్చినవారు తురకలు. ఈ పదము తెలుగులో ముసల్మానులకు సామాన్యముగ తురకలని వ్యవహరించుటను సూచించుచున్నది.

"ఇదె కార్తారుడుండు తుర్కలమసీదు." క్రీ. రా. పుట 51

మసీదు:— మస్జిదు అనుపదమునుండి ఏర్పడినది. మహమ్మదీయుల ప్రార్థనామందిరము. ఆలయమును మస్జిదందురు.

కర్తారుడు:— ఈపదము ముస్లిము దేవతను సూచించునని శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు అనుమానించిరి.[1] చదలువాడ మల్లన ప్రయోగము "కర్తారుండను చుందురుష్కులు మొదల్గా గొల్వం(బ్రత్యక్షమై మార్తాండుండుదయించె"[2] ఇట్టి అనుమానమునకు దారితీసినది. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారును శబ్దరత్నాకరము అనుబంధమున అన్యదేశ్యముల శబ్దముల అర్థమును వివరించుపట్ల ముస్లిముల దేవుడని భావించిరి. కర్తారుడు ముస్లిం దేవతకాడు. కర్త యను పదమువలన నేర్పడిన రూపము కర్తారుడు = చేయువాడు, భగవంతుడు అని సామాన్య అర్థము.

తాయెత్తు:- అప్పకవి "తల్లికాపునకై కట్టదగిన యెత్తు" అని దీని వ్యుత్పత్తిని వివరించెను. కాని ఇది "తాయి + యెత్తు" అనుచిత విభాగ జనితమైన వివరణము. తఅవిజ్ అను పదమునకు వికృతిఇది. రక్షాభూషణమని అర్థము.

చెలువొందుచుండెడు చేతులరెంట
రత్నాలు చెక్కిన రమ్యాంగదములు
దండ కడియములు దంట తాయెతులు
మక్కువతోఁగట్టి పల్నా.చ.పు. 72 పం. 54, 56

కాగితము:- కన్నుల పండువైయమరు కాకితమందలి వర్ణపద్ధతుల్.
భీమ. ఖ. 1, 74

కాగజ్‌అను పదము దీనికి మూలము. చైనాభాషాపదము అరబీ పారశీయందు కాగజ్ అయినదని నిడుదవోలు వేంకటరావుగారు శబ్దరత్నాకర అనుబంధమునందు అన్యదేశ్యముల శబ్ద విచారమున వ్రాసిరి.

కిచ్చడి:- కిచ్‌రి అనుపదమే కిచ్చడియైనది. పప్పుబియ్యము కలిపి చేసిన వంటకమని అర్థము. వివిధ వస్తువులు చేర్చి చేసిన వంటకమను అర్థమునందు శ్రీనాథుడు ప్రయోగించెను.

... .. .. చారులుఁదియ్యకూరలుఁబచ్చడులుంగిచ్చడులును కాశీ. 7-185

శబ్దాలంకారపు మూసలో వేసిన ప్రయోగము.

---

1 ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పు. 308

2 విప్రనారాయణ చరిత్ర. III - 50

చికిలి:- సక్ల్ అరబీలో మెఱుగుఅని అర్థము. సక్కాలు అనగా మెఱుగు పెట్టువాడు. పారశీపదము.

చిరుసాన బట్టించి చికిలి చేయించిన
గంద్ర గొడ్డలి నిశాగిహవలతకు కాశీ. 1-121
"చికిలి చేసిన యసిదంబుచేతదాల్చి" శివ. రా. 4-74

మెఱుగుపెట్టిన అను అర్థమునందీపదము ప్రయుక్తము.

అసివారు:- అస్వర్ పారశీపదము స్వారిసైనది. శ్రీనాథుడు రౌతురూపమున అసివారు అనురూపమున బ్రయోగించెను

ఎవ్వాడు నలువతేరెక్కి యష్టాదశ
ద్వీపాళి యసివారు దిరిగెరల. కాశీ. 4-191

పెద్దన మనుచరిత్రమునందును నిదే అర్థమున గన్పట్టుచున్నది.
ఆపంచగౌడ ధాత్రీపదం బెవ్వాని
నసివారుగానేగునట్టి బయులు మను. 1-11

ఖుసి - సురధాణి

ఖుసి మీరంగా సురధాణి నిండుకొలువై కూర్చున్నచో హం. వి. 1-22

శైలీగాంభీర్యమును అలవరచుకొనిన అన్యదేశ్య ప్రయోగములివి. ఖుషీ శబ్దమునకు వికృతి ఖుసి. నాటినుండి నేటివఱకును తెలుగునోట నానిన శబ్దమిది.

సుల్తాన్ అను పారశీ పదమే సురధాణి. సురతాన, సురధాణి అను రూపముల నొందినది.

1) పండువా సురతాణి పావడంబిచ్చిన
భద్రేభములు వీధిగాచెమ్మంద. భీమ. ఖ. 1-37
2) నీకుగల ప్రసిద్ధి ఢిల్లి సురతాణికిని లేదు. క్రీడా. 185
3) దురములో దక్షిణ సురతాను నెదిరించి. హై. భా. 32
4) భావజసురధాణి నవనాథ పు 16
5) హరిహరరాయ ఫేరోజసహా సురధాణ. హర. 1-23
5) గజపతి సురధాణి గడిదుర్గములకెల్ల
నేరాజువజ్రింపు బోరుతల్పా. ప్రబోధ. 1-16

శ్రీనాథుడు దేశ, భాష, జాతి వాచక పదములనుకూడ ప్రయోగించెను.

కత్తలాణి:- ఖల్లా౯ దేశపు గుఱ్ఱము.

తెల్లనియొక కత్తలాని తేజీహయము౯. నైష. 6-96

ఖత్తలాణ రూపమును పినవీరభద్రిన వాడెను.

.......విగత త్రాణంబులగు ఖత్తలాణంబులును, శకుం. 3-114

హురుముంజి:- పారశీక దేశమునందలి ప్రసిద్ధమైన రేవు హుర్మజ్.

సింహళంబున గంధ సింధురంబులుదెచ్చె
హురుముంజి బలుతేజిహరులుదెచ్చె. హర. 1-26

అరబీ, తురుష్క, పారశీ భాషలను శ్రీనాథుడు పేర్కొనెను. తురుష్క భాష అనగా తుర్కీ భాష. తురకలు మాట్లాడుభాష తరువాత తురుష్క భాషగ వ్యవహృతమైనది.

జక్కన: 1380

గిరవు: కుదువ అను అర్థముగల ఈ పదమునకు మూలము గిరో. ఇదియే ఉర్దూలో గిరవి-గిర్వి. అయినది.

కనుదోయి మెఱుగులు కంతు తూపులకడ
గిరవుగాబెట్టితే హరిణనయన. విక్ర. చ. II-7

పాంచాల భూపాలుఁబ్రీతిరోపితునిఁజేసె
గేరళాధిపుసూను గిరవుపట్టె. విక్రి. చ. v-98

పిల్లలమర్రి పినవీరనయు ఈ శబ్దమును ప్రయోగించెను.

నామాక్షర ప్రమాణ దినంబులకుఁ దేర
గిరవున్న ముద్రియుంగరముచూచి శృంగా. శా. 4

జరీ మున్నగు పదములను జక్కనయు ప్రయోగించెను. ఫౌజునకు పవుజు అను రూపాంతర మీతని కావ్యమున గన్పట్టును.

పగలెల్లను దమునేఁచిన
వగలెల్ల దలంచి యిరులు పవుఁజులు దనపై
దెగియెత్తి వచ్చునని రవి
పగ బెగడిన భఁగి నపర వనధి నణంగె౯ విక్రి. చ. VI-63

గౌరన: 1385—1455

జులుము: జుల్మ్ అను పదము దీనికి మూలము.

జులుము లేటికి నొందు సుద్దులుమాని
తొలగుము .. .... ద్వి హరి. ద్వితీ భా. 601

గస్తుదిరుగు: పారశీ గష్త్ అను పదమునకు కాపలి, తిరుగుట అను అర్థములు కలవు. గస్తుదిరుగుట, అనగా రక్షణము నిమిత్తమై తిరుగుట, కావలాకాయుట. గస్తీ అనుపదము దీనినుండి ఏర్పడినది. తిరుగునది. సంచరించునది, అనిఅర్థము.

శాలువ: షాల్ అను పారశీశబ్దము దీనికి మూలము. ఉన్నితో చేయబడు మేలిరకమైన కంబళి అని అర్థము.

"ఉదికిన శాలువ నొసర ధరించి." నవనాథ. చ. పు. 260

నంది మల్లయ ఘంట సింగన కవులు:

లూటిసేయుట: లూట్నా అనగా దోచుకొనుట. లూటియన దోపిడి.

"రామ మమ్ము లూటిసేయరాకు." వరాహ. పు. III-92

ఈనామిచ్చు: ఇనామ్ సరియైన రూపము, తెలుగులో ఈనామైనది. బహుమతి అని అర్థము.

కరిమయూర, మరాళికలకు నొయ్యారమీ
నామిచ్చినడపు సన్నంపు నడపు వరాహ. పు. IX-159

ఈ రెండు ప్రయోగములు చక్కని జాతీయములుగ బ్రయుక్తములు.

నకీబు: పారశీ నకీబ్ నుండి ఏర్పడిన రూపము. బిరుదు, గద్యలు, చదువువారు, హెచ్చరికలు పలుకువారు, వేత్రధారులు.

1) "మొఱయు నకీబుల విధాన" వరాహ. పు. IX-112

2) .... .... పరతత్త్వరాజు మందట మిన్ను ముట్టిన
ప్రాత మినుకు నకీబుల హుంకృతి IX - 5

తబల: తబ్లా అను అరబీ పదభవము. వాద్య విశేషము.

తబల డమామికాపణడిండిమ
డిమడిమధ్వానంబు. వరాహ. పు, III 52

మేకు: పారశీ. మేఖ్ పదము దీనికి మూలము. మొలగూటము అనియర్థము.

ఈకుధరేంద్రము లోకా
లోకపు బల్గోడ దట్టిలోని కటాద్రుల్
మేకులుగా మెఱయుచు నది
గో కానఁగఁబడియెఁదెల్ల గొల్లెన భంగిన్. వరాహ. పు. VI 84

బరాబరులు చేయన్: హెచ్చరికలు చేయుట.

ఉద్ధత వ్యాహారంబులచే బరాబరులు చేయన్ వరా. పు, XI 9

గిరువు: గిరవునకు రూపాంతరము.

హరిణ కరిహరి చమరంబులక్షి కుంభ
మధ్య వాలాకృతులుదెచ్చి మనుపుకొఱకు
భిల్లపతి యింట గిరువులు పెట్టెననఁగ
దృక్కు చవలగ్న చికుర చారిమల నొప్పు. వరాహ. II 113

ఈ పద మాముక్తమాల్యదయందు శకటరేఫముతో గన్పట్టు చున్నది.
"గిఱవుంచెవార్ధినాన్" 1–54

అనంతామాత్యుడు: 1430

కొజ్జా: షండుడు. ఖ్వాజా అను పదమునుండి ఇది ఏర్పడినట్లు అనుమానము. వికృతిలో అర్థము మారినది.

వీధులఁదిరుగంగ వెసఁదలారులు
వట్టి కొజ్జాను చేసిరో సజ్జవారి
భోజ, రా. 4–319

కొఱవిగోపరాజు

గలబు: గల్బా అను పదమునుండి ఏర్పడినది. అల్లరి సందడి అనుభావమున గోపరాజు ప్రయోగించెను.

1) "ఎల్లజనులంగూర్చుండనిడి గలబవుట్టకుండ నెడ నెడ దలవరులనిచి"
సిం. ద్వా. VII-64

2) శః మహోత్సవంబులో . గిలబలు సేయుదురే .. .. 30

జిరా: ఏనుగుపై లేక అశ్వములు మున్నగు వానిపై వేయు వస్త్రకవచమని అర్థము. జిరిహ్ అను పారశీ శబ్దము దీనికి మూలము.

"వాగెవదలి జిరా గినగనం గదలించరోలిన-" సిం. ద్వా VIII-71

జీబు: ఒకవిధమైన వస్త్రము. పారశీ జేబ్ నుండి వచ్చినది.
"శ్రీరామ తోపులును శ్రీకృష్ణవిలాసంబులును జీబులను సగిపట్టంబులును.
సిం. ద్వా. III-188

శ్రీకృష్ణదేవరాయలుకూడ "చెందురికావిజీబులు" అని ఆముక్తమాల్యదలో ప్రయోగించెను. 5-90

## అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనలు

అపరంజి: అరియ నిత్తడిఁదెచ్చి యపరంజిఁజేసె. V-185

అఫ్రిందె ప్రాంతమునుండిన వచ్చినది అపరంజిగ వ్యవహరింపబడెనని తోచును.

## శ్రీకృష్ణదేవరాయలు:

విజయనగర సామ్రాజ్యమునకును, మహమ్మదీయ రాజ్యములకును రాజకీయ సంబంధములు ప్రగాఢముగ నుండిన యుగము రాయల యుగము. విదేశీయ మహమ్మదీయ రాజ్యములతో వర్తక వ్యాపారములు అభివృద్ధి నొందినకాలమిది. పారశీకము తోపాటు ఉర్దూ భాషయు క్రమక్రమముగా జనవ్యవహార భాషగను, కావ్యభాషగను రూపొందుచుండెను. ఆముక్తమాల్యద యందుగల అన్యదేశ్యప్రయోగములిదివరకు మున్ను ఒకటి రెండు సందర్భములందు వివరింపబడినవి శ్రీకృష్ణదేవరాయలు ప్రయోగించిన శబ్దములు కొన్ని విశిష్టములైనవి.

పజీత: అరబీ పదము ఫజీత్ యొక్క రూపమిది. పరాభవము, అవమానము అనిఅర్థము. పజీత చేయుట, పజీత అగుట అనునవి క్రియా రూపములు.

"ఆటదాని బజీతు సేయఁగ వలయునె" ఆ.మా. V 51

శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు పజీతుచేయుట అనగా అల్లరి చేయుటఅని వ్యాఖ్యానమునందు వివరించిరి. కాని ఈ అర్థము సరియైనదికాదు. పరాభవ మొనర్చుట అనుఅర్థమిట చక్కగా పొసగును పాలవేరి కదరీపతియు నిట్టి అర్థమునందే ఈ పదమును ప్రయోగించెను.

"చెనటి చుట్టాలచేత బజీతసగుదు" శు. స. II-12

కైజా: కృష్ణరాయలు విదేశములనుండి ఉత్తమ జాత్యశ్వములను దెప్పించుచుండెను వానిలో ఆజానేయంబులు ప్రశస్తములైనవి. రాయలు జాత్యశ్వముల ముఖచేష్టలను రమణీయమైన స్వభావోక్తులతో వర్ణించెను.

ఆ జానేయంబులు పేనహాసమిడి కైజామోరలల్లార్చున్.
ఆ. మా. II-26

ఖైజ్ అను పారశీకపదము నుండి 'కైజా' ఏర్పడినది. ముఖచేష్టఅని అర్థము. 'ఆజాన' ఆఫ్రికా ఖండములో నొకదేశము అక్కడినుండి వచ్చినవి కాన ఆజానేయములు ఆముక్తమాల్యదయందు దేశనామసూచకపదములు పెక్కు కలవు. అందు 'ఖురాసానిపుచ్ఛలు' అను ప్రయోగమున ఖురాసానుదేశ ప్రసక్తి కలదు. ఖురాసానుదేశ సంబంధి ఖురాసాని. "అలుకస్ఫోటకధట్టికాఖురపుటీహల్యాఖురాసానిపుచ్ఛలు వోదున్ని"
ఆ. మా. 1-42

జీబు, బౌజు, మున్నగు పదప్రయోగములిందును గన్పట్టును బౌజు అను రూపము గమనార్హము. బిందుయుక్తముగ భావింపబడినదనుట కీ ప్రయోగముకూడ ఆధారముగనున్నది.

చందురకావి జీబులు- 5-90
పల పలవేగనిచ్చలును బౌజులు దీర్చి 3-16

## అల్లసాని పెద్దన:

పెద్దన మనుచరిత్రమునందు ప్రయోగించిన ఒక పదము విశిష్టమైనది. పారశీ పదబంధములను రమణీయమైన వర్ణనలలోపొదిగిన వారిలో పెద్దన ప్రముఖుడు.

## దుముదారుదొర:

సకుటుంబముగవీఁగి చరమశైలముచేరు
తుహినాంశు దుముదారు దొరయనంగ- మ. చ. III-54

'తోకగల' అని దుముదార్ పదమునకు శబ్దార్థము. సైన్యములకు వెనుకనుండు నాయకుని దుముదారుదొర అందురు. నకీబు, జీబు అనుపదములను పెద్దనకూడ ప్రయోగించెను.

రథంబు చాఁగుబళియంచు నకీబులు మ్రోయనెక్కెనిశా V–42
అలకని జీబులో గుసుమ మద్దిన పావడ. VI–31

## సారంగు తమ్మయ్య:

### రుమాలు—పాగ:

అలకముల్మెటియో దలపాగ చుట్టి
పై నద్దకిట్టు రుమాలు గుడ్డకట్టి వైజ. వి. II–46

రుమాలు-పాగ-మహమ్మదీయులు తలపై ధరించునట్టివి పాగా తలకుచుట్టుకొనబడు (టోపీవలె) వస్త్రవిశేషము. దానికి చుట్టుగా చుట్టునది రుమాలు. ఈవేషము లను హైందవులుకూడ ననుసరించిరి. ఈ యుగములోని వివిధకావ్యములందు ఈ పద ప్రయోగము మిక్కుటముగా గన్పట్టుచున్నది. మట్ల అనంత భూపాలుని కకుత్స్థవిజయమునను, అయ్యలరాజు నారాయణుని హంసవింశతియందును రుమాలు వేషములు వర్ణితములు.

శిరసుననొక చాయ జలుగు రుమాలుతో
టెంకణంబొక చెంపఁజిక్కఁజెక్కి II – 23

సొన్నా పట్టె రుమాలు గట్టె I–75

**గులాము:** సేవకుడను అర్థమునందీపదమింతకుపూర్వపు కావ్యములందు ప్రయుక్తము సారంగతమ్మయ్య 'సేవ'–"దాస్యము" అను అర్థములందు ప్రయోగించుట గమనింపదగినది.

"లలనరో యెందు నీవిక గులాము నకుఁజాజనవద్దు" వై వి. II 129
అని విప్రనారాయణుడు దేవదేవితో ననెను.

## కుమార ధూర్జటి

కుమార ధూర్జటి రచించిన కృష్ణరాయ విజయమునందు కొన్ని విశిష్ట ప్రయోగములు కలవు. ప్రభుత్వ వ్యవస్థకును, యుద్ధములకును సంబంధించిన పారిభాషిక పదములతోపాటు సామాన్య పదములును ఈ కావ్యమునందు బహుళముగ బ్రయోగింపబడినవి.

తురాయి: పగిడీపైని అలంకారమును 'తురా' అందురు. ఇది అరబీపదము వర్ణలోపమున 'తురా' అనురూపమేర్పడినది.

జగదధిష్ఠాన భాస్వజ్జ్యోతియగువాడు
బ్రహ్మాదు లదరు దురాయివాడు. కృ. వి. I–2

శేషము వేంకటపతి శశాంకవిజయమునందును ఈశబ్దమును ప్రయోగించెను.

"నిద్దామెఱుఁగుదురా గులుక"

కొత్వాల: ఇది కోత్వాల్ అను పదముయొక్క తెలుగురూపము. కొత్తవాలు. కొత్వాలు అనురూపాంతరములును గలవు, నగర రక్షణశాఖాధికారిని కొత్వాలుఅందురు.

ఎఱుక గల వారి తరబడి నేగునపుడు
కరిముల సిఖాలుజేసి ముష్కర తురష్క
లవల బొమ్మని కొత్వాల కప్పగింతు
రచ్చటికిఁజేరఁబరులకు నలవిగాదు. కృ. వి. II–122

వజీరు: భీకరులైన వజీర్ల నిల్పుచు౯. కృ. వి. II – 123

మంత్రి అని ఈ పదమున కర్థము. ప్రభుత్వాధికారి అను సామాన్యార్థము నందును, ప్రభువుఅను అర్థమునందును ఈపదము కావ్యములందు ప్రయోగింపబడినది, వజీరి వజ్జీరు అను రూపాంతరములుకూడకలవు. "నిలిచిరి వజీరులు నిర్విచారమున" అని కాటమరాజు కథలో ప్రయోగింపబడినది.

ఖుదా: భగవంతుడని అర్థము. ఇది పారశీపదము, ఎట్టి మార్పులు నొందక తెలుగులో ప్రయోగింపబడిన పారశీ పదములలో నిదియొకటి.

జబురు జంగి పిరంగులు:

... .... జబురుజంగి పిరంగులు నాదిగా డిగా
భీలగతి న్ఘటింపుచును . . కృ. వి. II–122

ఒకవిధమైన ఫిరంగి ఇది. జఫ్ర్ జంగ్ అనగా యుద్ధమొనర్చు మొనగాడు. ఈ పదమే జబురు జంగియైనది. ఇట్టిపేరుతో గజ్నీలో ఫిరంగి యుండినట్లు బ్రౌన్ అభిప్రాయపడెను.[1]

---

[1] "A great gun named zubber jung is mentioned as being in Gaznee
మిశ్రనిఘంటు — పుట 33

జాబు: లేఖ అను అర్థమునందీపదమును కుమారధూర్జటి ప్రయోగించెను.

"జాబులంపించెగోల, కొండకు" II – 120

ఇది జవాబు అను అరబీ పదమునకు వికృతి. జవాబ్ అనగా సమాధానము. లేఖ యను రూఢ్యర్థ మేర్పడినది. "ఉత్తరము" వంటి పదమిది.

ముఖాములు: నిఘంటువులకెక్కని పదములలోనిది యొకటి.

గౌరవమొప్పనచ్చటి ముఖాములు వ్రాయ దొడంగిరెంతయున్.
II – 113

ఈ పదస్వరూపము కొంత విచారింపదగినది. ముఖాము అనగా స్థానము. తద్ధర్మార్థమున స్థానికుడనుటకు "ముఖీము" సరియైన రూపము. కృష్ణరాయ విజయము నందును కైఫియతులందును ముఖాములు అనురూపమే కన్పట్టుచున్నది ముఖాము అను పదము నేటివ్యవహారమున మకాముగా మారినది. మకాం వేయుట అను పదబంధ మీ రూపము నుండి ఏర్పడినదే.

రామరాజ భూషణుడు:

అరబీ పారశీ పదములను ప్రాచీనాంధ్రకవులు కొందఱు శబ్దపరిచితివలనను మఱికొందఱు అన్యదేశ్యముల బ్రయోగించు మోజుతోడను, కొందఱు శైలీగాంభీర్యము కొఱకును తమ తమ కావ్యములందు బ్రయోగించియుండిరి. వసుచరిత్రకారుడగు రామరాజ భూషణుడు ఉర్దూ పారశీ పదములను విశిష్ట పద్ధతిలో గూర్చెను. అన్యదేశ్య ప్రయోగముపట్లను రామరాజభూషణుడు శ్లేషకవి చక్రవర్తి బిరుదము సార్థక మొనర్చుకొనుటయే ఈ విశిష్టత. రూపకోత్ప్రేక్షాద్యలంకారపు ముసుగువేసి ఆయా శబ్దార్థముల సౌందర్యమును రసవంతముగ దర్శింపజేయుటలో రామరాజభూషణుడు చూపిన నేర్పు ప్రశంసార్హము.

ముసలిమాను: రామరాజ భూషణు డీపదమునకర్థద్వయముకల్పించి పద్యమున శ్లేష చమత్కారమును గూర్చెను.

"హరిశౌర్యుండగు రామ భూవిభుని తీవ్రోపవద్వాహినీ
శరవేగంబున నాత్మ మూల బలముల్జారన్, దళాడంబరం
బరుగం గొమ్మలు వోవ లావరి నిజామాదుల్వ జీరు లజిం
తురు నమ్రత్వముఁగానలో ముసలి మానుల్గావితర్కింపగన్."

రామభూపాలుని వాహినీ శరవేగమున కోర్వలేక నిజాము మున్నగు ప్రభువులు ముదిమా్రనులవలె అడవులందు వినమ్రులై యుండిరని కవి వర్ణనము. ముసలిమాను అనగా ముదిమా్రను; జాతివాచకముగ ముసలిమాను. మహమ్మదీయులనుకూడ ఈ కవి అర్థ చమత్కృతిని సాధించుటకు వినియోగించుకొనెను. వేంకటరాయని నెదుర్కొన నేరక మహమ్మదీయులు ఉడుప సహాయమున గోదావరిని దాటిరి. వారు ఉడుప కృతమగు మేలునకు (అనగా బాలచంద్రునకు) నమస్కారము చేసిరట. చంద్రోదయముతోడ వారికి మార్గము దోచినదని భావము. చంద్రుడు మహమ్మదీయుల కిష్ట దైవము. రిజ్జాను మున్నగు పండుగలను వారు చందును జూచియే చేసికొందురు. మహమ్మదీయాంగనలు బురిఖా వేసికొనుట సంప్రదాయము. ఈ సంప్రదాయము నీకవి రిపువధ్వర్ణనలలో గూర్చెను.

ఎదలపైఁబొదలు పయ్యెదలు జారఁగబారు
బిబ్బీలకు ముసుంగులబ్బజేసె 1-46

బీబి పదము బిబ్బియైనది. నేడు మహమ్మదీయాంగన అను అర్థము రూఢియైనది.

రఘునాధరాయని పరాక్రమ వర్ణన సందర్భమునందును రామరాజభూషణుడు కల్పించిన ఉత్ప్రేక్షలు గమనింప దగినవి. రాయనిచే మహమ్మదీయులు నిహతులుకాగ వారి అంగనలు విలపించిరి. వారి కాటుక కన్నీటి వెల్లువ కృష్ణలో కలిసి నదీ జలమంతయు నల్ల బడినందున నాటినుండి ఆనదికి కృష్ణయను పేరు కలిగినదట.

... ... ... కృష్ణకును కృష్ణాంకంబు నాఁడబ్బె బి
బ్బీ దివ్యన్నయనాబ్జ కజ్జల జలాభీల ప్రవాహంబులన్. 1-69

రామరాజభూషణుని శ్లేష చమత్కారములు ఒక్కొక పద్యమునందొక్కొక రూపము దాల్చినవి. వేంకటపతి రాయలు దుర్మార్గులైన మహమ్మదీయులను హతమొనర్ప వారి భార్యలును ప్రాణముల వీడిరి అను భావమును, రాయలు తురకలను చంపినను వారి భార్యలను కరుణించె నను భావమును, శ్లేషలో నంతరింపజేసిన విధము ప్రశంసార్హము.

నిరతంబు దుర్మార్గ నిరతులౌ తురకల
సతుల సన్మార్గ సంగతులఁ జేసె.

సతులకు సద్గతి యొసగె ననుటలో వారిపై పగబూనక కరుణించెనని ధ్వనించుచున్నది.

బరాబరులు, వజీరులు వంటి ప్రయోగము లీకావ్యమునందు గన్పట్టుచున్నవి. రామరాజభూషణుడు కూర్చిన సమాసములు కొన్ని విశిష్టములైనవి.

మరుహజారమ్ము (I-140), చక్కెర ఖాణపు తేజి (III-112); మఱుని తేజీలు (VI-72) మున్నగు ప్రయోగము లిట్టివి.

## రామరాజు రంగపరాజు:

మహమ్మదీయుల మత సంప్రదాయములను సూచించుపట్ల రామరాజు రంగపరాజు వారి పరిభాషను ప్రయోగించెను.

**దుగాన:** ఇది పారశీపదము. రెండునమాజులని అర్థము రోజా=రంజాను పండుగ సందర్భములో మహమ్మదీయులు పాటించు ఉపవాస వ్రతమును రోజా అందురు. రంజాన్ పండుగను చంద్రోదయము ప్రమాణముగ పాటింతురు. ఈసంప్రదాయమును అనుసరించి కవి యొనర్చిన వర్ణన మత్యంత రమణీయముగ నున్నది. పారశీ పదమును యథాతథముగ నుపయోగించిన విధము చూడ నాటి కవు లా శబ్దముల తోడను, సంప్రదాయములతోడను సుపరిచితులై యుండిరని స్పష్టమగుచున్నది.

చనుపకముల తావిగొనక రోజాలుండి
తేటి మలక మల్లె తెల్ల విరుల
చందు చూచి విజయ జయ కాంక్షమై దు
గానా యొనర్చె నుత్తరాయణమున.

సాంబోపాఖ్యానము 2-103

## కవిచౌడప్ప:

బూలతులలో నీతులు జొప్పించి కవిత చెప్పి మెప్పించిన కవులలో కవి చౌడప్ప ప్రముఖుడు. ఉరుదూ పారశీక భాషలలోని బూతుమాటల నీకవి స్వేచ్ఛగా బ్రయోగించెను.

**ధగిడీ:** ధగిడ్ అనగా ఉపభర్త. అన్య పురుషునివలన గలిగిన సంతానమును "ధగిడీ" అందురు. శిష్టేతరులనోట వ్యవహార సిద్ధి బొందిన బూతు మాట.

**సాహెబు:** వారు, గారు అనుగౌరవ వాచక పదములకు సమానార్థకమైన పదము, సాహెబు అరబీపదము. స్నేహితుడని శబ్దార్థము. తురకల జాతివాచకముగను బ్రయోగింపబడుచున్నది. సాయెబు, సాబు అను రూపాంతరములును గలవు.

అంగీ పస వేపార్లకు
బంగే పస సాహెబులకు 180

**పాచ్ఛా:** పాదుషా-బాదుషా అను పదములకు వికృతియిది. పాషా అను రూపాంతరముకలదు.

**బందగులాము:** పదబంధముగా బ్రయుక్తమైన పదము.

బంద గులాములు యాచక
తండంబుల కివ్వలేరు తము
దండించే ముండల కిత్తురు ధగిడీ
గండలు మరి కుందవరపు కవిచౌడప్పా. 76

## సురభి మాధవరాయలు:

కొల్లాపురము సంస్థానాధీశ్వరులు సురభి మాధవరాయలు రచించిన చంద్రికా పరిణయమను కావ్యము వసుచరిత్రకు సాటివచ్చునట్టిది. ఈ రాజకవి ప్రయోగించిన కొన్ని పదములు విశిష్టములైనవి.

**సజాలు:** సజా అనగా శిక్షలు బహువచన ప్రత్యయము. చంద్రికాదేవి కనుగవను వర్ణించుపట్ల మాధవ రాయలీ పదమును సరసరీతిలో బ్రయోగించెను.

కలికి చీకటిపిండు గలికిబిల్చుకచాళి
వాలుగల సజాలు వాలుగనులు. చ. ప. III-58

కలికి అందమైన నల్లని కురులు అందమైన చీకటి పుంజములను జగడమున కాహ్వానించుట. ఆమె వాలుగనులు వాలుగల (మత్స్యములయొక్క) సజాలు (శిక్షారూపములు) అని భావము.

ఇట శిక్ష అనగా నేర సంబంధమగు శిక్షకాదు. తరిఫీదు (Training) అని అర్థము. సంస్కృత "శిక్ష"కు గల నానార్థములు సజా అను పదమునకులేవు. మాధవ రాయకవి ప్రభువులు "సజా" అను పదమునకు సంస్కృత "శిక్షణ" మొసగుట హృద్యముగనున్నది.

**చిల్లర:** సామాన్య అర్థమున చిల్లర అనగా భిన్న నాణెములు (Change)

ర్మల మహిరాట్సుతాంచిత కరిస్థితి మించుచుఁజేరు వారి మేల్
చెలువము చెంగట౯ ధరణి చిల్లర పేరుల వన్నె హెచ్చునే. V-136

ఇట చిల్లర పేరుల వన్నెయన సామాన్య హారముల కాంతి.

అల్పము సామాన్యము అను అర్థములందీపదము నేడును వ్యవహారమున గన్పట్టుచున్నది. చిల్లరజనము, చిల్లర గుణము మొ॥

## కందుకూరి రుద్రకవి:

నెల్లూరి మండలము నందలి కందుకూరు గ్రామ వాసి కందుకూరి రుద్రకవి నిరంకుశోపాఖ్యానమను రసవత్ప్రబంధమును రచించెను. ఈ కావ్యమునందలి ఒకటి రెండు ప్రయోగములు పరిశీలనార్హములు.

**చిక్కుబాకీలు:** బాఖీ అనునది పారశీక పదము. బహువచన రూపములో నాభాషయందు గన్పట్టదు. తెలుగుకవులు దీనికి బహువచన రూపమునుకూడ కల్పించిరి. బాకీ అనగా శేషము, మిగిలినది. ఋణము అను అర్థములందీ పదము బహుళముగ ప్రయుక్తము. రుద్రకవి ఈ పదమును మిగిలిన అప్పు అను అర్థమున వాడెను.

తులసి పోగులు మొదలుగాఁగలుగువెట్టి
చిక్కు బాకీలు పిదప నిశ్శేషపఱచె. II - 116

సిగతాయెతులు, ఒంటి పొర రుమాలు, బారా మున్నగు ప్రయోగములీ కావ్యమున గన్పట్టును.

## పాలవేరి కదరీపతి:

ఈ కవి రచించిన శుక సప్తతి కావ్యము నందన్యదేశ్య ప్రయోగములధికముగ గలవు. కదరీపతి తురక జవాన్‌ను వర్ణించిన విధము గమనింపుడు.

మెలిపెట్టి చుట్టిన తెలి పరంగి ముడాసు
పై లపేటా దబ్బు పనులఁజెలఁగు
బంగరు వ్రాతల పట్టు హిజారు కం
బరుచీని నిమతాని పాదునొసలు
తనుకాంతి గనుపింపఁదనరునంగీ జోడు

వలిపెంపు శాలువ వల్లెవాటు
పడుదలలోన డాబాకత్తి వదలుపా
పోసులు గోరంటఁబొలుచు గోళ్ళు

నడుమ సీలున్న తోలు డాల్చెడగుసూప
నభయముగ వెంట నరుదెంచు సభరువాడు
నమరు ముస్తైదు తేజితో నరుగుదెంచె
దారుణా కారుడైన యుద్దారు డొకడు.

వచ్చి యయ్యారి వెలుపలి రచ్చరావి
క్రేవ దుర్వారుడై 'తలారికి బులావు
ధగిడికే'యను మాటకుఁ దలకిరెడ్డి
తోడివారలతోఁజేని తోివబట్టె. II 427,428

ఉర్దూ పారశీ పదములేకాకఉర్దూ వాక్యములుకూడ కావ్యమునకెక్కినవి.

హిజారు : ఇజారు శబ్దమునుండి ఏర్పడినది.లాగు అని అర్థము.

నిమతాని . ఒక విధమైన వస్త్రము. అంగీ : అంగరకా శబ్దమునకు వికృతి. శాలువ : షాల్ పదమునకు వికృతి. పాపోసు : పాయెపోషు పారశీ పదము. పాదరక్షలని అర్థము. సఫర్‌వాడు : సభరువాడు సరియైన రూపము. సైసు అని అర్థము. ముస్తైదు : ముస్తయిాదు. అను అరబీపద భవము. సిద్ధముగానున్న అని అర్థము. చుఱుకైన అని భావము.

తలారికి బులావు :— తలారిక బులావు అయిబ లంయిన పద్ధతి. తురకజవానులు తెలుగు విభక్తిప్రత్యయములను ప్రయోగించు పద్ధతిని తెలుపుచున్నది.

పారిగోడ — ప్రహరిశబ్దము ఉర్దూలో పహరా అయియుండును. రక్షక కుడ్యమని అర్థము.

అచ్చమై వాకిట రచ్చబూయి మెఱుంగు
పంచ తిన్నెలు గొప్ప పారిగోడ. II. 408

పసుల గోడ :- ఈ శబ్దము ప్రత్యేకముగ బరిశీలింప దగియున్నది. పారశీలో ఫసీల్ అనగా కోటగోడ, ఫసీల్ పదమే 'పసుల' అను వికృతి రూపము దాల్చినది. పశు శబ్దభవమని భ్రమింపజేయును.

వసుల గోడలనైన వసుధ నిచ్చెన లేక
యెక్కనేరని దేటి యెమ్మెలాడి. I 139

బురునీసు :- ఒక విధమైన దుప్పటి. దూదిచేర్చి కుట్టబడినది.
....మేలౌ బురునీసు కప్పడము చాలన్మించ నేతెంచె..

II 265

దునేదాది కటారి — రెండువైపుల పదునుగానున్న కత్తి అని అర్థము.
....తలిరుకైదువుల దునే/దారి కటారి II. 364

సాత్కా :— సద్ఖా అను అరబీ పదమునకు వికృతి. త్రిప్పివేయుట. లోకువ అను భావమునందు నుడికారముగ ప్రయుక్తము.

. ..ఏ బాపన మెుప్పులైన సరియే వారెల్లసాత్కాలు .

II. 419

బంటుపైద - ప్యాదా అను పదమునకు వికృతిపైద. కాలి నడకవాడని అర్థము.

"బానిసెల్బడ వాళ్ళు బంటుపైద" II 145

బంటుపైద — ఏకార్థక పదములను జంటగా ప్రయోగించుట ఇట గమనింపదగినది.

లపేటా :- లపేట్నా అను క్రియారూప జన్యమని తోచును. మహమ్మదీయులు టోపీపై రుమాలు చుట్టుదురు. దానిని లపేటా అందురు.

సామ్రాణితేజులు :- సమరాన్ మండలపు గుఱ్ఱము. దేశ వాచకపదము.

హత్తివాయు మనోజవంబలనలరు నీ సామ్రాణితేజులు

I. 222

మక్కాసీమ :—

మక్కాసీమ వీగుజరీతివాసులు-

సిరాజులు :— షిరాజు దేశమునుండి వచ్చిన కత్తులు.

ఎత్తుకెత్తు మెఱుంగు కుందనమిచ్చి తెచ్చితిమీ సిరాజులు

I. 222

సలాముచేయు, వజీరు, ముఖాము, చీటి, తాయెతు, పజీత, దివాణము, జరీ, మున్నగు పదములిందు పెక్కుకలవు.

## అయ్యలరాజు నారాయణకవి :—

పాలవేరి కదరీపతికి దాదాపు సమకాలికుడు నారాయణకవి. ఈతని హంస వింశతియు సమకాలిక సాంఘిక చరిత్రకు దర్పణమువంటిది. పారశీకాది భాషల పరిచితియు నీ కవికి కలదు. నారాయణకవి కదరీపతివలె ఉర్దూపారశీపదములను తన కావ్యమునందు బహుళముగ ప్రయోగించెను. అందు విశిష్టములైనవి యివి.

జమాఖరుచులు :- ఆదాయ వ్యయములని భావము.

"జమాఖరుచుల్గణించి" I 142

ఖర్చుయొక్క రూపాంతరము ఖరుచు.

పలంగుపోషు : "జాపరాజినుగు లేపునజెందు పలంగుపోషు" I 239

పలంగు హిందీనుండి ఉర్దూలో ప్రవేశించిన పదము. పర్యంకి శబ్దభవము పోషు అచ్చమైన పారశీ ప్రత్యయము, ఆచ్ఛాదమని అర్థము. మంచముపై పఱచు వస్త్ర విశేషము. Bed Sheet అని పలంగ్‌పోషు పదమునకర్థము.

హమాదినుసులు = హమా అనగా వివిధములైన, దినుసులు అనగా వస్తువులు. జిన్స్ అను పదమునకు వికృతి యిది, వివిధమువైన వస్తువులని అర్థము.

సర్వ రస వర్గములు టంకసాల ప్రేయు
చావడి హమాదినుసు మేలు సరకుగలిగి II–231

హుషారు: ఇది హోష్యారు పదముయొక్క రూపము. సంతసమున అను అర్థమునందీకావ్యమున ప్రయుక్తము.

"హుశారున వీధికివచ్చి IV - 85

ఖురాసాని వోమ: ఖురాసాను దేశమునుండి కొన్నిదినుసులు దిగుమతి యగుచుండెను. వోమయునట్టి దినసులలో నొకటి. ఇది యూనానీవైద్యవిధానమునందును నధికముగ నుపయోగపడుచుండును. ఖురాసానుదేశపు వోమ జనవ్యవహారమున కూర్మసాని వోమ యైనది.

జడ వేరు వసఖురాసాని వామము ....... V – 152

ఖ లీ తి: పదతలంబుల నెట్టు పాపోసులు
మెక్కుగాఁ జంకఁ జీటీ ఖలీతి. II–30

ఖరీత సరియైనరూపము ఇది పారశీక పదము. బట్టతో చేయబడిన చంచి అని అర్థము.

గోషుపేషు: "శరీషపు గోషుపేషు మేల్ జిగి లొాగడాలు" IV–86

గోష్‌పేచ్ సరియైనరూపము. పాగాపై అలంకారార్థము సొగసుగ కట్టుకొనుచుండుటవలన దీనికిట్టిపేరు కలిగి యుండును.

కలందాను: కలములుపెట్టుకొనునది. 'దాను' పారశీ ప్రత్యయము.

దస్తరము: పారశీ పదము. దఫ్తర్ యొక్క వికృతి ఇది. వ్యవహార పత్రముల మూట. దఫ్తర్ అనగా రాచకార్యాలయము.

నడికట్టులో మెడనిడిన కలందాను
హస్తాగ్రమున వ్రేలు దస్తరంబు– II – 29

శాయి–దవితి: సియాహీ అను పదమునకు తద్భవరూపము. శాయి అనగా వ్రాయు మషీ అని అర్థము. దవాతు అనగా సిరాబుడ్డి. నారాయణకవి ఈ పదములను చక్కని అలంకారములో గూర్చెను.

రసికుడైనట్టి కాలంపు రక్తవాను
తనరు బ్రహ్మాండమను పెద్ద దవితిలోన
శాయినిండారఁబోసిన చందమునను
గారు తిమిరంపు గుంపుసొంపారనయ్యె. I –141

ఈ కవి ఉర్దూ పారశీలోని దూషణోక్తులను కొన్నింటిని ప్రయోగించెను.

ఆకతాయ యడి బంధ గుండడు
మొండి కట్టె గులాము మొప్పెగోవు
కొయ్యద్రిప్పు ఖరూబుకూళ బందెల మారి
ముందటి పాపాలముద్ద ధగిడి

నోగు దూబరదిండి నోచవాడవ లక్ష
ణము లాడుగోల వాగ్రిత్యుడు బజారి.
దదిచేసి చెడగొట్టు జెరికి దగాకోరు
విషపాల విత్తు చిల్విషము దగులు
బాజి హరాంకోరు .... .... ....

సీసమాలిక V–113

ఖరాబు అనగా చెడ్డ. బజారి అనగా అల్పుడు. వీధి దిమ్మరి. దగాకోరు, దగులుబాజి = మోసగాడుఅని అర్థము. హరాంకోరు = కష్టపడక దొబ్బితినువాడు. విశ్వాస ఘాతకుడు. కిముఖాబు = "కింఖాఅబ్" ఒకవిధమైన పట్టువస్త్రము.

మొకమాలు జరీతాబు బాదంగి, జాపరా (కుంకుమ పువ్వు)శాలు, లపేటా, జవాబు. తాయెతు, రుమాలు, సొన్నాపట్టె, (స్వర్ణపదభవముసోనా)బందాకోరు, బజారు, దునేదారి, పాగ, సెబాసు, పాదుష, నఖాసు, చీటి మున్నగు పదములెన్నియో ఈ కావ్యమున ప్రయోగింపబడినవి.

## పొన్నిగంటి తెలగనార్యుడు: 1580

గోలకొండ సుల్తానుల కాలములో జీవించిన తెలుగుకవులు అచ్చమైన ఉర్దూ పారశీక ముద్రగల తెలుగుభాష నుపయోగించియుందురని సాధారణముగ నభిప్రాయము కలుగుచుండును. మహ్మదీయ సుల్తానుల ఆస్థానములందు రాజగౌరవము నొందిన కవులయు. మహమ్మదీయాధికారుల ఆదరగౌరవములకు బాత్రులై వారిపేర కృతుల రచించిన కవులయు రచనలయందు మిక్కుటముగా ఉర్దూ పారశీక పదప్రయోగములు కన్పించకపోవుట వింత. ప్రభువుల తోడను అధికారులతోడను ప్రత్యక్ష సంబంధము కలవారు కావ్యరచన యందు సంకల్పించిన నూత్న మార్గముపై దృష్టి వహించియుండుటయు. రాజులును అధికారులును పారశీకముకంటె దక్కనీ ఉర్దూభాషపై శ్రద్ధవహించుటయు, నిందులకు కారణములై యుండును, తెలగన్న రచించినది అచ్చతెనుగుకావ్యము. ప్రభువులు దక్కనీభాషపై మక్కువ జూపుటజూచి వారి ఆదర్శములను పాటించుచు తెలుగుకవులును అచ్చతెనుగు నాదరించి యుందురని తోచుచున్నది.

శ్రీనాథయుగము నందలి కొన్ని కావ్యములందు అచ్చతెనుగులో నచ్చటచ్చట కొన్ని పద్యములు కన్పించుచున్నవి. అచ్చతెనుగు సంప్రదాయము తెలుగు కవులకు క్రొత్తకాదు. గోలకొండ సుల్తానుల దక్కనీ భాషాభిమానదృష్టి పరోక్షముగ తెలుగు

కవుల నచ్చు తెనుగు కావ్యరచనకు దోహదమొనగియుండు ననియే నాఅభిప్రాయము. తెలగనార్యుడు యయాతిచరిత్రను అమీఁఖానున కంకితమొనర్చెను. అతని వంశ వృత్తాంతము వర్ణించుపట్ల తెలగన్న ఒకటి రెండు అన్యదేశ్యములను ప్రయోగించెను.

**వజీర్లు:** ఈకవి ప్రయోగించిన ఈరూపము పరిశీలింపదగినది.

"మేలువజీర్లగమికొండ గోలకొండ" 1-3

పాదుసా, బీబి, హుజూరు, గసగసాలు, బరాబరులు, నేజా, పౌజు, మున్నగు ప్రయోగములు పూర్వకావ్యములందు కన్పించినవియే. ఈ కవిప్రయోగములలో నొకటి మాత్రము గమనార్హము.

**జుమాయించిన:** ఇది ఝుమానా అను పదమునుండి ఏర్పడిన రూపము. త్రిప్పుట అని అర్థము. జళిపించుటఅని భావము.

ఇంచుక కేల వాగె గుదియించిన సంద్రము దాఁటుచుఁ జుమా
యించిన నేల గ్రక్కదల నిట్టుటగా పదిఁ ద్రొక్కుచుఁ... 1-76

నామవాచక పదముల నీకవి వాడినవిధము గమనింపదగినది. చాదుబీబి (చాంద్‌బీబి), బడెమియ్యా (బడేమియా), షెమ్మెబీబి (షమాబీబి), షెక్కరిబీబి (షక్కర్‌బీబి), అబ్దులల్లి (అబ్దుల్‌అలీ), షేకిభరాము (షేఖ్‌ఇభరాహీమ్) మున్నగునవి ఇట్టివి.

అమీనుఖానుసంతానములో గతాల్‌ఖాను అనునాతడు అరబీ, పారశీ, గుజరాతి, ఆరె, అచ్చతెనుగు, కన్నోజి, మున్నగు భాషలను తెలిసి వ్రాయజాలినవాడని ఇట్లు వర్ణితము.

అరబి పారశి గుజరాతి యారె మచ్చ
తెనుఁగు కన్నోజి మొదలుగా దెలిసి వ్రాయ
దారిగన్నట్టి వాడు గతాత ఖాను 1-41

**చరిగొండ ధర్మన:**

ఈకవి చిత్తాబుఖాను (సీతాపతిరాజు) మంత్రియగు పెద్దయామాత్యున కంకితముగా చిత్రభారతకావ్యమును రచించెను. ఈతడు శతలేఖినీ సురత్రాణ బిరుదాంచితుడు. ప్రోలయకును ఆంధ్రసురత్రాణ బిరుద ముండెను. రాజపదము శ్రేష్ఠవాచకము. దానికి

సమానార్థకముగ సుల్తాన్ అను పారశీక పదమును బిరుదావళి యందును కూర్చియుం దురు. ఈతని కావ్యమునందును తేజి (II-110)-చబుకు ( IV-63 )-కైజా ( Iv-63 ) మున్నగు సామాన్య ప్రయోగములే కన్పట్టుచున్నవి విశిష్ట ప్రయోగములులేవు.

దామర వేంగళభూపాలుడు: (1550–1600)

బహులాశ్వ చరిత్ర: తపతీసంవరణోపాఖ్యాన కర్త అద్దంకి గంగాధర కవికి సమకాలికుడైన ఈకవి బహులాశ్వ చరిత్రమును రచించెను. హజారము, తేజి, బారా, రుమాలు, హజారము మున్నగు సామాన్య ప్రయోగములు సందర్భానుసారముగ నిందు ప్రయుక్తములు. ఒకటి రెండు పదబంధములు మాత్రము గమనింపదగినవి.

కాసా రావనితలు: ఖాస్ అనగా సొంతము. ప్రత్యేకమైన అని భావము.

వనితలలో కాసారా
వనితలలో . . .  II - 67

పాండురంగమహాత్మ్యము: తెనాలిరామకృష్ణుని పాండురంగమహాత్మ్యము నందును విశిష్ట ప్రయోగములు కన్పట్టవు. దివాణము, తుర్కీ, వంటి పదము లొకటి రెండు కలవు.

చదువుల పుట్టినిండ్లు శమసంపద యిక్కలు పుణ్యలక్ష్మికిన్
మొదలి దివాణముల్.  I-109

దివాణము అను రూపము పరిశీలింపదగినది.

సవరణము చిననారాయణ: 1620

కువలయాశ్వ చరిత్రము: ఈ కావ్యము నందు రెండు మూడు విశిష్ట ప్రయోగములు కలవు.

కిల్లాకు: చక్కని జాతీయమిది. ఖిలా + ఆకు—అనగా కోటనుండి వచ్చిన కమ్మ. రాజాజ్ఞ అని భావము.

వినుము మహికాంతు కొండంత పనికినైనఁ
బలుకు లేటికి కిల్లాకు పనుపసాగె.  II-24

రఖాబు: రికీబ్ అను పదమునకు వికృతియని తోచును. ఉన్నతోద్యోగి అనుభావము స్ఫురించుచున్నది.

లలితంపు రుద్రవీణల వా రటుండగా
మఱి రిఖాబులవారి మాట హెచ్చె. I – 49

దునేదారి: రెండువైపుల పదునైనకత్తి అను అర్థమున పూర్వకావ్యము లందు ప్రయుక్తమైన పదమిది. దునియాదార్ = మంచివ్యవహర్త. చతురైనవాడు శూరుడు అనుభావముల నిట ప్రయోగింపబడినది.

వ్రాలిన విరిజొంపముపై
రాలిన పుప్పొడులు ప్రసవరిస మను ముద్ర
గ్గీలుకొనఁ బొలుచు చిలుకగు
డాలదునేదారి కొలుచు రాసు లనంగా.

తెలుగుపై పారశీక భాషాప్రభావము నాడుండినట్లు ఆధారములు కలవు. సంస్కృతాంధ్ర గ్రంధములను పారశీలిపిలో వ్రాయుట ఇట గమనార్హము.

పారశీలిపిని జొప్పడ భగవద్గీత
లెన్నిర వ్రాసిన చిన్న వలద. II–88

పాపోసు (1-50). జరీచీర (1-53). హిజారు (1-86). నేజా ( II–44 ). బందాకోరు ( IV–184 ). సలాము ( IV–213 ). కైజాచేయు ( IV–99 ). మున్నగు ప్రయోగము లెన్నియో నిందు కన్పట్టును.

విప్రనారాయణ చరిత్ర: 1650

ఉరుదూ పదములను నుడికారములుగ రూపొందించి ప్రయోగింపుటలో ఈ యుగములోని కవులలో విజయరాఘవ నాయకుడు ప్రత్యేకముగ పేర్కొనదగినవాడు. విప్రనారాయణ చరిత్ర యొకయక్షగానము.

మొగలాయివాడు:

తినకూతురు వయోవిలాసముల దోచుకొనిన విప్రనారాయణుడు సంపన్నుడు కాదని తెలిసిన తరువాత వేశ్యమాత అతనిని ఇంటినుండి వెడలగొట్టుటకు సంకల్పించు కొనిన సందర్భమున వేశ్యమాత విప్రనారాయణునితో ననిన మాటలు,

. నాబిడ్డ యోజలుఁజెఱిచి
మొగలాయవాడవై మోహపుట్టించి
పగలురేయిని బానుపు దిగవు
యేమందుఁబెట్టితో యేమిసేసితివో.

అందగా డను అర్థమునందును. విలాసపురుషు డను అర్థమునందును కవి మొగలాయవాడు అను పదమును ప్రయోగించెను మొగలులది వీరజాతి. మొగలులు తుర్కవంశీయులు బాహుబలమునకు అందమునకు పేరుపొందిన వారు. సామ్రాజ్యాధినేతలుగను, రసికులుగను ప్రసిద్ధులు.

ఇంతచక్కని జాతీయముగ రూపొందిన ఈ పదము క్రమముగా "మొగలాయిదర్బారు" అను భిన్నార్థము నొసగు జాతీయముగ మారినది. పనులు సరిగా కాని కార్యాలయమును మొగిలాయిదర్బారనియు రీవిని మొగలాయిథాట్ అనియు నందురు.

కూచిమంచి జగ్గకవి: 1700—1765

పెద్దాపుర సంస్థానాధీశ్వరుడు తిమ్మజగపతి వలన "చేబదల్"[1] అను బిరుదము నొందిన కూచిమంచి జగ్గకవి ఒకానొక సందర్భమున హైదాబాద్ వచ్చి మహమ్మదీయ ప్రభువును తన పాండిత్యముచే మెప్పించియుండెను.[2] తెలుగుకవులకును మహమ్మదీయులకును ప్రగాఢ సంబంధము లీయుగములో నేర్పడియొండెననుటకీ సంఘటనలు నిదర్శములుగ నున్నవి.

మాజుము: మాజూన్ పదభవము. ఒకవిధమైన లేహ్యము,
"మును నల్లమందు మాజుము తినియున్నది."

కాస: ఖాసా అనగా సొంతమైన. ప్రభువులు ప్రత్యేకముగ నుంచుకొనిన వేశ్యలను కవికాసాలంజ లని పేర్కొనెను.

ఃయంతి మహాదేవు మాన్యంబు, లెలమి
కాసాలంజ కిచ్చినావు" సంద్రి వి. I-34

---

[1] భక్తమందారశతకము "తిమ్మ భూమండలేశ్వర పర్యార్పిత "చేబదల్" బిరుద విస్ఫాయ జగన్నాథనామ రసజ్ఞండను."

[2] చంద్రరేఖా విలాపము, సంపాదకుల పీఠిక.

బాలీసు: వీపున కానుట కనువైన దిండు.
"అతని పెనుబాలీసులు" III-87

ఈ కవి ప్రయోగించిన ముస్తీబు. గొల్లాము, తురకిసేస్తలు. కైజారు. అను రూపాంతరములు కొన్ని గమనింప దగినవి.

కూచిమంచి తిమ్మకవి:

పారశీక పదములతో నీకవి కూర్చిన సమాసములు అచ్చతెనుగు కావ్య ప్రయోగములలో విశిష్టము లైనవి.

నలువబాబా: "నలువబాబా లయ్యె చులుగులెల్ల"
—అచ్చతెలుగు రామాయణము I - 7

పులుగుహుమాయిజోదు పెంగూదు కానుపు పేజీవజీరు ఛత్కరప్పులు మున్నగునవి.

గోగులపాటి కూర్మనాథకవి: 1720

ఉర్దూ పారశీక పదబంధములనే కాక వాక్యములను కూడ తెలుగుపద్యములలో చొప్పించుట ఈ యుగమునాటి తెలుగు కావ్యములలో గన్పట్టు విశిష్ట లక్షణము. ఈ ప్రయోగములందు దక్కనీ ఉరుదూభాషాప్రభావము ప్రస్ఫుటముగ గన్పట్టుచున్నది. ఉరుదూ వాక్యములతో తెలుగుపద్యముల నల్లుట చిత్రకవితారీతి. శైలి మణిప్రవాళశైలి.

ఢిల్లీ సుల్తాను అవురంగజేబు పనుపున మహమ్మదీయు లాంధ్రదేశమున బ్రవేశించి దేవాలయములను మసీదులుగ మార్చిన సంఘటనలు వారొనర్చిన దుండగములు చరిత్ర ప్రసిద్ధములు.

పారశీక పదములను తెలుగుకవిత్వమునకు శోభగూర్చునట్లు ప్రయోగించుటలో నీకవి సిద్ధహస్తుడు. మహమ్మదీయుల దుండగములను కన్నులకు గట్టినట్లు వర్ణించుటయందును, తెలుగువారి హృదయమును కదలించుటయందును. ఈ శైలి తోడ్పడినదనుటకు సందేహము లేదు.

జడవిప్పి జులుపాలు సవరింపు మిరువంక
బలు కిటకీదారుపాగ చుట్టి
బొట్టు నంగీ యిజా ర్తొడుగు దట్టీ జుట్టి
కై జారు దోపు డాలుకత్తిఁబట్టు. 32

గుడుగుడీ, హుక్కా, పీర్జాదా, పీరు, పకీరు, సయ్యద్, మొఖాసా మున్నగు పదములు బహుళముగ బ్రయోగింపబడిన పద్యము లిందు ఎన్నియోకలవు.

హుక్కా పకడోరే గద్దా, పాము ధోనేకు తుం పాని లారె, ఘాసు లారె ఆరే గాండూ, బేగీ ఆరే అరబ్బీ పడోరె, మత్రిఖో మూపర్ మాటి, పత్తర్ కాయకు బందియూరె, కాలటీకా తూ నికాల్దెవు మున్నగు వాక్యములతో కవి యొనర్చిన పద్యరచన, ఈకావ్యములోని విశిష్టత. మాటిఅనగా మట్టి. నూనెగున్నా తో నున్న పావుఁ అను పదము నీకవి "పాము" అని ప్రయోగించుట గమనార్హము.

కొట్టితోలగ నీకు గోవృషభంబుల
బాజుగాదు గులాలఫౌఁజు గాని 15

అనంతరకవులకు మార్గదర్శకమైనశైలి ఇది. వ్యాజోక్తులకు ఎనలేనిశక్తి కలిగించినది ఉరుదూ పారశీక పదప్రయోగములే.

బేగీ ఆరే అరబ్బీ పడోరే యని
జోడి సన్యాసుల బొడుచు వారు
మత్రిఖో మూపరు మాటీయనుచు వెష్ణ
వుల బొట్లు దుడుపుగ బోవువారు
పత్తరు కాయకు బందియారే చోడు
దే వని శైవుల దిట్టువారు
కాలటీకా తూ నికాల్దే వటంచు మా
ధ్వులఁబ్రిల్లదము లాడి తోర్రియువారు.

ఉరుదూభాషను చక్కగా జీర్ణించుకొని వ్రాసిన పద్య మిది. చిత్రభాషాకావ్య రచనకు, అన్యదేశ్య ప్రయోగములతో వ్యాజస్తుతి రచనకు, సజీవశక్తిని కలిగింపవచ్చునను టకు ఈపద్య మొక్కటి చాలును. ఉరుదూ భాషకు శాఖాంతరభాషగా రూపొందిన దక్కనీభాషకును నిది తార్కాణముగ నున్నది. కవి వ్యాజస్తుతులకు క్రొత్త ఊపిరి పోయుచున్నది. అన్యదేశ్య ప్రయోగములుకదా అని ఈసడింపు కలుగని విధముగా కవి ప్రయోగించుట ప్రశంసార్హము.

దక్కనీరూపములను గూర్చి ఒకటి రెండు విశేషములు. ఇవి ఉరుదూభాషా చరిత్రకారులకును నుపయుక్తములగు ప్రయోగములు. పథ్థర్ సరియైన రూపము. పత్తర్ అని కవి ప్రయోగించెను. బందియారె అనునది దక్కనీభాషారూపము. పావుఁ ధోనేకు

తూపానిలారే అనుటసరియైన పద్ధతి. కవి "తుంపానిలారే" అని ప్రయోగించెను. "గధా" గద్దా అయినది. ఒత్తక్షరములో దూషణ తీవ్రత సూచ్యము. ఉరుదూభాషలోని దూషణోక్తులు బూతులు రచనకు జీవము పోసినవి.

ఆంధ్రనాయక శతకము సింహాద్రినారసింహ శతకమువంటి శతకముల శైలిని, భావవ్యక్తీకరణ విధానమును, అనుకరించిన కవు లెందఱో కలరు. వారిలో భల్లాపేరయ ప్రత్యేకముగ పేర్కొన దగినవాడు.

భ ల్లా పే ర య: 1770

గుడిగుడీపొగలు పైకొనఁ జాతురో యని
వలసబోతివి పరివారు నవ్వ ..
లుడికీ యఫీ మాదురిడ జూతురో యని
యెడ నెక్కితిరి మీ రాగి ధరిత్రి 3

* * *

శ్రీరామముద్రి లీ క్షితిని నీరస మంచె
నగ్బర్ బక్తె రను నచ్చు లమరె
గోవింద శబ్దముల్ గురిమాల యాషూసక్
యావుసే నను పల్కు లావ హిల్లె ...
సత్రశాలాంగణల్ చలువ పందిరులు బ
ర్బర చిఖాసాల చప్పరము లయ్యె. 21

కూర్మనాథకవి వలె ఈ కవియు ఉరుదూవాక్యములను పారశీకపదములను గిరి శతకమున ప్రయోగించి శైలికి విశిష్టతను కూర్చెను.

ఆవు బైటో అని యాదరింతురుగదా
తురకలతో మైత్రి నెరపవైతి
రాముగా మనుచు తాజీము లిత్తురుగదా
యూర కుండిన మిమ్ము నూఅడించి
కలిదిమిల్నా యని కౌగిలింతురుగదా
యెదురుగా నేగిన బెదరులేక
కర్పూరవిడెముల మనత నిత్తురుగదా
వజరుపట్టిన మద్దైనజరు గలిగి. 33

"నజరు పట్టిన మద్దెనజరు గలిగి" అనుటలో అంత్యానియమ రచనకు మార్గ దర్శక మగు శైలి ఇందు బీజప్రాయముగ గన్పట్టుచున్నది. నజరు, మద్దెనజరు. ఆలం కారికముగ ప్రయుక్తము.

వృశ్చిక 'రో మాది వీరుల కినుమడే
సిఫిరు షెంషేరుల సిద్ధఫలము 49

* * *

లగ్గలు పట్టింప లంకాపురము గాదు
మహి జాఫరుగడి మహలు గాని. 50

* * *

అంగద సుగ్రీవ హనుమ దాదులకు లా
ల్కాడ తాలు దొడగించు భుజము మీఱ 58

* * *

మొగలు బచ్చాల కగ్గుపడ దగ దటంచు
తొలిగిపోతి రికేటి దొరతనంబు. 61

* * *

తిరిగి రాములు భద్రిగిరి కేగు వార్తలా
లించెనా వజీరు తాలీ లొసంగు

అరబ్బుసిద్దీలు, జుబా. బీబీ. ఖురాను, పులావు, గుమస్తా స్వారీ, సనదు, ఫరమాన, జవాను, బందూకు మున్నగు ప్రయోగము లిట్టి శైలికి తోడ్పడినవి. కవి ఉర్దూ పారశీకములతో చక్కని పరిచయము కలవా డని ఈ ప్రయోగములు శైలీరమ్యత కను వుగా నెన్నుకొనిన పదబంధములు నిరూపించుచున్నవి.

## వేల్పూరి విస్సన్న: 1780

ఈకవి రచించిన విశ్వేశ్వర శతకము చారిత్రిక ప్రాధాన్యము గలది. సింహా ద్రినారసింహ. భద్రిగిరి శతకముల రీతిలో రచింపబడినది.

కొత్వాలుఖానా హుకుం ఖరారై యుండ
ప్రిహరితిర్గుట మానె భైరవుండు.

* * *

హాజీర యనెదొ నౌరోజర్పు మేజువాణి ...

* * *

సరిఖేలు హురుమత్తు సాపు బాగీలకై
మఱచెనప్పటి వృత్తి మాధవుండు

హుర్మత్ అను పారశీపదము హురుమత్తు అయినది.

హౌదుఖానా నిడు లాయెగా యుత్తుంగ
సౌధగోపుర బహుస్తంభ విరతి.

హుజుఖానా వికృతి హౌదుఖాన.

ఈశతకము నందలి ప్రయోగములు కొన్ని సామాన్యములు. మరికొన్ని భావపుష్టికి తోడ్పడునట్టివి.

వివిధ శతకములు: పంథొమ్మిదవ శతాబ్దియందును, ఇరువదియవ శతాబ్దమునందును, శైలిలో చమత్కారమును సాధించిన వారును, అంత్య, ప్రాసనియమములను క్రమభంగములో ప్రయోగించిన వారును, సీసపద్యపు యాగులో క్రొత్తదనము సాధించిన వారును, అయిన శతకకర్తలు కొందరు కలరు. కొన్ని పదములను వాక్యములను మాత్రమే ప్రయోగించిన శతకములిట ఉదాహృతములు.

రాజగోపాల శతకము:

తరాజు: "న్యాయమార్గము దప్పి నరులను వేధింప
రాజు గా డతడు తరాజు కాని."

* * *

లత్తుకోరు: కరణంబులు కాపులు కలహించు చుండిరా
యూరుగా దది లత్తుకోరుకాని.

శబ్దాలంకార ప్రీతి కల శతకకర్తలు వీరు. రాజు, తరాజు, ఊరు, లత్తుకోరు అనునవి అంత్యప్రాసలో క్రమ భంగమున పాటింపబడినవి. ప్రాస స్థానమునందు పదము యొక్క కొంత భాగమే స్వీకృతము. అంత్యనియమము లందు చరణము చివరి గణముపై కవులదృష్టి లగ్నమగుట సాధారణమే కాని కొందఱికి ప్రాసస్థానముపై దృష్టి ప్రసరించినది. పదముల అర్థమును బట్టి విచారించినచో భావమున కేవిధముగను పొత్తు కుదురుటలేదు. ఇట్టివి అంధానుకరణ ప్రాయములుగ నున్నవి.

పారశీక పదములను అంత్యనియమములకు స్వీకరించి పద్యశయ్యకును, భావ వ్యక్తీకరణమునకు పుష్టికరముగ ప్రయోగించిన శతకకర్తలు పదునెన్మిదవ శతాబ్ద్యంతమునను, పందొమ్మిదవ శతాబ్దమునందును కొందఱు కలరు. ఇవ్వియన్నియు సీసపద్య శతకము లగుట ప్రధానముగ గణింపదగినది. శబ్దార్థచమత్కారములను సాధించి వినూత్న శైలికి దారితీసినవారు వీరు. ఒక రిద్దఱు కందపద్యములందును తదితరులు వృత్తములందును శతకములు వ్రాసినవారు కలరు. ఈ శతక పద్యములు మణిప్రవాళశైలికి నిదర్శనములు.

రంగ శతకము: (శ్రీమత్తిరుమల వేదాంతము శ్రీనివాస దీక్షితయ్యరుగారు) 1860.

సైరే శ్రీరంగ జమీందారు
బరాబర్ నవాబు తాఖతువర్ పా
ప్పారే బహదుర్ ఖూబు స
వారు సలా మనిరి తురకవారలు రంగా.

* *

తీరుకమాన్దస్తా తర
వారు జమాయించి కట్టి బలమాతరహా
దారీ రాంగణ మీదన్
స్వారివెడల నిన్ను గంటి సామీ రంగా.

పెంటశతకము: (పెంటయకవి)

దిల్సే జానో తెరా
అల్లాయన నెచటనుండు, కల్లరి భువిలో
కిల్లుడిగిన తానిల్చిన
బాలుడు బ్రహ్మానుభవుడు బస్కరొ పెంటా!

రంగశతకమున సామాన్యభక్తిభావములను చమత్కార రూపములో వ్యక్తీకరించుట కన్పట్టును. పెంటశతకములో తత్త్వోపదేశము ఉరుదూమాటలలో కలదు. ఉరుదూకవితలో తఖల్లుస్‌వలె ఆత్మసంబుద్ధిపరమగు మకుటమును పెంటయ్యకవి మలచుకొనిన రీతి గమనార్హము.

బాలనీతి ద్విశదశతకము: చిల్లరిగె యోగానందకవి వ్రాసిన స్థానములో ఉర్దూపారశీకపదప్రయోగము లొనర్చెను

మస్తుగ జదివిన నీకు సి
రస్తా పనివచ్చు డబ్బుచేయును రా
దుస్తు రుమాలలు వేసియు
ముస్తీబుగ దిరుగవచ్చు ....

విజ్ఞానచంద్రిక: (నృసింహరాయకవి)

వస్త్రాద్రె పలువురితో
కుస్తీలకు దిరుగవచ్చు ...

బ్రహ్మానంద శతకము: (గోపీనాధము వేంకటకవి.)

(1) ఎహీవఖ్తు
(2) నాఫర్మానీ మాఫుకిలో.

ఇక సామాన్యరీతిలో ఉరుదూపారశీకపదప్రయోగములు. గువ్వల చెన్న, కుమతి, రాజకంఠీరవ, మోహినీ, ఓరాంజనేయ, సీతారామ, శాంతానంద, అమరార్థ, హిమగిరి, శ్యామలాంబ, విశ్వనాధ, రేపాల రాజలింగ, కంచి వికార్మి శతకములలో కన్పట్టును.

సీసపద్యములలో అంత్యప్రాస పారశీకోక్తులు: అంత్యనియమము ప్రాసస్థానమునందువలె విధిగా పాటించి పద్యములు రచించిన శతక కర్తలు కొందఱు కలరు వీరు ప్రత్యేక శైలీనిర్మాతలుగ గౌరవింపబడుట కర్హులు.

శ్రీయాదగిరీశ స్తోత్రము: సింగాభట్టు నరసింహరాజు

అందాకగారు మిమ్మర్చించు హర్వఖ్తు
నీపూజ సేయదే నేకుబఖ్తు.

ఇట్లే షరీరు, బేకారు; ఖాతోను, బాలానిషీను; ఇమాను, దర్మియాను; మున్నగు పదములతో నంత్యనియమరచన సాగినది.

జీడికంటి రామశతకము: ప్రభుత్వ వ్యవహార పారిభాషిక పదావళిని అంత్య నియమముగా స్వీకరించుట, రాజుల నుద్దేశించి పఠించు బిరుదావళీ స్తోత్రముల ధోరణిని భక్తిశతకములందు సరసముగ వినియోగించుకొనుట. ఇందలి విశేషములు.

బందగీ శ్రీరామచందర్ మహారాజు
పావనీ నీబంటు బిల్పరేజు.

*　　*　　*

నాకలోకము నీకు దీవాన్‌ఖాన
నిగమపదార్థము నీ ఖజాన.

*　　*　　*

తెలిసి జేసైతి ఖదీం నుండి కోషీషు
పాలైతి కట నేడు బిల్పరేషు.

*　　*　　*

చిత్రిమా మంజూరుచేయ నా దరఖాస్తు
సాదరింపుచు నా యాదుదాస్తు

*　　*　　*

నిగమముల్ తమ సన్నిధిన జేతు నిషస్తు
భళిర నీ నడవడి బలురసు.

నామ, గుణకీర్తనము, ఆర్తి, ప్రపత్తి, భక్తి భావప్రకటనము మున్నగునవి పారశీకోక్తులతో నొనర్చుట, చమత్కారముతోపాటు భక్తి పారమ్యమును కూడ ప్రదర్శించుట ఈ ఉదాహరణములలో గన్పట్టును.

తిరుమల వేంకటేశ్వరస్వామి స్తోత్రం: మేరెడ్డి ఘట్టయ్య వల్దు గురువయ్య

నరవాహనుడు నిను నమ్మినట్టి సరాబు
వసుధ నన్నోప్రివ నెవ్వడు నబాబు

*　　*　　*

శిఖిపింఛమే నీకు శ్రేష్ఠమైన తురాయి
నిర్జరు లెంచ్చిరి నీ లడాయి.

వహవ్వా, ఘట్టు, బాకి, శిఫాయి, మున్నగు పదములతో నిట్టి రచనసాగినది. తండ్రియని తెలుపుటకు 'వల్దు' వాడుట గమనార్హము.

శ్రీరంగశతకము: వేంకటకృష్ణారావు.

జిద్దు, వఖ్తు, మీజాను, హిస్సాబు, ఖురాకు మున్నగు పదములతో అంత్య నియమ ప్రధానముగ రచనసాగినది.

**రాఘవశతకము:** ముడుంబై చక్రివర్తుల రాఘవాచార్యులు ఈ శతకకర్త మహబూబునగరం జిల్లా రఘుపతిపేట నివాసి,

నీదు దర్బారు పైనిండి బందోబస్తు
పూనియున్నది లక్ష్మి నిషస్తు.

* * *

యేదేవతల కైనరాదు నీ రవాబు
తలపవే నాపై కదర్భఖూబు 24

* * *

చేతు నీతో నేను చిన్నని తక్రీరు
తరిహా పసందు జేయరి జరూరు.

* * *

భువి నీ గుణంబుల నెవరు సేయు షుమారు
నిఖిలావనీస్థలి నీదె దౌరు 44

* * *

రవివంశమందిర రాజరత్నచిరాగు
గురి ధరాస్థలి నీ హుకుంబలీగు. 48

సంస్కృతసమాసముతో పారశీకపదమును రమణీయముగ గూర్చి కైటకి వన్నెకూర్చిన ప్రయోగమిది. హర్దోజహాన్‌ఖుషీ గనక చేయి పక్కాతలాషు, తక్తా జమీమి. ఖారీజు తమీజు. సరఫరాజు, గరీజు. ఖావందు, ఖుదావందు మున్నగు పదముల అంత్యనియములకూర్పు గమనార్హము.

**నాచగిరి నరహరి శతకము:** సిద్దిపేట తాలూకా నా చ వ ర ము న గల నృసింహస్వామిపై చినకంజర్లవాసి గోపాలరాయకవి చెప్పిన శతకము,

వాణీశు సమవర్తి వాస వింతెఖాబు
గావించి తిల బోవ ఘనసవాబు.
నెమ్మి దల్తురు నీదు యిస్మెషరీపు
తులువ రక్కసులు నీతో ఖిలాపు 51

చింతించి చూచిన చిత్తమే బహుఫాజి
కుదిరించి నిల్పుమీ గొప్పఖాజి.

మజూరు. మదారు, తకురారు, పాయిదారు, తాఖీరు, ఘకూరు, మజుబూరు. దర్షమారు. పైదాయిషు, హోషు, రూపోషు, పేషు, తష్క్రీషు, మున్నగు ప్రయోగములతో ఆర్తపశ్చాత్తాప, నిర్వేదభావముల వ్యక్తీకరించుటలో నీకవి సిద్ధహస్తుడు. సాహిత్యగ్రంథము లందుమాత్రమే బహుళముగ గన్పట్టు చక్కని పారశీకపదబంధముల నీకవి ప్రయోగించి ఉరుదూపారశీకప్రభావమును చక్కగా దర్శింపజేసెను.

చంద్రశేఖర శతకము: శిష్టేతరుల నోట ఉరుదూ పారశీక పదములు నుడికారరూపమున బహుళముగ బ్రయోగింపబడుచుండె ననుటకు చంద్రశేఖర శతకము తార్కాణముగ నున్నది.

తమాస: తమాష చమత్కారము అని సామాన్యార్థము చక్కగా అనుఅర్థము నందును నుడికారార్థమునందును గన్పట్టును.

తమామ: పూ_గా.

నన్ను నడిచె బాబు శిననాడు తమాసగ భాగవతంబు -
మాన్నెము, భారతంబును తమామును ....

ఢిగిడీకె మున్నగు అశ్లీలోక్తులును ఇందుకలవు.

ఖడ్గలక్షణశిరోమణి: (1780) నవనప్ప రచించిన ఈ గ్రంధమున కత్తుల పేర్లు, వానిలక్షణములు వివరింపబడినవి. ఉరుదూపారశీక నామములతో బ్రసిద్ధములైన కత్తులు, అబ్బాసి, హైదరాబాద్, బాదిషా సులతాన్, వస్తాదేమీర్ మున్నగునవిఇట్టివి.

దిట్టకవి నారాయణకవి: 1800

రంగరాయ చరిత్రము: క్రీ. శ. 1657 లో జరిగిన చరిత్రప్రసిద్ధమైన బొబ్బిలియుద్ధమును రంగరాయచరిత్రమునందు నారాయణకవి రసవంతముగ జిత్రించెను. ప్రభుత్వవ్యవహారభాషగను, నిత్యవవహారభాషగను పారశీభాష పొందిన అధిక్యము నీకావ్యము నిరూపించుచున్నది పారశీభాష తెలుగు కావ్యముపై ప్రసరింపజేసిన ప్రభావమున కీకావ్యము దర్పణము వంటిది. ప్రాసస్థానములందు పారశీకపదములను స్వీకరించి మిశ్రశైలితో పద్యరచన చేయుట ఇందు కన్పట్టును.

హల్లా సేయుదు బొబ్బిలి
కిల్లా తజ్జయము నీకు గీర్గొల్పుదునే
వల్లాడ(జుమ్మీ యిది నా
యల్లా చరణంబులాన యధిప వతంసా. II-54

హల్లా సేయుట, అల్లాచరణంబులాన అను జాతీయము లీపద్యమునకు ఎంతయు సొగసును గూర్చినవి మిశ్రభాషావైవి సంపర్పుష్టి కలది యగుచో రస పుష్టికి దోడ్పడుచుండును. నుడికారములు భావమును పటిష్ఠముగ వ్యక్తీకరించుటకు దోహదమొసగును. పాత్రోచితభాషను ప్రయోగించి కవి ఈ కావ్యమునకు వన్నెచిన్నెలు కూర్చెను.

హైదరుజంగుసాహెబు రియమ్మున నిర్మినియె కా వకీలుతో
నాదరి మొప్ప దైకిముస నైన విచారము లేటి కమ్మదీ
నాదరగామెులాజిమతు నామది రంజిలు( దదిరంస నే
కాదనరా దవశ్యము శ్రీకాకుళ మానగ వత్తుమిత్తరికా. II-8

మదీనాయాత్ర సంకల్పము. నీ కవి మదీనాదరిగామెులాజిమతు అనిచమత్కార రూపమున వ్యక్తీకరించెను.

జిమ్మాయుంచుట: బాధ్యతయై యుండుట అని భావము.

"మనతో(గూడిన కార్య మెల్ల తమ జిమ్మా యున్నది" II-76

నేటికిని ఈపదము తెలంగాణమున నిర్వ్యవహారము నందధికముగ ప్రయుక్తము

నజరు గుజరాను చేసి సొన్నా కిదాని
జాలె మాతడు కూర్నీ నిషాతుచేసి. II-79

గుజరాను చేయుట = సమర్పించుట; నజరు = కానుక.

కూర్నీనిషాతుచేసి: పూజ్యులకును పెద్దలకును లేఖలు వ్రాయునప్పుడు ప్రయోగింపబడు పదబంధమిది. సంతోషాతిశయమును వ్యక్తీకరించుట, వందనమొనర్చుట అని భావము.

ఫోక్తా సేయుట = నిఘంటువున కెక్కని పదమిది. పొఖ్తాచేయుట = గట్టిపఱచుట స్థిరపఱచుటఅను అర్థములు సూచ్యము. పొఖ్తాయే ఫోక్తా యైనదని తోచును.

"తగురీతిగాఁ బలికి ఖోక్తా సేయు మంచు న్వడిన్." II-85

గరీబ్‌పర్వర్-మెహర్బాన్=ప్రభుస్తుతివాచక పదములు. బీదల పోషించు వాడా, దయాత్మా అనిఅర్థము.

"వీడె వకీలు హాజరు గరీప్పర్వర్మెహర్బాన్ సలా మంచుం...
గొంచక చోపుదారు లెదుటన్ హర్షంబునం దెల్పగా. II-86

"గడీ ఖాలీచేసి యథేచ్ఛగా నేగుమని మీఖావిందుకున్ వ్రాయు ..."
II-148

"కోట ఖాలీ యొనర్పుటకేటి సబబు II-149

సబబు అనగా కారణము. ఖాలీచేయుట=భావమును స్పష్టముగను శక్తిమంతముగను. వ్యక్తీకరించుట కీప్రయోగము దోడ్పడుచున్నది. To Vacate అను భావమును వదలుట అను తెలుగుపదములతోడ స్పష్టమొనర్పలేము.

తక్సీరు మాఫుచేసి: తక్సీరు అనగా నేరము. తప్పు. ఈజాతీయమున కర్థము మన్నించి అని. నిఘంటువున కెక్కని ప్రయోగమిది.

"మాయెడల నిట్టి తక్సీరు మాఫు చేసి" II-192

బాకీ కటాయించి: ఇవ్వవలసినది తగ్గించి అని శబ్దార్థము, ఎగబెట్టి అని భావము,

"పైక మీజాలక బాకీ కటాయించి." II-171

బజాయించుచు:నా "బత్తు బజాయించుచు" II-208

ఘిరాయించు: ముట్టుముట్టు; మోహీము చాటుట=యుద్ధము చాటుట.

గడి ఘిరాయించి సైన్యముల్ గండటంచు
సైనికుల కెల్ల మోహీము సాటింపుడు. III-8

శికస్తగుట: ఓటమి నొందుట. ఓడిపోవుట అని అర్థము. షికస్త్‌పదభవము.

కృశమై మేనులు డస్సి పాఱెడు ఫిరంగీ గుండ్లచే డస్సి పౌఁ
జు శికస్తయ్యె..... III-127

ఒకధూమురేగి: ధూమ్‌మచ్నా అను జాతీయమునకు తెనుగు రూపము.

ఒకధూమురేగిన లస్కారు
పికపికలై తుముల రిణము పెంపుని III-203

* * *

పటతెంచు లోంటి పస్తాదుల
ముస్తాదు లంతంత మురిపు జూప. III-189

శబ్దాలంకార మిటగ మన్నాపైము.

జెజాయి: జెరుూయి అను రూపమునందును ప్రయోగింప బడినపదము. ఇది ఒకవిధమైన ఆయుధము. ఫిరంగి.

చక్కని పన్నంపు జంజాలు గవిసెనల్
జాల (ఛొప్పదు జెజాయిల దాటు. I-153

సిఫహాసరదారు: సైనికాధికారి అని అర్థము.

కితాబు: బిరుదము.

సిఫహాసరదారు గా రనియెడు చొప్ప కితాబులు. I-140

శిలేబర్తల్లు = శరీరరక్షక మని అర్థము.

సహస్రసంఖ్యల శిలేబర్తల్లలోవచ్చి. I-159

పాదుష (I-137). కితాబు (I-140). ఖజానా (I-141). మొహరా (I-150). జుల్మలీచేటీలు (I-154). జరీనిచానీ (I-155) చిచేలి. జమాబంది. సరాకారు (II-6, 7, 8). జేరుదస్తు (II-33). బందగీ. తజ్వీజు. నానావగైరా (II-39) తాకీదు (II-70). కురిచీ (II-113). హేజుబాతి (II-115). నిశాయొన్చుల(II-124) ఖానాఖహా (II-142). హరకాలా (II-143). ఫరవానా (II-144). హాకీము(II 151) జాగా (II-155). అరబ్బీ (II-209). ఖాదా (II-252). సాహెబుసుబాపు (II-171) మోహీము (III-4). లడాయీ (III-21). బాజా (III-26). నిశానీ (III-50). మోర్చా (III-61). బురుజు (III-63). శిపాయిగుంపు (III 124). తలవారు (III-133). నేజా (III-200). నబాబు (III-205). ఖానుసాహెబు (III-232). కనాతు (III-252).

మొదలగు ప్రయోగములసంఖ్యాకముగనిందు కలవు.

చారిత్రికకావ్యము లందు ఇట్టి ప్రయోగములు సాధారణముగ గన్పట్టును. ఇట్టి అన్యదేశ్య ప్రయోగములు లేని చారిత్రిక కావ్యములు లేవనియే చెప్పవచ్చు. ఈ ఒక్క అంశము ఉర్దూపారశీప్రభావ ప్రాభవమును నిరూపించుచున్నది. ఇందుగల క్రియారూపములు, ఇంచుగాగమములు పరిశీలింప దగినవి. ఈకావ్య ప్రయోగములలో గొన్ని జమాబంది బందోబస్తు పారిభాషిక పదములుగ నున్నవి. నేటికిని మన మాపద ముల ప్రయోగించు చున్నాము.

## విస్సాప్రెగ్గడ కామరాజు:

ఈకవి రచించిన బేరీజు పద్యములలో దాదాపు 81 పద్యములు లభించినవి. పారశీపదములతో చిత్రమైనశైలి యిందు కన్పట్టును. జమాబందీ, జమీందారి వ్యవహారము లోని పారిభాషిక పదజాలములో చక్కని కవితాధారతో కామరాజకవి పద్య రచనమొనర్చెను.

తనరారు నొక్క తెల్లని తాబు గైకొని
చెలువైన కత్తెర చేతబూని
వన్నెమీఱగ నాల్గువైపులు కత్రించి
యెనిమిది గదులుగా నేర్పరించి
తురుమగా వ్రాయు దాతుకలంబు చేపట్టి
నిండు షాయి బుడ్డి దండ నునిచి
చెలువొందు దాపు పై చిర్ఠాను లిఖియించి
బారాముసద్దీలు ప్రస్తుతింప
నాడెమై చెన్నొందు నగదు చిర్ఠా చూచి
కూరిమి రోజు మజ్కూరు వేసి
తొలిగది యందు బొందుగ బారు గావించి
కడువేడ్క మిగిలిన గదుల యందు
తెలియంగ తాలూకు దేహాయఖర్చులు
పట్టముల్ రుసుములు బాజుగుస్తు
లొదవు జుల్మానాలు మొదలుగా గల వస్తు
బత్త బిస్తీలతో బారుచేసి

వాని బేరీజు లన్నియు వరుస గూడి
దేని బేరీజు దానిని తేట పఱిచి
మొత్తు బేరీజు గల్పి సరికట్టి యున్న
నది వసుంధర నావర్జ యని వెలుగు

*　　*　　*

నగదు చిరా వ్రాయదగు రీతి జమఖర్చు
పేర్వేఱ నావర్జు చేయుదారి
వెల జమాఖర్చు నర్మిలి వ్రాయు పద్ధతి
పేర్కొ-జెందిన పద్దువేయు సూటి.
పరికించి మునసిపు బారుసేయు తెఱంగు
సాలుజమాఖర్చు సలుపు విధము
పరగ జమా వసూల్బాకీ జమాఖర్చు
వరుస వసూల్వారి వ్రాయునేర్పు
లోకులెన్నంగ దగు చెల్లుబాకి సరిణి
యవని జమరట్టి సెహా సేయునటి క్రమము
చెప్ప బూనితి నాకు దోచిన విధంబు
రసిక జనులార మీదయారసమునొంద.

తా బు: కాగిపపురావు, రుసుము = రుసూమ్ పదభవము. రోజుమజ్కూరు, దినము లెక్క-ప్రకారము. పేర్కొ-నబడినదినము.

బాజుగుస్తు: బాజగష్త్ పారశీపదము. ఇచ్చివేయబడిన రొక్కమని అర్థము. (Refund)

తబిసీళ్లు: తఫ్సీల్ = వివరములు: బేరీజు = దివాణపు పన్ను మొత్తము:

ఆవర్జ: ఆవ్వర్ద్ అనుపదముయొక్క రూపము, ఆదాయము.

సాలుజమాఖర్చు: సంవత్సరపు ఆదాయవ్యయములు.

వసూలుబాకీ: ఇవ్వబడినదియు మిగిలినదియు నగు ధనము. వసూల్వారి = ఇచ్చినక్రమము.

సెహాసేయుట: సహీచేయుట సరిచేయుటఅని అర్థము. ఈ పదమే కన్నడమున సరిచూచి చేవ్రాలు పెట్టుట అను అర్థముల నొందినది.

శిష్టు కృష్ణమూర్తి చాటువులు: (1790-1890)

పందొమ్మిదవశతాబ్ది పండితకవులలో సుప్రసిద్ధులు వీరు. కాకర్లపూడి వారిపై చెప్పిన ఉత్పలమాలిక ఉర్దూపారశీకములతో సాగినది. ఇదియు మిశ్రభాషాకవిత్వమునకు చెందిన ఉత్పలమాలిక.

వీరు తెనుంగుసాము లరబీతరబీయతు నొప్పు గొప్ప స
ర్కారు వలే జమీలు దరఖాస్తుగ నేలిన రాజమాన్య హం
వీరులు ఢక్కణీలు తజవీజు కులహికులున్న యేటి మం
జూరు జొహారు యాఖిదమషూరు ఖరారు, మదారు, బారు బ
ర్దారు, మిరాగ్గురాల పరదారుల రౌరు కడాని తేరులం
బారు మిరారు నౌబతు సుమారు పుకారును మీరుకుద్దీనీ
దారు గుడారు పైకము బిడారు బజారు కొటారులందు నే
దారు పరాణి బారుదళదారు సవారు షికారులందు బి
ల్కారు సతాసవారు పిలగోలతుపాకుల ఫైరులందు లే
ఖ్యారుగ (బెక్కుమారులు తయారుగ వీరి హుజూరు లందు వె
య్యాఖులు పెద్దపేరుల జొహారులు చూచి హమీరు లెంచి ద
ర్బారు పసందు మీఱ వహవా యని మెచ్చ నవాబుఖాను షెం
షేరు బహాదరుల్ పెరవజీర్షుల నూఱుల మాఱుకెన్న తా
ర్మాఱుగ మోది గీములు తమాము వదల్చి ముఖాము లెల్ల ఫీ
ర్యాదొనరించి మిక్కిలి మరాతబు లందిరి చేరుమాలు త
ల్వారుల జేరుదారు దళవాయుల చాయల మీఱు చారుకై
జారు కరారు బాకు నెలజాఖు తళుక్కున బందు బస్తుగా
షోరు ఖుషోరు కాకరలపూడి వజీరు లదేయనన్....

రాజ దర్బారు లందు బిరుదావళిని పఠించుపట్ల మహమ్మదీయ సుల్తానులు కొన్ని సంప్రదాయముల నేర్పఱిచిరి. బిరుదుగద్యల పఠనసంప్రదాయమును, ఉర్దూపార

శీక బిరుదావళులను, కృష్ణమూర్తిగారిందు వినియోగించుకొనిరి. కొన్ని పదముల వ్యుత్పత్తి పరిశీలనార్థము. అమీర్ హంవీరైనది, హజారిము—ఇది హుజూరియను పదభవమనుట పొసగును.

విశ్వనాథనాయనిస్థానాపతి రాయవాచకము:

ఇది చారిత్రికప్రాధాన్యము గల వచన కావ్యము. విజయనగరవృత్తాంతము, శ్రీకృష్ణరాయల చరిత్రము మున్నగు అంశము లిందు నాటి వ్యవహారభాష యందు వివరింపబడుట ప్రధానముగ గమనింపదగిన విశేషము. నాటి ఆంధ్రవ్యవహారభాషా స్వరూపమును గ్రహించుట కిది ఎంతయు తోడ్పడినట్లు. ఉర్దూపారశీక పదప్రయోగ స్వరూపమును కూడ పరిశీలించుటకు సహాయకారిగ నున్నది ఇతర కావ్యము లందు గన్పట్టని విశిష్ట ప్రయోగము లిందుగలవు.

హేజీబు: ఇది హాజిబ్ అను పారశీపదమునకు వికృతి. ప్రభుత్వ వ్యవహారములను కాని తదితరకార్యములను గాని నిర్వహించుటకు ప్రభువులు పంపు అధికారులను హేజీబు లందురు. వ్రాయసకాండ్రు, లేఖకులు అను అర్థమునందును ఈ పదము ప్రయోగింపబడు చున్నది.

"కుతపనపులక వారి హేజీబులు మున్నగువారు" పుట 46

లశికిరీ తనము: లష్కర్ అనగా దండు, సైన్యము, పారశీపదము. లశికిరీ తనము అనగా సైనికబలము అని సందర్భార్థము.

"నిజాం రవుతులు లశికిరీ తనాన సరిగదా ద్రవ్యసామగ్రి యందు... కొదవ."
పుట 46

నామజాదు: నామ్జద్ అను పారశీపదమునకు పేరు పొందిన, పేర్కొన బడిన అను అర్థములు కలవు. నామ్జద్ కర్నా అనగా నియోగించుట, పేర్కొనుట. ఇట నియోగింప బడినవారు అను అర్థమునందు "నామజాదు" అనుపదము ప్రయోగింప బడినది. అధికారులు అనిభావము.

"తమ ఆజ్ఞలో నడుచుక వారి మాట మీద నామజాదులు అంపురా"

కూచిశేయించి: దండును ప్రయాణము చేయుంచుట అని అర్థము. కూచ్ అను పదము కూచి అయినది.

"కాహళాల వారిని రప్పించి నగారా కూచి శేయించ్చమని." పుట 90

నిశానులు: టెక్కెము అను అర్థమునందివట ప్రయుక్తము.

"గుడారాలు నిశానులు నగారా మొదలైనవి మొదట జగడాన దొరికింద్ది" పుట 89

నగారా: నఖారా అను పదమునకు వికృతి. ఢంకా అనిఅర్థము.

మోర్చా వేసి: దుర్గముచుట్టు త్రవ్వబడు కందకమును మోర్చా అందురు. యుద్ధమునిమిత్తమై త్రవ్వబడు కందక మనియు అర్థము. మోర్చావేయుట=సైన్యము దింపుట అని వ్యవహార్థము. మోర్చ పారశీపదము.

"యేరు దాటివచ్చి మోర్చావేసి పాళ్యము దిగినారు. పుట 101

పట్టీ: జాబితా అని శబ్దార్థము.

"రామలింగ నాయనికి పట్టీలు ఇచ్చి అంపగా." పుట 102

భరవసా: భరోసా అను పదమునకు తెలుగు రూపము. విశ్వాసమని అర్థము.

"మేమే నేరస్తుల మని భరవసముగా చెప్పిన తర్వాత" పు. 55

నదురు: ఇది నజర్ అను పదమునకు వికృతి. కానుక అని అర్థము. ఒకే అర్థము గల పదములను జంటగా ఈ కవి బహుళముగా ప్రయోగించెను.

"కానుక నదురుదెచ్చి"

రస్తు: ఇది రసద్ అను పదమునకు వికృతి.

రస్తు సామగ్రి పు. 49

సర్నీసు: ఇది కొర్నిష్ అను పారశీక పదము యొక్క రూపము. వినమ్ర శిరస్కులై రాజునకు ఏడుసార్లు సలాముచేయుట. గౌరవాధిక్యమును సూచించును. మొగలు దర్బారులో నిట్టి సంప్రదాయము నధికారులు పాటించుచుండిరి.

"సవినయంబుగా కుర్నీసులుశేశి" పు. 110

దాదిమహల్: న్యాయసభా భవనము.

యాది హెచ్చరిక : యాద్ అనగా జ్ఞాపకము. హెచ్చరిక అను భావార్థముకూడ కలదు.

కాకితము, రూపాయ, హజారీలు, దుపేదారు, ముస్తైదు, వజీరు, దివాణం, సలాము, ముల్లా, పక్కీరు, సురథాణి, సుల్తాణి, చబుకు, తురిక, రాన మున్నగు ప్రయోగము లెన్నియో నిందు గలవు. దేశ నామవాచక శబ్దముల స్వరూపము మారినది. కుతుపనమలక, యెదులసాహు, యదులసాహు, విజయాపురము, నిజాంశాహు, పెదవ కోట, పలుబరిగి మున్నగు ప్రయోగము లిట్టివి. శాసనములందును నిట్టి రూపములు బహుళముగ ప్రయోగింపబడినవి. ఇవి నాటి వ్యవహారి రూపములుగ నుండియుండును.

బోలిపెద్ది వేంకటరాయకవి : (1800—1875)

ఈ కవి కార్వేటినగర సంస్థానాధీశ్వరులు శ్రీ వేంకటపెరుమాళ్ళరాజేంద్రుని యాస్థాన విద్వాంసుడిగ బ్రఖ్యాతిగాంచెను. ఈ కవి తిట్లదండకము రచించెను. రామయ్య యను నియోగిబ్రాహ్మణుని యింటి దొడ్డియందలి కూరిపాదుల మొలకలను వెంకటరాయ కవి బఱ్ఱె మేసినందులకు రామయ్య భార్య చీటికిమాటికి కవిని కవి భార్యను ఏదేనొక సాకుతో తిట్టిపోయుచుండెను. వేంకటరాయకవి హృదయము పరిపరివిధముల మండు చుండెను. ఒకానొక సందర్భమున మార్గమధ్యమున తారసిల్ల రామయ్యను జూచి వేంకటరాయకవి దండతాడిత భుజంగమువలె బుస్సునలేచి ఈ దండకమును ఆశువుగ జెప్పెను. ఉర్దూ పారశీకములందలి దూషణోక్తులు అశ్లీలోక్తు లీదండకమున స్వేచ్ఛగా బ్రయోగింపబడినవి. మిశ్రభాషలో దండకము చెప్పుట క్రొత్త. ఉర్దూ భాషలో నశ్లీలోక్తులకు లెక్కలేదు. అవి అన్నియు పారశీపదభూయిష్ఠములు. చేతిలో నిసుమంత అధికారమున్న చాలు. అధికారుల దర్పము వెల్లువలై ప్రవహించును. జవాను దగ్గరనుండి జమీందారు వఱకును నిట్టి తిట్లను ప్రయోగింతురు.

“ఛీ,ఛీ. ఒరే పాతకా! ఘాతుకా, ప్రేత, దుర్నీత, మన్నోత, ఉచ్ఛిష్టపుణ్యారోత, వారాంగనా మూత్రముల్పట్టు ముంతా, ఇదేచూడరా, ధాత, నీవ్రాత, నాచేత పట్టిచ్చెరా, నేడు, దుర్బీజమా, నైజమా, సాజమా, నీతమా... , హరామా, గులామా ....డగాకోరుఫాజీ, దగుల్బాటిమాజీ, ముర్దారు, హల్కా ..., దివానా ...., బహం . తు, లమ్డీకె, చమశ్చేహియా, మా . . యా, .. నమర్దా ..., దివాల్కోరు, ....బేకూఫు, ....బేమాని, ....లుచ్చా, హరాంకోరుబచ్చా, . . నీయమ్మనుంగ్రుమ్మ, నీయబ్బనుం ద్రొబ్బ, నీయత్తనున్మొత్త, . . నీచెల్లెలింగొట్ట, ....బజారీ....కాఫిరీ....”.

ఇస్లే సాగిన దీ దండక మంతయు. ఉర్దూ పారశీకములతోడి పరిచయము తెలుగుభాషలో నిట్టి దండకములు పుట్టుటకు హేతువైనది. ఈ దండకములో కొన్ని పదములు వికృతి రూపము దాల్చినవి. ముర్దారు ముర్దారు అయినది. చమార్ అనగా హీనకులజుడు, చెప్పులు కుట్టువాడు. ఇందులో చమర్ రూపమున ప్రయుక్తము. బేహాయా అనగా సిగ్గులేనివాడు. బేహియా అను రూపము సరియైనదికాదు. నామర్ద్ = నపుంసకుడు. అది నమర్దా అయినది; బేవఖూపు, సరియైన రూపము. మూర్ఖుడని అర్థము. వ్యవహారమున బేకూఫ్. అయినది.-

## సురవరము ప్రతాపరెడ్డి:

దండకము ప్రసక్తివచ్చినది కనుక ప్రతాపరెడ్డిగారి 'వెట్టివానిపాట'నుగూర్చి ఇచ్చట వివరించుట సమంజసమనిపించును.

నిరంకుశ ప్రభుత్వాధికారుల. గ్రామాధికారుల దుండగములను కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు ఈదండకములో చిత్రించిరి. ఇందును మిశ్రభాషాశైలి కన్పట్టును.

"ఏమి గ్రాచారమో రామరామా. యి కెవ్వారితో చెప్పినా యేమి లాభంబు. మారాత యిట్లుంది రెడ్లొక్కరే కాదు, పట్వారి పోలీసుపోట్టేలు, తాసీలుదా రంటరో, మొద్దుమీనంట, తాలూకుదా రంట, కచ్చేరి బంటోత్రు లంటా, అమీనుసాబు యింకా తమాషైనహోద్దార్లు వస్తారు. బేగారివాన్ని పకడ్లావు మంటారు, గుఱ్ఱాన్కి ముందుర్కి మంటారు. బచ్చాలు వానింట సౌదామసాలాలు పట్టిచ్కరమ్మంటు చెప్తారు.. కోమట్లతో పీకులాటైతె తప్పిందికాదయ్యా. వాళ్ళియ్య కుంటే దఫేదార్లతో గుద్దులాడాలె, ఊరూరికీ యెట్టిమొయ్యాలె, పోట్టేళ్ళు పెట్టల్ మరీ గుడ్లు తేవాలె, ఆలస్యమైతేను తుర్కాన చేదంట గిదంట తిడ్తారు, మోజాలతో యీపు వాయంగ కొడ్తారు. హుక్కాలు తాగాలె మాకిగ్గి పెట్టండి అంటారు. పానీపిలా వంటె నోట్లోకి నీళ్ళన్ని పోసేది మేమేకదా, వారి పెండ్లాలు యేంచెయ్యమన్నాను చెయ్యాలె. మాచేతగాదంటె బర్తర్ఫు చేయిస్త మంటారు, సౌద్దసమానం యిదే యెట్టి చేయిస్తె మేమెట్లు బత్కాలె. తైదంబలీ యింత పోయించరూ, మాపకూ చిట్టి రాయించ మంటేను, కోపించుకా మేక చేదంట లుచ్చాలఫంగంట యేమేమొ తిడ్తారు, యీ నౌకరీ మాకు చాలంటె మమ్మొంగ బెడ్తారు, మాపూర్వ జల్మాన మేమిట్లె హోద్దార్లమై మంది కొంపల్ లుటాయించి యుంటాము, లేకుంటె ఈజల్మ మా కెందు కొస్తాది.. మాలాగ ఎట్టీలు మోస్తే తమాషా తెలుస్తుంది.

కానూను, సత్కేది మమ్మల్ని పీడించెదాన్కేన . అట్లయితె కానూనుమాత్రైతెయేమైన ఉందా మరీలేద చెప్పండి లేకుంటె యీనౌకరీ మీతె చేస్కోండి మాకొద్దు సల్లాము సల్లామయా,"

కీ శే. సురవరము ప్రతాపరెడ్డిగారు ఉర్దూఅరబీపారశీకములందు పండితులు తెలంగాణాభాషపైగల ఉర్దూపారశీకప్రభావమును చక్కగా ఈదండకమునందు చర్చింప జేసినారు. శిష్టేతరులనోట ఆపదజాలము, నుడికారము రూపొందిన విధమును హాస్య అధిక్షేపధోరణిలో ప్రతాపరెడ్డిగారు వ్యక్తీకరించినారు. పటేలును పోట్టేలనిరి. పోట్టేలు దర్పసూచకముగ నున్నది. గుండెచేని అధికారులను దయ మొలకరెత్తని మొద్దుగా మోహిత్మిమ్‌ను మొద్దుమీనుగా చిత్రించినారు మొప్తు మాత్రనని నింటను సరిసముగ నుండెడిది

పకడ్లావ్ అనుక్రియను తెలుగు ఆదేశ సూచక ప్రత్యయము చేర్చి, "పకడ్లావుము" అనుట గమనింప దగినది, సౌదామసాలాలు, చిట్టిరాయించుట, లుటాయించుట, సల్లాము మున్నగునవి చక్కని పదబంధ ములుగా ప్రయోగింపబడినవి.

జానపద గేయములు: శ్రీనాథుని పల్నాటివీరచరిత్రము నందలి ప్రయోగము లింతకుమున్నె పరిశీలింపబడినవి తదితర జానపద గేయములందును ఉరుదూ పారశీకపదములు బహుళముగ ప్రయోగింపబడినవి. శిష్టేతరుల వ్యవహారమునందలి రూపాంతరములు పరిశీలనార్హములు.

కాటమరాజుకథ: చీరి యనుపదము వ్యవహారమున చీటియైనది. చిట్టి అనురూపాంతరము నేడు కన్పించును,

నిలిచిరి వజీర్లు నిర్విచారమున
వారి ఆటోపంబు వారిముస్తీబు,

వజీర్, వజీర్లైనది; ముస్తయీద్ అనుపదము ముస్తీబు అయినది. పరీతా, ఫలీతా, సాదా, తాకీదు జాకీరనము, దిలాస అర్కాతు, తురాయి, హేజీబు, సాద, మొదమదు, (మోతమదు పదమునకు వికృతి) మున్నగునవి ఇట్టివి.

దేశింగురాజుకథ: తఖ్తు, దీవాన్‌జీ, నమ్మక్‌హరాం, ముసద్దీ, నమూదు, తఫ్సీలువారి, బేగారు, ఖర్తీచేయు,

బొబ్బిలి పదములు: వరదీ, షామిల్, దికావు. మొహర్లా, బైటో, తీనిపీట (ముక్కాలిపీట).

వరాహావతార చరిత్ర: తాలింఖానా, జబర్దస్తు, బతాయించుట.

రామదాసు చరిత్ర: హజ్రీతు, సాలాఖరు, సక్తుచేయు.

దాఖలా (గంగావివాహము), శేరిదారు (కొమిరెడ్డిమల్లన్న). మక్కారికులము (ఎరుకలనాంచారి). బరకాస్తుచేయుట(గాంధారికథ)బందు, ఆరాబు, దరోబస్తు, జామీను (బాలనాగమ్మకథ). మైనా (బంగారుతిమ్మరాజుకథ). దూత్తేరి, లుచ్ఛా(కాలజ్ఞానతత్వము) తయినాతీ, రాజీ (కుశలవ యుద్ధము) శమేనా (నలచరిత్రము,)మసలందు వేయుట (పెద్దాపురము కోడిపందెములు), మున్నగునవి ఎన్నియో ఈగేయములందు కన్పట్టును. మస్నద్ అను పదము మసలందుగను,[1] షామ్యాన అనుపదము శమేనగనుమారుట పరిశీలింపదగినవి [1]

శాసనములు: పదునాఱవ శతాబ్దమునుండి శాసనములందు ఉరుదూపారశీక పదములు ప్రయోగింపబడినట్లు ప్రకటిత శాసనముల ననుసరించి తెలియుచున్నది, గోలకొండ సుల్తానుల కాలమునాటి శాసనములందును తదితర రాజశాసనములందును,[2] స్థల, జాతి, నామ, సామాన్య వాచకశబ్దములు, బిరుదావళులు, ప్రభుత్వవ్యావహారిక పదములు, వందలకొలది ప్రయోగింపబడినవి. కొన్నిపదముల రూపములు వికృతినొందినవి. ఇవి లేఖకుల ప్రమాదజన్యములో నాటి వ్యవహారరూపములో నిర్ణయించుట కష్టము.

1. "సాహుసులతాని నిజహితుండైన మసనద ఏలి కుతు
పనమల్కా బడయులుంగారు పంగులు మొదలైన ..దరిబేసులకు"
(1531 A D No.743)
షాహ్‌సుల్తాన్ అనుపదము సాహుసులతానియైనది. మస్నదెఆలి ఖుతుబుల్‌ముల్క్ అనుపదమునకు రూపాంతము మసనద ఏలికుతపనమల్కా.

---

[1] జానపదగేయములందలి ఉరుదూపారశీకపదముల స్వరూపమునుగూర్చియు. అర్థములగూర్చియు, డా. బి. రామరాజుగారు నిశితదృష్టితో జానపదగేయవాఙ్మయ చరిత్రమున పరిశీలించిరి.

[2] South Indian Inscriptions Vol X నుండి కొన్ని శాసనములలోని కొన్ని భాగములు మాత్రమే ఇట స్వీకరింపబడినవి.

2. “ఇభురాంశా అంకనానను. ఖీఁమై పోతేను ఆయన కుమారుండు మహమందు ఖుల్లి పాదశహా” (1583 A D No 752)

ఇభురాంశా = ఇబ్రిహీంషా, మహమంది — మహమ్మదు.

3. “ఖరీదుఖ (ద్యా)లకు బదిమిసేయచేదు.” (1600 A D No. 753)

4. “హజరతు యిభరాహిం పాదశాహ గోడయులుంగారు రిమ నామజాదు అంపితేను యీ చిమిగదిద్ద హరాంఖోలజాను దండించి ... గోలకొండ వెళ్ళివచ్చెనను ఖబురు విని.”

(1590 A.D No. 751)

హరాంఖోలజ = ‘ఖోర్’ పారశీ ప్రత్యయము. అన్యాయార్జిత విత్తము ననుభవించువారు.

5. “అశ్రిద్ధ చేసినవారి చేత చుపడి నిగావానులు వచ్చినా”

(1678 A D No 765)

నిగావాను = ‘నిగహ్‌వాజ’ పదభవము. కాపరి అని శబ్దార్థము

6. “హజరతు సులతాను అబ్బుల హసాను ఆలంపన్నాహ గచి రాజ్యం యేలుచువుండంగ” (1680 A D. No 766)

ఆలంపంన్నాహ = ఆలమ్‌పనహ్ = సరియైనరూపము. జగద్రక్షకుడని భావము.

7. “ఖొదావంద ఖానె ఆజం........ పరీక్షి అన్న వస్త్రాలివు”

(1600 A.D No. 753)

ఖుదావంద్ సరియైనరూపము.

8. ...మహమందు ఖుల్లి పాదుశాహ పృధివి రాజ్యం శాయంగాను మృతిజానగిరిము శీమలో...... జమాలుసాని... ....”

(1524 A.D. No. 754)

ఇందు ముర్తజానగరము మృతిజా నగరమైనది.
జమాలుసాని = సంవత్సరముపేరు.

9. “అబ్దుల్లాంగారి మొకాసా వుండ్డంగాను తనఖా మహతాజు కిల్లె మజుకూరు ...... దరిహజురుకు వచ్చి మాట్మా చేశిరి.”

(1664 A. D. No. 759)

మాలూమ్‌కర్నా అనగా తెలుపుట. కిల్లెమజుకూరు=పేర్కొనబడిన దుర్గము. దర్‌హుజూరు=సన్నిధి.

10. "మాముల వారిపేరను... .. ఫర్మాన్‌సాదిరై . . జమచేసి మహజ్జరుచేశి .. పూర్వపు జాగాలను . అయిదు స్తంభాలు వేయించి"
(1680 A D No 767)

మాముల=కార్యము; జాగా=స్థలము, చోటు. మహజ్జరు=విన్నపము. ఫర్మాన్‌సాదిరుగుట=ఆజ్ఞ వెలువడుట.

సరుకారు (ప్రభువు), తరఫుదారు (పక్షమువాడు), అముదానగరం (అహమ్మద్‌నగర్), కత్తు (లేఖ, వ్రాత), మియ్యా(మియ్యా), వజారితు (మంత్రిత్వము), మున్నగు పదములు ఈ శాసనములందు ప్రయోగింపబడినవి.

కైఫియతులు: చారిత్రిక ప్రాధాన్యముగల స్థానిక చరిత్రలు తెలుగులో పెక్కు కలవు. ఈవిషయములో సుప్రసిద్ధ విద్వాంసులు కర్నల్ మెకంజీగారొనర్చిన కృషి చిరస్మరణీయము. ఇవి అన్నియు వ్యావహారికభాషలో వ్రాయబడినవి. ప్రభుత్వ వ్యవహారభాషకు సంబంధించిన పారిభాషికపదములు కైఫియతులలో వందల కొలది లభించుచున్నవి. ఈ ప్రయోగములు నాటి వ్యవహారములోనున్న పదస్వరూపమును తెలియజేయుచున్నవి. ఒక్కొక్క కైఫియతు లోని కొన్నిభాగములు మాత్రము పరిశీలనార్థ మిట గ్రహింపబడినవి.

పిఠాపురం కైఫియతు:

" పైకము పాలికెలు బాకీ ఉంటే అందుకు వాయిదాపాయిదాలు చేసుకొని ఆవాయిదాలుక్కు రావు తెనుంగు రాయనింగార్ని జామీను యిస్తూ వచ్చి "

"ఆయన గోలకొండకు వెళ్ళి ఖావందు దర్శనం చేశినంతలో... "

"ఆయన గరఫ్తారి ఆరీతిని వున్నది "

జమీదారి నడచేలాగునూ నాలుగు వేల రాఖవకు ముజురా వుండచెప్పి మీకు కాయంబేరీజు మొకర్రరు చేయిస్తున్నా. . . .

వాయిదాపాయిదా: వాయిదా అనగా వాగ్దానము అని శబ్దార్థము. నియమిత కాలము. గడువు అను అర్థమున బహుళముగ బ్రయోగింపబడినది. పాయిదా అను పద

మునకు మూలము ఫాయిదా, అనగా లాభము. ఇట ఈ పదము వాయిదా అను పదమునకు ఊతపదముగ మాత్రమే స్వీకరింపబడినది.

గరఫ్తారి: గిరఫ్తారి అను పదము యొక్క రూపము. పారసీపదమునకు బంధనము, ఖైదు, అనిఅర్థము.

ముజరా=తగ్గింపు. మొకర్రరుచేయుట=ఏర్పాటు చేయుట. కాయం బేరీజు=పారసీకపదము, శాశ్వత దివాణపు సొమ్ము మొత్తము.
(Permanent assesment)

జామీను=జామిన్ అను పదముయొక్క రూపము బాకీలు వాయిదాలు చెల్లించుటకు విశ్వాసపాత్రులైనవారిని అంచిగా జూపుదురు. అసలువ్యక్తి చెల్లించనిచో ఈవ్యక్తి బాధ్యుడుగ నుండును. (Surety)

జమీదారి=జమీందారి అనుపదమునకు రూపాంతరము. ఖావందు=యజమాని

యానాదుల కైఫియతు [1]:

"ఈ నలుబై మందికి ముఖ్తియార్‌గా ఉంచే యానాదికి. ...."

ముఖ్తియార్=పారసీపదము, స్వతంత్రుడని శబ్దార్థము. ఒకరి పక్షమున స్వతంత్రముగ వ్యవహరించువాడని వ్యవహారార్థము.

నడిమి దొడ్డిపాలెగాండ్ల కైఫియతు:

"అళియరామరాయణ్ణి కొట్టివేయ వలెనని విజయ నగిరానకురూచు చేయించి ఫౌజులో వస్తువుండగా యీవర్తమానము అళియరామరాయలు విని మొహరు లీసుకొని రాతోరాతు వచ్చి పెనుగొండకు దాఖలు అయి, అక్కడినుండి ...శిఖా పత్రిలు పంపించి . మీ యావత్‌ఫౌజులతో కూడ యెకాయెకి వచ్చేరని వ్రాయించి వున్నందున మీరు స్వామికార్యములో బహుశా మెహన్నతు చేసి కష్టపడి సకల బహుమానాలు బిరుదులు సంపాదించుకొన్నారు. ....... మీ తహకీకు వర్తమానం వచ్చేటందుకు చోరుహరుకార్లను పంపించుమనగా అప్పుడు...పెద్దనాయడు ముందుపడి తహకీకుఖబరు నేను తెప్పిస్తున్నానని ...తాంబూలం తీసికొని...."

[1] గద్యచింతామణి పుటలు 140—145

కూచ్‌దర్‌కూచు = దాడిపైదాడి. రాతోరాత్ = రాత్రికిరాత్రే అని శబ్దార్థము, తక్షణము, అప్పటికప్పుడే, ఏమాత్రము విలంబములేక అనిభావము. మెహన్నతుచేసి = కష్టపడి, తహకీకుఖబరు = తహకీఖు అనగా శోధనము. ఖబరు అనగా వర్తమానము. శోధించి తెలిసికొనిన వర్తమాన మని అర్థము.

చోరుహరకార్లు: హరుకార్లు అనగా సేవకులు. చోరుఅనగా దొంగ. దొంగబంటు, వేగులవారు అనిభావము.

పూసపాటివారి కైఫీదు:[1] కైఫియతు అను పదము ఇందు కైఫీదు అను రూపములో గన్పట్టు చున్నది.

షయిరు = షహర్‌యొక్క రూపాంతరము. నగరమని అర్థము. ఇషారా చేయుట = సైగచేయుట.

సిపాయీ = సిపాహిఅను పదమునకు తెలుగు రూపము.

'ఫారా సిపాయీల్కు యిషారా చేసి'' పుట 7

మొహిం = యుద్ధము, ముట్టడిఅని అర్థము. యుద్ధము నిమిత్తమై సైన్యమును దింపు అనుఅర్థము నందు ప్రయుక్తము.

"వీరు పోయి మోహిందిగ లడాయి చేశే వర్కు'" పుట 17

ఖర్చుఖరామతు = ఖరామతు, ఊతపదము.

ఫంజుదారు, ఫౌంజు = బిందుయుక్తముగ నున్న ప్రయోగములు పరిశీలింప దగినవి.

"హాలుసాలు'' = సాలెహాల్ సరియైన రూపము. వర్తమాన సంవత్సర మని అర్థము.

"హాలుసాలు జమాబందిన్ని యిచ్చి" పు. 10, 20

జమాబంది—బందోబస్తు చేయుట పు. 10

---

భూమికి శిస్తు ఏర్పరచుటను జమాబంది అందురు. అట్టి శిస్తును కూడ జమాబంది అందురు బందోబస్తు చేయుట = ఏర్పాటుచేయుట. కట్టుదిట్టమైన ఏర్పాట్లను బందోబస్తు అందురు

---

[1] వి. ఆర్. జగపతివర్మ సంపాదకత్వమున ఆంధ్ర సారస్వత నికేతనము రాజమండ్రి (1915) ప్రచురణము.

శిబ్బందీ ఖర్చులు: సైన్యములోని బృందమును శిబ్బంది యందురు. ఇది సప్ బంది అనుపదను నుండి ఏర్పడినట్లు తోచుచున్నది. కార్యాలయ ఉద్యోగిబృందమును నేడు శిబ్బంది (Staff) అనుట కలదు.

పర్వా: గౌరవము లేక లక్ష్యము అని అర్థము. ఇది నుడికారరూపమున కైఫియతులందును, వ్యవహారమునందును గన్పట్టుచున్నది.

"మాబోటి నవుకర్లు ఎవరుపద్దా ఫర్వాలేదు."

నిత్యవ్యవహారమున " నేను వానిని పర్వాచేయను" అను ప్రయోగము కలదు. లక్ష్యపెట్టను. అనిభావము.

తలబు చేయించుట: నిఘంటువుల కెక్కని పదమిది. పిలిపించుటఅని అర్థము.

"ఇభరాంబేగును తమ హుజూర్కి రమ్మని తలబుచేయించి" పు. 33

హుజూర్కి = సన్నిధికి. కొలువుకూటమునకు అనిఅర్థము. పరిమాయించి = ఆజ్ఞయిచ్చి.

జేరుదస్తు: దస్త్ అనగా పారశీలో హస్తము జేరు అనగా క్రింద. వశము. హస్తగతము. వశమగుట అనిభావము.

"బస్తరుదేశం మీ యొక్క జేరుదస్తులో రాటంటావున్నది." పు. 35

యతుభారు: ఏతబారు అను పదమునుండి ఏర్పడిన రూపము. విశ్వాస మని అర్థము.

"ఇతని ఖామందు అయ్ని దంతులూరి వేంకటకృష్ణరామరాజుగార్కి వున్న హోదాలో యితణ్ణి వుంచి సకలయతుభారులతో గడిపినారు." పు. 35

సాలీనా: సంవత్సరములెక్క ప్రకారము. సాల్ అనగా సంవత్సరము.

నగదు రూపాయలు: రొక్కరూపమున అనుభావమునందును, నుడికార రూపము నందును నిది ప్రయుక్తము. నగదు (Cash). "నీపని వాడేమైన చేయునా?" "ఆఁనగదు". అనగా చేయ డనియే భావము.

తగైదు: ఉద్యోగమూడుట (Dissmissal) అని అర్థము. తగైరు సరియైన రూపము.

"ఈదొరగారికి వుద్యోగం తగ్గైదు అయిపోయింది." పు. 45

బరదస్తు: విచారణ అనిఅర్థము. నేరారోపణ మను భావముకూడ సూచ్యము.

"మాన మర్యాదలు తీసివేసినాడని యీతీరున బోధించి వెంకట్రాయనింగారి మీద బరదస్తులు వ్రాయించినాడు." పు. 49

దస్తు అగుట: చేతికి వచ్చుట, వసూలగుట, అనిభావము.

రూపాయలదాక దస్తు అవుతూ వచ్చింది " పు. 51

తనఖా చేయుట: ఏర్పాటు చేయుట అనుభావమునందును, కట్టడి చేయుట అనుభావమునందును బ్రయుక్తము,

" ఆరులక్షల రూపాయలు బాకీవుండగా రాజుగారి ముస్తాజిర్లు కుంఫిణీ వారికి ఇయ్యమని తనఖా చేసినారు " పు. 53

ముస్తాజిర్లు: ప్రతినిధులు. అధికార్లు, గుత్తదారులు అని అర్థము. పాజి = మూర్ఖుడు- అజ్ఞుడు.

"ఈపాజీ మన సమస్తానంలో వుగ్గుపాలుతాగి"

షికస్తుహదా: ఓడినవారు.

ఈతీరున షికస్తు హదాలుగా వున్నారు. పు. 57

దవుడుచేయుట (పు. 63) దాఖలా (పు. 57) దగాచేయుట (వు. 43) తయారీ అగు (పు. 43) తాఖీదుచేయుట (పు 33) ఖడాయించు (పు. 21) నవ్వాబుగిరి-లడాయి మున్నగు పదము లెన్నియో ఇందు ప్రయోగింపబడినవి.

మొగిలితూరివారి కైఫియతు:[1]

హల్లాచేయుట = దండెత్తుట, గందరగోళమొనర్చుట.
"దర్వాజాపై హల్లా చేయమని" పు. 6

---

[1] ఆంధ్ర సారస్వత నికేతనము రాజమండ్రి. 1915 ప్రచురణము.

కళింగ గ్రామకై పియతు:

పారాజమీదారు = జమేదారు పదమునకు వికృతి. జమేదారు = సిపాయిలలో పెద్దఅని అర్థము. బంట్రోతులలో పెద్దవానినికూడ జమేదారని నేడు వ్యవహరించుచున్నారు. మొదట సైన్యములోని సామాన్యఅధికారి అనుఅర్థమునందు ప్రయోగింపబడుచుండెను.

"ఆమాటలకు పారాజమీదారుడు కావుడు తెలియక నాల్గుఘడియలకు నిద్రలేస్తాడు."

అర్జీలు—తీర్పులు: ఈస్టిండియా పరిపాలనా కాలమునాటి వ్యవహార పత్రములను బరిశీలించినచో నాటి తెలుగుభాషపై ఉరుదూపారసీకముల ప్రభావము మిక్కుటముగా నుండినట్లు స్పష్టమగుచున్నది. పందొమ్మిదవ శతాబ్దినాటి అర్జీలు, తీర్పులు, మున్నగు వానినుండి కొన్నికొన్ని భాగముల మాత్రమే ఉదాహరింతును.

అర్జీ— మకాం దాచేపల్లి.

" .. జిల్లామేజిస్ట్రేటువారి సముఖానకు తమ సన్నిధిని వ్రాసికొన్న అర్జీవిన్నపము .... రాణా మజుహూరు ఇలాకాలో కుదిపెదమ కులాలు అనేవాడు లేదు"[1]

మజ్కూరు ఇలాకా: పేర్కొనబడిన ప్రాంతము అని అర్థము.

(1) ముద్దాయి యీ ప్రకారం జరిగించినందుకు అతనికి రు॥ 3న్ను 2 ముద్దాయి హోదాదారు అయిఉండిన్ని విచారించక పోయినందుకు అతనికి 1 రు॥ జుమ్లా నాలుగురూపాయలు జులుమానా విధించి, యివ్వని పక్షమునకు 5 రోజులు కొత్వాలుచౌతరాలో విడిఖయిదు వుండేలాగునన్ను సదర్ హి జులుమానా రూపాయీలలో ఫిర్యాదికి దేహనష్టంక్రింద రు 1 యిప్పించి తతిమ్మా రు॥ 3 లు గవునరుమెంటువారికి దాఖలు చేయగలందులకు తీర్పు వ్రాయడమైంది.

సదర్ హి జులుమానా = పైచెప్పబడిన జులమాన అనిఅర్థము- జుర్మాన అను పదము జులమాన యైనది.

విడిఖయిదు = Simple imprisonment అని అర్థము: జుమలా = మొత్తము.

తతిమ్మా = మిగిలిన.

---

[1] గద్య చింతామణి పు. 149

(2) . ఫిర్యాది కట్టమూరి నరిసింహులు సాకిన్ యనమదల దాఖలు చేసుకున్న అర్జీ ఏమంటే.

ఉరుదూవాక్య విన్యాసమును పుణికిపుచ్చుకొనిన ప్రయోగమిది.

" వాక లేని ఖోని దావా బనాయించి.. "[1]

బనాయించుట=కల్పించుట—

(3) " . వరకు బకాయపడి .... వకపట్టి యిందులో మలుపూపు చేసుకున్నాను. అందువలన పంటలు కమ్మిఅయినవివిన్ని చెప్పడం సిజమే.[2]

ఒక కాగితముతో మరికొన్ని కాగితములను జత చేసి Coverలో పెట్టిన "మల్ఫూపు" చేసిన కాగితము అని అందురు. కమ్మిఅగుట అనగా తక్కువగుట. కమ్హోనా అను పదమున కిది అనువాదరూపము. నేటికిని కరీంనగరము మున్నగు మండలములందు "కమ్మిఅగుట" అనునది వ్యవహారమునందు బహుళముగ వినవచ్చును. వ్యవహారిపత్రములందు అర్జీదారు వ్రాసిన పత్రము ఉర్దూ లేఖా సంప్రదాయము ననుసరించుట ఇట గమనింపదగిన అంశము.

లేఖలు: పందొమ్మిదవ శతాబ్దమునందు తెలుగు లేఖాసాహిత్యము తొలి దశలో నుండెను. ఈలేఖలను వ్రాసినవారు తెలుగువారు. వ్రాసినది తెలుగువారికి. లేక తెలుగు తెలిసిన అధికారులకు, మిత్రులకు; భావవ్యక్తీకరణమునకై పారశీ ఉర్దూ పదములు పదబంధములు బహుళముగ బ్రయోగింపబడినవి. భావమును సువ్యక్త మొనర్చుటకు, కొన్ని కొన్ని ప్రయోగములు తోడ్పడినవనుటకు సందేహములేదు. బ్రౌనుదొరగారు అనేక లేఖలను సేకరించి 1821లో తెలుగుజాబుల పుస్తకము అనుపేర బ్రకటించి యుండిరి. శ్రీమాన్ పరవస్తు రామానుజాచార్యులుగారికిని, బొబ్రునుపండితునకును వ్రాయబడిన లేఖలనుండి ఒకటి రెండు భాగములను పరిశీలించినచో తెలుగు లేఖాసాహిత్యముపై ఉర్దూ పారశీకముల ప్రభావమును నిరూపింపవచ్చును.

" విజయనగరం నుంచి ప్రశస్తమయ్ని వకపీణె ఖరీద్కు మాబసవద్ద వచ్చియున్నది. . గన్క యీ పురోణీ జరూరుగా వ్రాయించడమయినది.

---

[1] గద్యచింతామణి పు. 154

[2] గద్యచింతామణి పు. 283

"..చిరంజీవులగు మా రామలింగశాస్త్రిలకు మునసబు పని ఖాయంగా దయచేస్తారనే నమ్మకంచేత పోలీసు పనికి కూడా రిసైను దాఖలు చేయించినాను.[1]

కావ్యములందుగాని తదితర చరిత్రములందుగాని కన్పించని కొన్ని విశిష్ట ప్రయోగములు లేఖాసాహిత్యమున కలవని నిరూపించుటకు ఈ ఉదహరణమొక్కటి చాలును. "పరవానా" అను పారశీపదము పురోణియైనది. ఉత్తరము అనిఅర్థము.

ఖరీద్దు: కొనుటకు - అమ్మకమునకు అని భావము. జరూరు = అవశ్యముగా.

ఖాయం: Permanent–Confirm అను భావమును తెలుపును. స్థిరముగా నుండునట్లు అనిసందర్భార్థము.

"మారిఫత్తున" = ద్వారా అని భావము,

"నల్లాసుబ్బన్న మారీఫత్తున దయచేశిన ఆజ్ఞాపత్రిక"

చట్టములు:[2]

బ్రిటిషుప్రభుత్వమువారు ప్రకటించిన చట్టముల ననువదించు సందర్భము లందును పారశీక ఉర్దూపదప్రయోగముల నూతగ గొనవలసి వచ్చినది.

(1) ...106వ చార్టరువల్ల శ్రీహర్మేజిస్టీ రాణిగారి అధికారంలో ఉంచబడి ఉంటే, లేక ఉంచబడే దరోబస్తు దెశములలో అంతటా అమలు లోనికి రావలసినది.

(2) సదర్ హి దేశములకు

(3) శ్రీరాణిగారి తాలూకు ప్రతివుద్యోగస్థుడు.

(4) నిబంధనలనే తరిహాగానైనా

(5) ఆసర్టిఫికెటు తాజాగా పుచ్చుకొనుటకు తప్పిపోయినా.

దరోబస్తు = పూర్తిగ, యావత్తు అని అర్థము పారశీపదము.

తాలూకు = తాల్లుఖ్ అను పారశీపదమునకు వికృతి. తాజాగా = క్రొత్తగా;

---

1 గద్యచింతామణి పు. 279

2 గద్యచింతామణి

## కొన్ని వచన గ్రంధములు:

దిలారాంకధ:-

(1) అంతలో పాదుశాకు మహాచింతపుట్టి యోచనచేశి యీరాజ్యాన యింద్రుడివంటి పాచ్చావు కూతురికి...."

(2) "వాండ్లకు విడిదియిల్లు ఖాళీ చేయించి యివ్వగానే,"

(3) గుర్రాలకు జీని వేశి తమ సామాను తీసుకొని సాగిపోయిరి."

కీరబహత్తరి కధలు:-

(1) "అయిదుమంది బంట్లున్ను బురకా వేశిన పల్లకిలోను వచ్చి"

(2) అందుకు పరంగివారు మామీద తాఖీదు చేశి,"

తోతాకధలు:-

(1) అందురు సముజాయించి యింటికి బాదుషాను వెంటబెట్టుకొనివచ్చినారు.

(2) "యీ పాదుషాజాదా"

తాతాచార్ల కధలు:-

"మా యిరువుర్లకు పారీఖత్తులు ఖరారు నామాలు పుట్టించి, యిఖమీదట... ....... .... మాకు రావలసిన బాకీరొఖ్ఖముగాని, వాయిదాలుగాని, ....... .... అయివేజు యేర్పరచి .... ... ... .

కాశీయాత్రిచరిత్ర

(1) ముసాఫరులు పరువు కావలెనంటె"

(2) హాయిదారాబాదుషహారుకు చుట్టు...... . బేగంబజారు అనే బస్తీయున్నది.

(3) దీవాన్‌పేష్కారు చందులాలు.... అక్కడ యిండ్లుకట్టుకొని కాపురమున్నాడు- నిజాందేవిడి షహారు నడుమనున్నది.

జగన్నాధ మహాత్మ్యము, సర్వమతసార సంగ్రహము, మహమ్మదు చరిత్రము మున్నగు వచన గ్రంధములందును పెక్కు అన్యదేశ్యములు కలవు.

ఆధునిక వాఙ్మయము :—

అధునికవాఙ్మయమునందు వివిధప్రక్రియా గ్రంథములలో ఉర్దూ పారసీక పదప్రయోగము లధికముగ గన్పట్టును. చిలకమర్తి స్వీయ చరిత్రము, పానుగంటివారి గ్రంథములు, వివిధరచయితల నాటకములు, నవలలు, కథానికలు మున్నగు గ్రంథముల లోని ప్రయోగములను పత్రికలలో నిత్యవ్యవహారసిద్ధములైన ప్రయోగములను లెక్కించుటయే కష్టము. శైలీవిశిష్టతకు, భావరామణీయకమునకు దోహదమొసగిన కొన్ని ప్రయోగములను ఆధునిక కావ్యములనుండి ఉదాహరింతును.

గురజాడ అప్పారావు :—

ప్రాచీనకవులవలె ఆధునికులును ఉర్దూ పారసీక పదములను సందర్భోచిత ముగ భావపుష్టికై ప్రయోగించిరి.

పౌఁజు పౌఁజులు :- పౌజు అనుపదము సైన్యమను అర్థమును వీడి బృందము అను అర్థమునందు ప్రాచీనకావ్యములందు ప్రయుక్తమయ్యెను. ఈ పదమును గురజాడ అప్పారావుగారు సరసమైన స్వభావోక్తివర్ణనమునకు వినియోగించుకొనిరి.

"పారె పక్షులు పౌఁజుపౌఁజుల."

లవణరాజుకల. [1] 17.

సీదాఖర్చు :- మామూలు ఖర్చునకు అనుభావమున అప్పారావుగారు ప్రయోగించిరి.

"ఈపూటకు సీదాఖర్చు
బేడయు నిప్పించెద మిపుడే.

— పండితరాజ సంవాదము.

సలహా :—

చాలుచాలు మీరు కవి
పండితుల కిచ్చుసలహా చక్కఁగనున్నది.

---

1 గురజాడ గేయములు సం. 2 వావిళ్ళ — 1950.

శ్రీ శ్రీ :—

సవాల్ చేయుట = Challenge అను అర్థమునందిట ప్రయుక్తము —
ఇంద్రదేవుని మదపుటేనుగు ఘీంకరిస్తూ సవాల్ చేసింది,
— అభ్యుదయం. [1]

ఖరీదుకట్టుట - విలువకట్టుట అను అర్థమునందు నేడు ప్రయోగింపబడుచున్నది.

కార్మికధీరుల కన్నులనిండా
కణకణమండే, గలగలతొణకే
విలాపాగ్నులకు విషాదాశ్రులకు
ఖరీదుకట్టే షరాబు లేడోయ్ — "ప్రతిజ్ఞ"

షరాబు = సరాఫు

కదంతొక్కుట ఖదమ్ అను పదము దీనికి మూలము. అడుగు, నడక, చక్కని నడకతో సాగుట అని అర్థము.

విషంగ్రక్కే భుజంగాలో
కదంత్రొక్కే తురంగాలో...... నీపాటల్
—— "స్వీన్బర్న్ కవికి"

కలంపట్టుట = రచన చేయుట,
"మీకోసం కలంపట్టి" —జగన్నాధుని రథచక్రాలు.

దగాపడుట: మోసపోవుట.

దగాపడిన తమ్ములార
మీబాధలు నేనెఱుగుదు —జగన్నాధ రధచక్రాలు

సజావుగా సాగుట: దర్జాగా, వైభవముగా అనిభావము.

సారాదుకాణాల వ్యవహారం
సజావుగానే సాగింది.

---

1 మహాప్రస్థానము. విశాలాంధ్ర ప్రచురణాలయము 1954.

బురఖా: ముసుగు అనిశబ్దార్థము.
మాబురద రోజుహాజరు
మా బురఖా మేం తగిలించుకొన్నాం.
—కొంపెల్లి జనార్దనరావు కోసం.

తారీఖులు దస్తావేజులు
ఇవికావోయ్ చరిత్ర కర్థం
ఈరాణీ ప్రేమపురాణం
మతలబులూ కైఫియతులూ
ఇవికావోయ్ చరిత్రసారం— —దేశచరిత్రలు

భావమును తీవ్రముగను, నిశితముగను ఆవేశపూరితముగను వ్యక్తీకరించుటకు ఈపదములును ఖూనీకోరు, రౌడీ, మున్నగు ప్రయోగములును శ్రీ శ్రీ కి చక్కగా తోడ్పడినవి.

శివభారతము: అధునికయుగములో వెలువడిన చారిత్రిక ప్రబంధములలో గడియారం వేంకటశేషశాస్త్రిగారి శివభారతము ప్రశస్తమైనది. రసవంతమైనశైలికి, కన్నులకుగట్టునట్టి వర్ణనలకు, సంభాషణాచమత్కృతికి అన్యదేశ్యములు పదబంధములు వన్నెగూర్చినవి.

జహాపనా: ఇది రాజుల నుద్దేశించునపుడు ప్రయోగింపబడు దర్బారు సంప్రదాయపు పారిభాషికపదము గౌరవవాచకము.

ననుమన్నించుజహాపనా! III-279

రాజీమాటలు: సాంత్వన వచనములు, సంధివచనములని అర్థము,

"రాజీమాటల వానియుద్యమము సారంబెల్ల గుర్తించి" III-286

జులుముంజేతలు: దుండగపు చేష్టలు.

జులుముంజేతలు ముస్తఫా గదిపెనంచున్. III-293

కైఫియతులందును తదితరకావ్యములందును ఒకేఅర్థముకల జంటపదములు ప్రయుక్తములయ్యెను. శాస్త్రిగారి కావ్యమునందును నట్టిప్రయోగములు కొన్నికలవు.

"ఈ గోషాతెరగుద్దులాటలివి." I-159

ముసుగులో గుద్దులాట లని అర్థము,

పూర్వకవులుకొందఱు పద్యమునందలి గణముల కనుకూలముగ గొన్ని సందర్భములందును, మఱికొన్నితావుల శైలికొఱకును నామ, జాతి దేశవాచక శబ్దములను మార్చియుండిరి. శివభారతమునందును నట్టిరూపములు కొన్నికనబ్బట్టుచున్నవి. మాన్సబుదారు (I-25) మాలికంబరు (I-26) మోగల్‌సైన్యములున్ (I-159) బర్గానునిజామషహా (I-211) బీదారు ( II-5 ) తుగ్లక్కులుల్ ( II-40 ) జాగిరు ( II-206 ) అపజలుఖానుఱి ( V-21 ) మున్నగు ప్రయోగము లిందుల కుదాహరణములు.

ఆరుద్ర:

సినీవాలి: (1960) ఆధునిక కవితా రీతులలో మణిప్రవాళశైలి నూత్న మార్గముల నంతరించుకొనినది. సంస్కృతాంగ్ల ఉరుదూపారశీక పదములను సందర్భానుసారముగ బ్రయోగించిన ఆధునికులెందఱోకలరు నిత్యవ్యవహారసిద్ధములైన ప్రయోగములను వీరు సరసముగ ప్రయోగించుట గమనార్హము.

అచ్ఛా: నిత్యవ్యవహారము నందిదియొక ఊతపదముగ బహుళముగ బ్రయుక్తము. సరేలే, మంచిది, అలాగా మున్నగు అర్థములందు కాకుస్వరమునుబట్టి వ్యవహృతమైన శబ్దమిది.

అచ్ఛా! స్వేచ్ఛాజీవీ
చర్చకే చోటిచ్చావు— "సినీవాలి" పుట 2

రంగేళి: రసికుడను రూఢ్యర్థమున నుడికారరూపముదాల్చిన పదమిది. విలాసస్వభావము కలవారు, రసికులని అర్థము. వేషాడంబరము మాత్రముకల అనుభావమున ప్రయుక్తము.

ఆధునిక రంగేళీయువతిలాగ నగరానికి
మెదడు తక్కువ, షోకులెక్కువ.

* * *

జేబులుఖాళీబరాబరు
కారణమేమిటి? నెలాఖరు?

పల్టీలుకొట్టు, నకిలీ, కల్తీ, నాజూకు, రోజువారి, ఆసరా, ఖాయం, మేజా, దగాపడుట మున్నగు ప్రయోగములతో ఆరుద్రకవిత పరిపుష్టమైనది.

ఉరుదూభాషలోని కవిసమయములు నుడికారములు మున్నగునవి భావానుకరణరూపముతో తెలుగుగేయములలో మిక్కుటముగ గన్పట్టును. 'సినీవాలా' యందును అట్టివి గలవు. గాయపడిన మనసు, రూపాయమేపుట (లంచమిచ్చుట) మున్నగునవి ఇట్టివి.

## జా షు వా:

తెలుగు నుడికారపు తీయందనము జాషువాగారి కవిత్వమునకు క్రొత్తశోభ నిచ్చినది. ఉరుదూపారశీకపు జాతీయములుకూడ వారిలేఖినికి నూత్నశక్తి నొసగినవి.

మక్కామసీదుతోడు: రంగరాయ చరిత్రమునందలి అల్లాచరణంబులాన అను ప్రయోగమును స్మరింపజేయునట్టిది.

ఒక్కొక పద్దియంబున
కాక్కొక బంగారురూక యొసగెదను కవీ
మక్కామసీదుతోడని
వక్కాణించెన్. "ఫిరదౌసి" 15

1. "అల్లాతోడని పల్కి"— 51
2. "పక్కాకీర్తులవెల్లవేసిన-"
3. హుక్కాఖర్చుకు సాటిరాదుగద-

మున్నగు పద్యభాగములలోని నుడికారములు శైలికిని భావమునకును బుష్టి చేకూర్చునట్టివి.

## నా ర్ల వా రి మా ట:

పత్రికాప్రపంచమున లబ్ధప్రతిష్ఠులు నార్ల వేంకటేశ్వరరావుగారు. నిత్యవ్యవహారభాషతో ప్రజావ్యవహారమున పాదులుకొందిన నుడికారములతో వీరికి సన్నిహిత సంబంధమేర్పడినది. నార్లవారు వీనిని "నార్లావారిమాట" యందు చొప్పించిరి.

అలగాజనము: హల్కా అనగా చులకన అలకాజనమనగా సామాన్యజనము.

అధికసంఖ్య ప్రజల నలగాజనమటంచు
త్రోసివేయగల్గు రోజుపోయె. 26

కోటలోపాగావేయుట= కోటలో ప్రవేశించి అధికారము చేజిక్కించుకొనుట, తిష్ఠవేయుట అనిభావము.

వోటుబలములేక కోటలోపాగాను
వేయజాలడెట్టి వీరుడైన, 28

దమ్ములున్నవారు: దమ్ అను పదము నిత్యైకవచనము. కాని తెలుగు నుడికారమునందిది బహువచనమునొందినది. గుండెలున్నవాడని భావము.

దమ్ములున్నవాడె ధరను గెలచు— 24

దాశరధీశతకము: "నాతెలంగాణకోటిరత్నాలవీణ" అని ఎలుగెత్తిచాటిన దాశరధి వాక్కునందును, భావములందును తీవ్రత కన్పట్టును. అన్యదేశ్యముల ప్రయోగములందును నట్టి భావతీవ్రతను వ్యక్తీకరించెను. నయాపైసా సహనమ్ములేదు=ఇసుమంతైనను సహనములేదను భావము స్ఫురింపజేయును. ప్రజావాణిలో చెలామణియగు నుడికారపు నాణెమిది.

హ్రాజు: పశువులను వీధులలో హరాజు చేయునట్లు ప్రజలను ప్రభువులు నడివీధిలో నిలువబెట్టి వారిశక్తిని పీల్చుచున్నారనియు విమర్శించు సందర్భమునందు దాశరధి ఈపదమును ప్రయోగించెను.

రాజననీవుగాని ప్రజలకా పసులట్టు వీధిలో హ
జారనరించి వారి రుధిరంబులు త్రావి సుఖించునట్టి యీ
ాలు రాజులే..."

# పదజాలము - వర్గీకరణము

నన్నయ, తిక్కన, శ్రీనాధుడు మున్నగు కవులప్రయోగములను వివిధకావ్య ప్రక్రియలందుగల ప్రయోగములను పరిశీలించుట జరిగినది. తెలుగులో చేరిన వేల కొలది ఉరుదూపారశీకపదములను, వర్గీకరించి వర్ణములు, పదములు, పదబంధములు, క్రియలు, ప్రత్యయములు మున్నగువానిగూర్చి శాస్త్రీయదృష్టితో పరిశీలింప వలసియున్నది.

ఒకజాతి వేరొకజాతిపై రాజకీయముగను, సాంస్కృతికముగను ప్రభావమును కలిగించునట్లే ఒకభాషపై మఱియొకభాషతనముద్ర వేయుచుండును. కాలక్రమమున ఈ ప్రభావ మన్యోన్యముగ కలుగుచుండును. పరస్పర ప్రభావ స్వరూపమును భాషాశాస్త్ర జ్ఞులు భిన్నభిన్నదృక్పధములతో పరిశీలించియున్నారు. ప్రపంచభాషల చరిత్రను నిశిత దృష్టితో పరిశీలించినచో ఇట్టి విశిష్టధర్మమును గమనింపవచ్చును. ఆంగ్లభాషలో ఫ్రెంచి, లాటిన్, గ్రీకు మున్నగు పదము లెన్నియో చేరినవి. భారతీయ భాషలలో సంస్కృత ప్రాకృతపదములు వేలకొలది చేరినవి. తెలుగులో చేరిన ఉరుదూపారశీకపదములు పూర్వప్రకరణమున స్థాలీపులాకన్యాయమున కొన్ని ఉదాహరింపబడినవి, రాజకీయ, సాంస్కృతిక ప్రభావ ప్రాబల్యము ననుసరించియు, ఆయాభాషలసాహిత్యములస్థాయి ననుసరించియు తెలుగుపై ఉరుదూపారశీకముల ప్రభావమును శాస్త్రదృష్టితో నిట్లు వివరింపవచ్చును.

ఒకభాష వేరొకభాషనుండి పదముల గ్రహించుకార్యమును భాషాశాస్త్రజ్ఞులు ఎరవు (Borrowing) అని వ్యవహరించిరి. అనుకరింపబడుభాష మాదిరి (Model) అనుకరించుభాష (Borrowing language) అనబడును. పదముల నెరవు తెచ్చుకొను నప్పుడు అనుకరణోద్దేశము అనుకరణశక్తి అనురెండులక్షణము లత్యంతావశ్యకములు. అనుకరించువారు అనుకరింపబడు భాషనుకాని అందలి పదజాలమునుకాని అర్థముచేసి కొనుశక్తియు, అనుకరించుటకుద్దేశమును కలిగియుండవలయును. అనుకరణశక్తి ఆయా భాషలతో పరిచయమేర్పడిన అనంతరమే కలుగును. అనుకరణోద్దేశము రెండు కారణములను పురస్కరించుకొని యుండును. వీనిని భాషాశాస్త్రజ్ఞులు Need filling, Prestige అని పేర్కొనిరి.

తొలిదశలో అరబీ పారశీక పదములు సాంస్కృతిక కారణమున తెలుగులో ప్రవేశించినవి. తెలుగుదేశమునకు ఇతర ప్రాంతములతో వర్తక వ్యాపారములను గూర్చి ఏర్పడిన సంబంధమట్టిది. కాకతీయుల కాలమునుండియు, శ్రీనాథుని కాలము నుండియు తెలుగులో ఇట్టి అన్యదేశ్యములు ప్రవేశించుటకు రాజకీయ ప్రభావమే కారణము. అన్నయమంత్రి అరబీభాష తురుష్కభాషల నభ్యసించుటకును, పారశీలో లేఖలు వ్రాయించుటకును రాజకీయావసరమే ముఖ్యకారణము. అన్యదేశ్యములతో పరిచయమేర్పడినపుడు ఆ పదములను ప్రయోగించు మోజుకూడ ఉండును. శ్రీనాథాదులు పారశీభాష నభ్యసించిరని భావించుట కాధారములులేవు. వినికిడివలనను, నిత్య వ్యవహారమునందలి పరిచితివలనను అతనికి పారశీకాది భాషలతో ప్రగాఢ పరిచయ మేర్పడినది. బహుముఖప్రజ్ఞ కలవారికి. పెక్కుభాషలందు పాండిత్యము కలవారికి ఇది సుసాధ్యమే.

తెలుగులో ప్రవేశించిన పదజాలమును ప్రభుత్వ పారిభాషిక పదములు, వర్తక వ్యాపారములు యుద్ధపరికరములు, నిత్యవ్యవహారమున అవసరమగు సామాన్య వాచకపదములు. వస్త్ర అలంకరణాదులు, మత ఆచార వ్యవహారములు మున్నగు వానికి సంబంధించినవిగా, అన్యదేశ్యములను వర్గీకరింపవచ్చును. స్థాలీపులాకన్యాయముగ నొకటి రెండు వర్గముల నుదాహరింతును.

రాచరికము, ప్రభుత్వ వ్యవహారపదములు :— హజారా, పర్మానా, దస్తావేజు, గస్తీ, కొత్వాలు, వజీరు, దర్బారు, నజరు, రసీదు, ఖజానా, ఇనాం, హర్కారా, పడేలు, పట్వారి, అర్జీ మున్నగునవి.

నిత్యవ్యవహార పదజాలము :— కురిచి, పలంగు, గలీబు, జేబు, అంగీ, తబలా. రోజు, పజీత,బాకీ మొదలగునవి

వంటకములు, ఆహార పదార్థములు :— పులావు, హల్వా, మాజుం, కిచిడి, మసాలా, గసాలు మొదలగునవి.

వస్త్రాలంకార భూషణాదులు :— అంగీ, మొకమలు, రుమాలు, బురఖ, పరదా, రజాయి, పాగ, బాజుబందు, పాపోసు, దస్తీ మొదలగునవి.

యుద్ధము, యుద్ధోపకరణములు :— బురుజు, కిల్లా. ఫౌజు, నేజా, కందకము, జెండా, దర్వాజా తల్వారు మొదలగునవి.

మతము, ఆచారవ్యవహారములు :— మసీదు, నమాజు, దరిబేసు, రమ్జాన్, కాజి, పకీరు, రోజా మొదలగునవి.

## పదబంధములు - సమాసములు

ఉర్దూ పారశీకములతో తెలుగువారికి ప్రగాఢ పరిచయ మేర్పడినందున ఆ భాషలందలి పదబంధములు సమాసములు తద్ధితములు క్రియలు మున్నగునవి ఎన్నియో తెలుగులో చేరినవి. ఉర్దూ పారశీక ప్రత్యయములను ఉపసర్గలను స్వీకరించి తెలుగువారు క్రొత్త పదములను నుడికారములను రూపొందించుకొనిరి. ఇవి మన భాషకు ఎంతయు పుష్టిని చేకూర్చినవి. ఉపసర్గలు, ప్రత్యయములు మున్నగువానితో నేర్పడిన రూపములను మూడువర్గములుగ విభజింపవచ్చును.

1. పారశీ పదములు పారశీ ప్రత్యయములతో యథాతథముగ జేరినవి.
2. పారశీ ప్రత్యయములతో రూపొందిన ఉర్దూ పదములు.
3. ఉర్దూ పారశీక ప్రత్యయములతో రూపొందిన తెలుగు పదములు.

ఖోర్ : బందాఖోరు, లడాయిఖోరు, పుండాఖోరు, లత్‌ఖోరు, అబద్ధాలఖోరు, చాడీఖోరు, పేచీఖోరు,

గార్ : మదద్‌గారు.

వార్ : ఉమ్మీద్‌వారు.

నామా, నామ : కిరాయనామ, ఇకరారునామ, పంచనామ,

బాజ్ : దగల్‌బాజు, దస్తుబాజు, ధోకాబాజు.

దార్ : పట్టాదారు, కిరాయదారు, మునసబుదారు. మజుందారు, హక్కుదారు, సుబేదారు, అమలుదారు, అర్జీదారు, హవల్దారు, పెత్తనదారు, స్వంతదారు,

ఖాన : టప్పాఖాన, గాడీఖాన, దీవాన్‌ఖాన, దవాఖాన.

దాన : పాన్‌దాను, కలందాను.

వాలా : ఫాలావాలా, రిక్షావాలా.

బే, లా, నా : బేపర్వా, బేదఖలు, బేరోజుగారు, నాలాయకు, లావారిసు, లాపతా.

ఉర్దూ పారశీ ప్రత్యయములతో మిశ్రపదబంధము లెన్నియో ఏర్పడినవి. ఇట్టి సంప్రదాయము అన్నిభాషలందును కన్పించును. లాటిన్ ప్రత్యయములగు ble, able, మున్నగువానితో ఆంగ్లపదములు ఎన్నియోరూపముల నొందినవి. Bear able, Eatable మున్నగునవి ఇట్టివి. తెలుగుపదములకు పారశీ ప్రత్యయములు చేర్చినట్లే ఉర్దూపారశీపదములతో తెలుగుపదముల జోడించి మిశ్రసమాసములనుకూడ తెలుగు వారు ప్రయోగించుట ఈసందర్భమున గమనింపదగిన అంశము. పాలడబ్బా. అల్లం మురబ్బా. దానపట్టా. దీర్ఘవాయిదా. గ్రామమునసబు. ఖూఖామందు. గితసాలు. ప్రయాణ ఖర్చులు. తలపాగ. గోడకుర్చీ. నాటకసామానులు. ఇంటికిరాయి. గుడ్డిదర్బారు. ఖారీ చెయ్యి. కిల్లాకు. అల్కాజనం మొదలగు మిశ్రపదబంధములు. సమాసములు. తద్ధిత ములు అన్యదేశ్యముల ప్రగాఢప్రభావమును నిరూపించుచున్నవి సాధారణముగ అన్ని భాషలయందును. ఈవిధమైన మిశ్రరూపములు కన్పట్టును. ఈసంద్రదాయమును బ్లూమ్‌ఫిల్డ్ పండితు డిట్లువివరించెను.

"When an affix or suffix occur in enough boreiyn words, it may be evtended to new formalities with native mateial."

ఉర్దూపారశీకపదములుకొన్ని ఎట్టిమార్పులులేక తెలుగులో ప్రవేశించినట్లే ఆభాషలలోని పదబంధములు. నుడికారములుకూడ యధాతధముగ స్వీకరింపబడినవి. మక్కికిమక్కీ. కోన్‌కిస్కా. సాడేసాతి. తీన్‌తేరా. లాడ్‌సాయెబు. నవాబుసాయెబు. పక్కాచోరు. మున్నగునవి ఇట్టివి. కొన్ని సందర్భరములందు సమానార్థకములగు పదములు జంటగా ప్రయోగింపబడినవి సిగ్గుషరము. దస్తుసామగ్రి. జాబులేఖ. మొదలగు పదములిందులకుదాహరణములు.

పూర్వకావ్యములందు బహుళముగ ఇట్టి ప్రయోగములున్నను ఏ కారణము చేతనో లాక్షణికులదృష్టిని ఆకర్షించలేదు. అధర్వణునివంటి ఒకరిద్దరు లాక్షణికులు మాత్రము అన్యదేశ్యములగూర్చి ప్రత్యేకముగ సూత్రములు నిర్మించిరి. అసంఖ్యాకముగ ప్రయోగింపబడిన పదములను మిశ్రసమాసములను గుర్తించి శ్రీవడ్లమూడి గోపాల కృష్ణయ్యగారు ప్రత్యేక సూత్రములను ఇట్లు రూపొందించిరి.

1. సాంస్కృతిక. ఆచ్ఛికాన్యదేశ్యమిశ్ర భేదాలతో సమాసం చతుర్విధం— సమాస- 1

2. కేవలం అన్యదేశ్య పదాల సమాసం అన్యదేశ్య సమాసం. సమాస-7

3. సంస్కృతపదంతో ఆచ్ఛికాన్యదేశ్యాలు సమసిస్తే సిద్ధమిశ్రమం.

సమాస-10

బేమర్యాద. పంచరంగులు, అతిజరూరు. మొ॥

4. సంస్కృత సమపదంతో ఆచ్ఛికాన్యదేశ్యపదాలు సమసిస్తే సాధ్యమిశ్రమం.

5. ఆచ్ఛికపదంతో అన్యదేశ్యపదాలు సమసిస్తే ఆచ్ఛికమిశ్రమం.

సమాస-12

ఖజానాగది, సామానుబండి, బంగరుమొలాం. జరూర్‌పని మొ॥

# క్రియలు

ఉర్దూపారశీకములందలి విశేష్యవిశేషణములకును, ధాతువులకును, తెలుగు సహాయకక్రియలు చేర్చి క్రొత్తధాతువులను తెలుగువారు కల్పించుకొనిరి. "ఇంచుక్ ఆయించు" మున్నగు ఆగమములతో నేర్పడిన ధాతువులు, క్రియారూపములు పెక్కు కలవు. ఇట్టివి దాదాపు అయిదువందలుకలవు. నిఘంటువుల కెక్కనివియు, వ్యవహారమున మాత్రమే ప్రచలితములగునవియు, నగుధాతువులు, పెక్కుకలవు.

అన్యదేశ్యధాతువులకు ఇంచుగాగమములుకలిగి ఏర్పడినరూపములు తెలుగులో వందలకొలదికలవు. ప్రేరణార్థక రూపములందును, తదితరములందును "ఇంచుక్" ఆగమము కన్పించును, ''అయించు'' ఆగమమునుగూర్చి డా॥ చిలుకూరి నారాయణ రావుగారు ఇట్లు వివరించిరి.

"అన్యదేశ్యములలో హిందూస్తానీ భాషనుండి వచ్చిన వెక్కువగానున్నవి. ఇట్టివానిలో రెండవవర్ణము సాధారణముగ దీర్ఘముండును. వీని అంతములందు "అయించు" అను ప్రత్యయము చేరుచుండును."[1]

ఈసందర్భమున వీరుచూపిన ఉదాహరణములలో కొన్నిటియందు ఇంచు గామమును, మరికొన్నిటియందు ఆయించుగామము కలుగుచున్నది. ఇట్టిరూపములు తెలుగులో ఎన్నియోకలవు.

అటకాయించు, బనాయించు, భగాయించు, బచాయించు, బడాయించు, బదలాయించు, ఉడాయించు, ఆజమాయించు, కేటాయించు, ఖడాయించు, గదమాయించు, గల్భాయించు, గుజరాయించు, ఖులాయించు, చుకాయించు, గలాయించు, గిరదాయించు, గుమాయించు, చలాయించు, చెటాయించు, చడాయించు, ఊమాయించు, జమాయించు, టలాయించు, దబాయించు, తనాయించు, తమాయించు, డుబాయించు, నచాయించు, నిభాయించు, పస్తాయించు, పురమాయించు, ఫిరాయించు బతాయించు, బదలాయించు, బగాయించు, బజాయించు, బిడాయించు, బుకాయించు, మనాయించు.

---

[1] ఆంధ్రభాషాచరిత్రము ' ప్రథమ సంపుటము పుట 122

మినహాయించు, మిలాయించు, లడాయించు, లగాయించు, లపటాయించు, సడాయించు, సజాయించు, సతాయించు, సునాయించు, సుసలాయించు, గుమాయించు మొదలగునవి.

అన్యదేశ్య విశేష్యవిశేషణములు తెలుగుసేర్చిఁజాష్టిక క్రియలతోచేరి ఏర్పడిన క్రియారూపములు ఇటగమనార్హములు. ఖాయిదాచేయించు, అమలుచేయించు, దాఖలు చేయించు దురస్తుచేయించు, మాఫుచేయించు, మున్నగునవి. ఇట్టివి.

చేయు, పడు, అగు, పట్టు, పెట్టు. కొట్టు, తీయు, పుట్టు, చూపు, ఇచ్చు. వేయు, వ్రాయు, కట్టు, ఒసగు, పొందు, పఱచు, లేచు, జఱుపు, ఎత్తు, లేప అను మున్నగు సహాయక క్రియలవలన నేర్పడిన రూపములు.

చేయు: అమలుచేయు, అర్కాటుచేయు, ఇషారాచేయు, కరాబుచేయు, కాతరుచేయు, కూచీచేయు, కైజాచేయు, ఖరీదుచేయు, ఖాళీచేయు, గలభాచేయు, గిలాబుచేయు, గులాముచేయు, జప్తీచేయు, జబర్దస్తీచేయు, జారీచేయు, తనఖీచేయు, తమాసాచేయు, తగ్దుమాచేయు, తామీలుచేయు, దగుల్బాజీచేయు, దాఖలుచెయు, దురస్తు చేయు, దోస్తీచేయు, నకరాచేయు, పరేషాణాచేయు, పక్కాచేయు, పజీతుచేయు, ఫైసల్‌చేయు, బద్‌నాంచేయు, బర్తరఫ్‌చేయు, బందోబస్తుచేయు, బరకాస్తుచేయు, భర్తీ చేయు, మంజూరుచేయు, మద్దరుచేయు, దిల్లగీచేయు, మల్ఫాఫ్‌చేయు, ముస్తీదుచేయు, మాఫుచేయు, యాదిచేయు, రవానాచేయు, రస్తుచేయు, రద్దుచేయు, వకాలతుచేయు, వాపసుచేయు, షరీకుచేయు, షోకుచేయు, సలాంచేయు, సిఫారసుచేయు, సుస్తీచేయు, హల్లాచేయు, హాజరుచేయు, హైరాన్‌చేయు, హుంషార్‌చేయు.

పడు : గాబరాపడు, దీలాపడు. దఖలుపడు. దగాపడు, బకాయపడు, బాకీపడు.

అగు : అమలగు, ఖాయమగు, రద్దుఅగు.

పెట్టు · టోపీపెట్టు, నజర్‌పెట్టు, పారిఖత్తుపెట్టు, గిరవిపెట్టు.

కొట్టు : గప్పాలుకొట్టు, తాలీలుకొట్టు, గోతాకొట్టు.

తీయు : దివాలతీయు.

చూపు : దాఖలాచూపు, హవాలాచూపు.

ఇచ్చు : ఈనామిచ్చు, చీటిఇచ్చు, తరిఫీదుఇచ్చు, తాజీమిచ్చు, హుకుముఇచ్చు

వేయు : పాగావేయు, దావావేయు.

కట్టు : ఖరీదుకట్టు, జమకట్టు.

పఱచు : దఖలుపఱచు.

లేచు. సవారీలేచు.

ఎత్తు : బేజారెత్తు.

తీరు : మౌజులుతీరు.

తిరుగు · గోల్‌తిరుగు, ఉల్టాతిరుగు.

చెప్పు · మతలబుచెప్పు

తిను : మొఖాసాతిను, ఇనాంతిను...

ఇన్ని విధములైన క్రియలు తెలుగులో ప్రవేశించిన తరువాత భావవ్యక్తికరణమునకు క్రొత్తదారు లేర్పడినవనుటలో సందేహములేదు. కొన్నికొన్ని భావములను ఈ క్రియల సహాయములేనిది స్పష్టముగా వ్యక్తీకరింపలేము. తెలుగుభాషలో నవి అంతగా మేళవించిపోయినవి. లాక్షణికులు, భాషాశాస్త్రవేత్తలు ఈ ధాతువులగూర్చియు, క్రియా రూపములగూర్చియు ఉర్దూ పారశీక ధాతుప్రత్యయములలో కలుగు మార్పులనుగూర్చియు, ప్రత్యేకముగ పరిశీలించు అవసర మెంతయుకలదు.

# వర్ణములు - ధ్వనులు

ఉర్దూ ఒక విధమైన సంకరభాష. ఇందు అరబీ, పారశీకము, ప్రాచీన హిందీ, సంస్కృతము, మున్నగు భాషలనుండి ఎన్నియోవర్ణములు చేరినవి. ఒక్కొక్క భాషయందు కొన్ని విశిష్టవర్ణములుండును. ఆ వర్ణములను ఆధారముగ గొని ఆ యా పదము లేభాషకు చెందినవో సులభముగా గుర్తింపవచ్చును. అరబీభాషలో "పే- చీం- జే- గాఫ్" అను ఉచ్చారణముగల వర్ణములులేవు- పారశీలో ట- డ- ర- ఢ మున్నగు వర్ణములులేవు- ఉర్దూభాషలోని వర్ణముల ఉచ్చారణలివి.

అలీఫ్- బే- పే- తే- టే- సే- జిం- చీం- హై- ఖే- దాల్-డాల్-రే- జే- షే- సీన్- షీన్- సువాత్- జువాత్- తోయ్- జోయ్- అయిన్- గైన్- ఫే- ఖాఫ్- కాఫ్- గాఫ్- లాం- మీం- నూన్- వ హే- య- నూనెగున్నా.

ఈవర్ణములలో అరబీ పారశీవర్ణముల సంఖ్య అధికము. తెలుగులో ప్రవేశించిన ఉరుదూ పారశీక పదములను వ్రాయుట యందును, ఉచ్చరించుట యందును మనకు కొన్నిచిక్కులు కలవు. ఆభాషలోని వర్ణములకు సరియైనవర్ణములు తెలుగులో లేకపోవుటయే దీనికి కారణము. మనకు విజాతీయములైన ఆ భాషలలోని వర్ణముల ఉచ్చారణలివి.

సె-ఖై-జె-జె-జువాత్-జోయ్-ఐన్-గైన్-ఫే-ఖాఫ్

ఈధ్వనులుగల వర్ణములతోడి పదములను యథాతథముగ వ్రాయుటకష్టము. ఆపదముల నుచ్చరించుట సాధనపై ఆధారపడినది ఉరుదూ పారశీకవర్ణములతో పరిచయముకలవారికి అది సులభమే. కాని అపరిచితులకు కొంతకష్టము కలుగును. అట్టి సందర్భములందు ఆయాధ్వనుల సామ్యవర్ణములను ఊతగొని ఆయాపదములను తెలుగువారు ఉచ్చరించుచున్నారు. ఖరాబు అనుపదమును అచ్చముగా ఉరుదూవారు ఉచ్చరించినట్లు ఆ వర్ణముతో పరిచయముకలవారు ఉచ్చరించుచున్నారు. మఱికొందరు కరాబు అనియే ఉచ్చరింతురు. విశిష్ట ఖ కారమునకు సరిపడు వర్ణము తెలుగులో లేదు క, ఖ లను మాత్రమే స్వీకరింపక తప్పదు. ఇట్లే మనకు విజాతీయములగు వర్ణముల నుచ్చరించుటయందు ధ్వనిసామ్యముగలవానితో ఉచ్చరించుట కలదు. వానిలో మాత్రము

తెలుగువారికి క్లేశము కలుగకతప్పలేదు. ఫల్, జప్తీ, గరీబ్, ఖరాబ్, ఖానూ — మున్నగు పదములలో ఖకార విశిష్టములైనధ్వనులు ఉరుదూపదములలో రెండు కలవని స్పష్టమగు చున్నది. ఖై- ఖాఫ్ అని ఉచ్చారణగల వర్ణములకు తెలుగువారు క, ఖ ల నుపయోగించుచున్నారు. ఫే అను ఉచ్చారణము గల వర్ణములకు ప, ఫ కారము లుపయోగింపబడుచున్నవి.

ఆంగ్లము మున్నగుభాషలనుండి తెలుగువారు పదముల స్వీకరించుపట్ల వ్రాతలో ఇట్టిచిక్కులే కలుగుచున్నవి. Flower అను పదమును తెలుగువర్ణములలో ఫ్లవర్ అనియే వ్రాయుచున్నారు. దంత్య, తాలవ్య, ఓష్ఠ్య ధ్వనులలో విశిష్టోచ్చారణము గల ఉరుదూపారశీక పదములను వ్రాయుటలో తెలుగువారు సర్వాంగీకారయోగ్యమగు మార్గము నవలంబింపవలసిన అవసర మెంతయుకలదు. లేనిచో పదముల స్వరూపమును గుర్తించుటయందు అర్థముల గ్రహించుటయందు దొసగులేర్పడు ప్రమాదము కలదు. బిరుదముఅను అర్థముగల "ఖితాబ్"అనుపదమును పుస్తకముఅనుఅర్థముగల "కితాబ్" అనుపదమును "కితాబు" అనియేవ్రాయుచున్నారు. ఖితాబ్ అను పదములోని వర్ణము 'ఖై' ఉచ్చారణముకలది. కితాబ్ లోనిది కకారము మాత్రమే. డా॥ చిలుకూరి నారాయణరావుగారు కితాబు అను పదమునకు పుస్తకము బిరుదు అను అర్థద్వయము కలదని వ్రాసిరి. పరిశీలింప ఇవి రెండును భిన్నవర్ణములుగల పదములు. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారును శబ్దరత్నాకర అనుబంధమునందు అన్యదేశ్యపదముల అర్థవివరణ సందర్భమునందు పైవిధముగనే వ్రాసిరి.

ఈచిక్కులనుండి తప్పుకొనుటకు విజాతీయవర్ణములకు తెలుగువారు ధ్వని సంకేతములతోడి సామ్యవర్ణములనుగ్రహించుటయే ఉత్తమమైనమార్గముగ తోచుచున్నది. ఆధునిక భాషాశాస్త్ర విద్వాంసులు ఇట్టిధ్వనిసంకేతములను సూచించి వానిననుసరించియే వ్రాయుచున్నారు. తెలుగువారు కొందఱు అన్యదేశ్యములను వ్రాయుపట్ల అంతర్జాతీయ ధ్వనిసంకేతవిధానము ననుసరించుచున్నారు. ఈవిధానమునకు వ్యాప్తికలిగించుటకు కృషి జరుగవలసియున్నది.

ఈసందర్భమునందు వాఙ్మయ మహాధ్యక్ష శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు కావించిన కృషియు, వారుసూచించిన పద్ధతియు పరిశీలనార్హములు. వీరు అన్యదేశ్యవర్ణములకై తెలుగులో ఒకటి రెండువర్ణములను చేర్చిరి. ఫే అను ఉచ్చారణగల వర్ణమునకు ఫ అనువర్ణమును సూచించి దీనికి గుణింతమునిట్లు చూపిరి.

ప- పా- పి- పీ- పు- పూ- పే- ఫై- పొ- పో- పౌ

వ్యావహారికాంధ్రవ్యాకరణమునందు గోపాలకృష్ణయ్యగారు సూచించిన విధానమును విద్వాంసులు పరిశీలింపవలసియున్నది. దీనిని క్రొత్తవర్ణముగా గ్రహించుట కవకాశములేదు. ఒక సంకేతమువలెనేయున్నది. ఇది అన్నివర్ణములకును ఆచరిణయోగ్యమా? అనునదే సందేహము గోపాలకృష్ణయ్యగారు 'ప' కారముగల పదాలు అన్యదేశ్యాలని సూత్రీకరించియున్నారు.

"ప:కారాదంకలపదాలు అన్యదేశ్యాలు" — సంజ్ఞా. పరి. సూ 52-

ఈ ఒక్కవర్ణమే కాక మరికొన్ని వర్ణముల వ్రాయురీతిని కూడా వారు సూచించిన సమంజసముగా నుండెడిది. నూత్నవర్ణముల రూపొందించుటకంటె ధ్వనిసంకేతముల పాటించుటయే ఉచితమనిపించును.

అన్యదేశ్యములను సులభముగా గుర్తించుటకును, వానిని సరియైన ఉచ్చారణరీతితో వ్రాయుటకును, ముద్రణ వ్యవహారమునకును ఈవిధానము తోడ్పడునను టకెట్టి సందేహములేదు.

# ధ్వని - పరిణామము

ఒకభాషనుండి వేఱొకభాషకు పదములు చేరినపుడు ధ్వనులయందును పదములస్వరూపమువందును మార్పులు కలుగుట సహజము. ఐనను ఇట్టిమార్పులు కలుగుటకు కారణములను ఇదమిత్థమని నిర్ణయించుట కష్టము. ఆమార్పుల సూత్రీకరించుటయు కష్టమే. భాషాశాస్త్రజ్ఞులు ఈమార్పులను వానిస్వరూపములను పరిశీలించి సాధారణముగ రెండుమూడుకారణములచే ఇట్టిమార్పు లేర్పడునని వివరించిరి.

వాతావరణ ప్రభావము:— వాతావరణ ప్రభావమున ధ్వనులయందును ఉచ్చారణలందును విపరిణామము కలుగునని కొందఱి అభిప్రాయము. ఈసిద్ధాంతమును వారు భౌగోళిక సిద్ధాంతమని (Geographical Theory) పేర్కొనిరి. కాని ఇది శాస్త్రసమ్మతమైనవాదము కాదు. ధ్వనుల ఉచ్చారణమునకు స్వరనాళములుమాత్రమే తోడ్పడునని యు భౌగోళికపరిస్థితులతోడను వాతావరణ ప్రభావముతోడను ఉచ్చారణరీతుల కెట్టి సంబంధము లేదనియు కొందఱిమతము. ఉష్ణమండలములనుండి శీతలమండలములకు వచ్చినవారి ఉచ్చారణలో నెట్టిమార్పు కనుపించదని వీరివాదము. సాధనమువలన విజాతీయధ్వనుల నుచ్చరించుటసాధ్యమే.

జాతుల సమ్మేళనము — ఒకప్రాంతమున భిన్నభిన్నములైన జాతుల సమ్మేళనమున ధ్వనివిపరిణామ మేర్పడునని కొందఱు శాస్త్రజ్ఞుల అభిప్రాయము. వీరిసిద్ధాంతమును Substratum Theory అందురు. వివిధజాతుల కలయికలేనపుడునుధ్వనులలో మార్పులేర్పడిన అంశముల నాధారముగగొని కొందఱువిద్వాంసులు పైవాదమును తిరస్కరించిరి.

**సులభోచ్చారణము:** ప్రతికార్యమును నిర్వహించుటయందును సులభమైనమార్గము నన్వేషించుట కన్పట్టును. ధ్వనుల నుచ్చరించుటయందుమ సౌకర్యమును ప్రధానముగ నెంచుటకలదు. భాషాశాస్త్రజ్ఞులు దీనినే Ease Theory అనిరి. ఈమూడింటియందును ఈసిద్ధాంతమే శాస్త్రీయముగను, అంగీకారయోగ్యముగను కన్పట్టుచున్నది. ఆబాలవృద్ధులును, పండితపామరులును ఉచ్చారణలో శ్రమలేని విధానమునే అనుసరించుట సహజము. ఉచ్చారణసౌకర్య మనగా నిట్లుండునని గీతగీసిచెప్పుట ఎవరికిని సాధ్యము కాదు. వ్యక్తులస్థాయిని అనుసరించినవిషయమిది. ఉచ్చారణలోని అశక్తతయు ధ్వని విపరిణామమునకు హేతువు అనుఅంశమిట విస్మరింపరానిది.

ఒకభాషనుండి పదములను స్వీకరించునపుడు జనులు కొన్ని మార్పులొనర్చుచుందురు. ఈపదమునకీమార్పు విధిగా కలుగునని ఘంటాపథముగ చెప్పలేము. ఒక విధమైనమార్పు కొన్ని సందర్భములందొకరీతిగను, మఱికొన్ని సందర్భములందు దానికి భిన్నముగను ఏర్పడవచ్చును. పెక్కు సందర్భములందు కలుగుమార్పులనే పరిశీలించి కొన్నింటిని సూత్రీకరించుట జరిగినది. సాధారణముగ ఉచ్చారణ సందర్భములందు కొన్నిధ్వనులను తేల్చియు, మరికొన్నింటిని ఒత్తియు, ఒక్కొక్కసారి మధ్యస్థముగను పలుకుటకలదు. పదస్వరూపము ననుసరించియు, ఆయాభాషల విశిష్టలక్షణముల ననుసరించియు, ఉచ్చారణరీతు లేర్పడును. ఉర్దూపారశీకపదముల ఉచ్చారణమునందును స్వరూపమునందును ఏర్పడినమార్పులు భిన్నభిన్నములుగ నున్నవి. ఈమార్పులను కొంతవఱకిట్లు నిరూపింపవచ్చును.

1. హలంతము లజంతములగుట.

ఆంధ్రి మజంతభాష సంస్కృతాది భాషలనుండి పదములు చేరినపుడును హలంతములైన పదములు అజంతములుగ మారినవి. ఉరుదూ పారశీకపదములుకూడ తెలుగులో ఇట్టిమార్పులనొందినవి. పదాంతములందలి హల్లులేకాక పదమధ్యమునందలి హల్లులుకూడ ఇట్లేమారినవి.

| | |
|---|---|
| దురస్త్ = దురుస్తు | గులాబ్ = గులాబు |
| మిస్ల్ = మిసలు | గోర్ = గోరి |
| ఇనామ్ = ఇనాము | ఫికర్ = ఫికరు |

2. కొన్నిసందర్భములందు "అము" ప్రత్యయము చేరినది.

| | |
|---|---|
| గజ్ = గజము | దుకాణ్ = దుకానము |
| దఫ్తర్ = దఫ్తరము | అంబార్ = అంబారము |

3. ఉరుదూ పారశీక పదములు కొన్ని అజంతములయ్యు తెలుగులో కొన్ని మార్పు నొందినవి.

| | |
|---|---|
| అర్జి = అర్జీ | ఖుషి = ఖుషీ |

4. పదాంతమునందలి "ఐన్"అను ఉచ్చారణముగల వర్ణములకును అకారోచ్చారణము గలిగినవానికిని దీర్ఘాచ్చువచ్చినది.

| | |
|---|---|
| జిల'అ = జిలా | జమ'అ = జమా |

5. పదాది యందలి దీర్ఘాచ్చు హ్రస్వమగును.

చాలాక్ = చలాను బాజార్ = బజారు

చాబుక్ = చబుకు

6. పదమధ్యమందలి ఇకారము అకారముగ మారుట.

దాఖిల్ = దాఖలు హాజిర్ = హాజరు

ఆఖిర్ = ఆఖరు సాదిర్ = సాదరు

వర్ణములు, పదములు మున్నగువానియందు ఏర్పడుమార్పులను భాషాశాస్త్రజ్ఞులు శాస్త్రీయదృష్టితో పరిశీలించియున్నారు.[1] ఇవి సాధారణముగఅన్నిభాషలయందును నేర్పడుచుండును. అన్యదేశ్యములందేర్పడిన వివిధములైన మార్పులను భాషాశాస్త్ర సిద్ధాంతములననుసరించి ఇట్లు వర్గీకరింపవచ్చును.

1. స్వరాకర్షణము – పూర్వమునందుకాని పరమునందుకాని కల అచ్చుల ఆకర్షణము వలన ఒకఅచ్చు మార్పునొందుట స్వరాకర్షణ మనబడును. ద్రావిడభాషలందీమార్పు సర్వసాధారణముగ గన్పించును. "కు" ప్రత్యయము "కి"గా మారుట ఈసూత్రము ననుసరించియే.

చేతి + కు = చేతికి రాముని + కు = రామునికి

ఉరుదూపారశీకపదములు తెలుగులో చేరినపుడును ఇట్టిమార్పుల నొందినవి.

ఖబర్—కబరు— = కబురు.

విభక్తి ప్రత్యయములుచేరిన పదములందును బహువచన రూపములందును నిట్టిమార్పు గోచరించుచున్నది.

కిస్తి + లు = కిస్తులు తుపాకి + లు = తుపాకులు

కచేరి + కు = కచేరికి భికారి + కు = భికారికి

బీబి + కు = బీబికి.

మున్నగురూపము లిందులకుదాహరణములు. ఈ మార్పులన్నియు స్వరసామ్యలక్షణము కలవి. కేవల ముచ్చారణసౌకర్యము కొరకేర్పడినవి.

---

[1] Bloom Field — Language. ch. 20-22

2. వర్ణవ్యత్యయము:—అచ్చులుకాని హల్లులుకాని పరస్పరము స్థానమును మార్పునొందుటను వర్ణవ్యత్యయ మందురు. ఇట్టి మార్పు మాటలాడువారి అశక్తతవలనను అజ్ఞానమువలనను ఉచ్చారణ త్వరవలనను సాధారణముగ నేర్పడుచుండును.

అమానతు = అనామతు సఖ్తి = ఖస్తి—కస్తి

దీనినే వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు కొన్ని పదాలకు అక్షర వ్యత్యస్తం జరుగుతున్నది. (సూ. 460-p-148)అని సూత్రీకరించిరి.

3. ధ్వనివ్యత్యయము:— ద్రావిడభాషలందు సాధారణముగ ఊనిక (Stress accent) పదముయొక్క ప్రథమాక్షరముపై నుండును. ఊనికతరువాతి అక్షరములపై నున్న శబ్దములందును నిట్టి వర్ణవ్యత్యయము కన్పట్టుచున్నది.

బహెదా = హోదా

4. ద్విరుక్తి :— ఇది ఒకవిధమైన వర్ణసమీకరణ మనిచెప్పవచ్చును. వర్ణసమీకరణమునందు (Assimilation) విభిన్నములైన రెండువర్ణములు సంయోగముచెందును. ఒకవిధముగ అన్యదేశ్యములందు ద్విరుక్తి కలుగుచున్నది.

| | | |
|---|---|---|
| ఇతర్ = అత్తరు | హద్ = హద్దు | కమి = కమ్మి |
| హఖ్ = హక్కు | ఖిలా = ఖిల్లా | గలీ = గల్లి |
| హిసాబు = హిస్సాబు | ఖియిమత్ = కిమ్మతు | నౌబతు = నౌబత్తు |
| పతా = పత్తా | ఊని = ఉన్ని | మదద్ = మద్దతు |

5. స్వరభక్తి లేక స్వరవిశ్లేషము :— (Anaptyxis)

విజాతీయములైన హల్లులు సమీకరణమునొందనపుడు ఒకఅచ్చుచేరి సంయుక్తాక్షరమును విశ్లేషమొనర్చును.

| | | |
|---|---|---|
| తఫ్సీల్ = తబిసీలు | మక్తా = మగతా | కార్ఖానా = కారుఖానా |
| జుల్మ్ = జులుము | బద్లీ = బదిలీ | ఇక్రార్ = ఇకరారు |
| బద్నామ్ = బదనాము | ఖుష్కి = ఖుసికి | అజ్మాయిష్ = అజమాయిషు |
| తకార్ర్ = తకరారు | గోష్పేచ్ = గోష్పేష | |

6. గుణధర్మము :— ఏ.ఓ.అర్ అనునవి గుణములు. అకారమునకు ఇ-ఉ-ఋ- వర్ణములుపరమైన గుణము లేకాదేశమగును. ఇట్టిసూత్రముతో నిమిత్తములేకయేఉ ఓగా మారుట ఉచ్చారణసామ్యమువలననే.

ముబాదిలా = మొబాదిలా   గులామ్ = గొలాము
ముగలాయి = మొగలాయి   ఇకరారు = ఎకరారు
ముఖాసా = మొఖాసా   ఉస్తాద్ = ఒస్తాద్
ముఖద్దమా = మొకద్దమా   ముఖాం = మొఖాం

7. హల్లోపము :— ఒకపదమునందలి అంత్యాక్షరము రెండవపదము లేక ప్రత్యయము యొక్క ఆద్యక్షరము సాజాత్యములైనపుడు సాధారణముగ హల్లోపముకలుగును.

ఖరీద్ + దారు = ఖరీదారు

8. వర్ణచ్యుతి :— సంయుక్తాక్షరములలోని ఒకవర్ణము జారిపోవుట కొన్నిపదములందు గన్పట్టును.

మజ్జూరి = మజూరి   మస్జిద్ = మసీదు

పదాదియందలి హకారము అకారముగమారుట బహుళముగ గన్పట్టును.

హబిషి = అబిసీ   హర్కారా = అర్కారా
హమేషా = అమేషా   హర్కాతు = అర్కాతు

పదమధ్యమునందలి "హ"కారము లోపించుటయుకలదు.

దసెహరా = దసరా   కచ్హేరి = కచేరి   పహరా = పారా
సాహెబు = సాయెబు   ఖుష్హాల్ = ఖుషాలు

9. పరుషములు సరళములగుట :— సరళములు పరుషములగుట.

దబాయించుట = డబాయించుట   నఖారా = నగారా
దాబా = డాబా   తఖాజా = తగాద
నఖద్ = నగదు   జాఫరాణ = జాబరా

10. అనునాసికముల మార్పు :—

దుకాణ = దుకాణము   దీవాణ = దివాణము

కొన్ని సందర్భములందు అనునాసికము లోపించును.

మంజిల్ = మజిలీ

11. జానపదవ్యుత్పత్తి :— Folk etymology.

శబ్దములస్వరూపముతో స్వల్పపరిచితివలనను, పరిచితి అసలే లేకపోవుట

వలనను కొన్నికొన్నిపదములకు చిత్రమైనమార్పులు కలుగుచుండును. జానపదు లలో నిట్టిమార్పు లధికముగాగన్పట్టును.

నుక్సాన్ = లుక్సాన్      నంగా = లంగా

12. కవిప్రయోగములు :— శిష్టేతరుల ఉచ్చారణమునందును వ్రాతలందును పదముల స్వరూపము మార్పు నొందినట్లు కవులప్రయోగములవలనను కొన్ని పదములు మార్పునొంది వ్యవహారమున నిలిచిపోవును. ఒక్కపదమునకు రూపాంతరము లనేకములు ఇట్లేర్పడునట్టివే. శైలీసౌమ్యతకొఱకు, శైలీగాంభీర్యమునకు, ఛందో నుగుణముగను పదములు మార్పునొందును.

కరి మయూర మరాళికలకు నొయ్యార మీ
నా మిచ్చి నడపు సన్నంపు నడపు

ఇట ఛందస్సుకొఱకు ఈనాముఅను రూపమేర్పడినదనితోచును.

"ఖుసిమీఱన్ సురధాణి.... .. ...." అనుపద్యభాగమున ఓజోగుణశైలిక 'సురధాణి' రూపమేర్పడినది.

"చ–స" లు "ర–ల" లు "ష–శ–స" లు పరస్పరముమారిన పదజాలము తెలుగులో ఎంతయోకలదు. సూత్రబద్ధమొనర్పలేనిమార్పులును ననేకముకలవు. ఇవియన్నియు ప్రయోగములవలన గ్రాహ్యములు.

# అర్థ విపరిణామము

శబ్దములకుగల శక్తులను అవి అర్థమును స్ఫురింపజేయుపద్ధతులను ప్రాచీ సంస్కృతాలంకారికులు నిశితముగ బరిశీలించి అభిధ,లక్షణ,వ్యంజన అనువృత్తులవల అర్థము వ్యవహరింపబడునని వివరించియుండిరి. అభిధ వాచ్యార్థమును లక్షణ లక్ష్యా మును వ్యంజన, వ్యంగ్యార్థమును దెలుపును. అర్థగ్రహణమునకు వృద్ధ వ్యవహారమ ఆప్తోపదేశము మున్నగునవి సాధనములు.

శబ్దమునకుగల అర్థమును సరిగా దెలిసికొనలేక పోవుటవలనను, పదరూః సామ్యముచే వేరొకఅర్థము స్ఫురించుటవలనను. ఒక్కొకసారి ఒక్కొకపదమునక భిన్నార్థము లేర్పడుచుండును, ఇట్టిసందర్భములందు కొందఱుమాత్రమే స్వీకరించిః విపరీతార్థము కారణాంతరములవలన నిత్యవ్యవహారసిద్ధము లగుచుండును. పదముః అనుచితవిభాగమువలనను ఇట్టి ప్రమాదములు సంభవించుచుండును.

కొన్నికొన్నిపదములకు భిన్నభిన్నకారణములచే ఒకసారి విస్తృతార్థముకాని, మఱియొకసారి సంకుచితమైన అర్థముకాని ఏర్పడుచుండును. అర్థములో భిన్నవిభిన్న కారణములచే కలుగు విపరిణామమును భాషాశాస్త్రజ్ఞులు శాస్త్రీయపద్ధతులతో పరిశీలించిరి, శాస్త్రగ్రంథములందీశాఖను వారు Semantics అనిపేర్కొనిరి.

ఆధునికభాషాశాస్త్రజ్ఞుల సిద్ధాంతముల ననుసరించి సంకేతము, వ్యాకోచము, సౌమ్యత్వము, గ్రామ్యత్వము మున్నగునవి అర్థములందు భేదమేర్పడుటకు కారణమని వివరించిరి. వ్యక్తిమనస్తత్వము, కవుల ప్రయోగవిధానము అనునవి పదముల అర్థమునందు మార్పుగలిగించునను అంశముకూడ ఇట గమనింపదగినవి.

1 సంకోచము:— సామాన్యార్థమును వెలువరించు శబ్దము ఒక్కొక్కసారి విశేషార్థమునుమాత్రమే బోధించును. పదముయొక్క అర్థము సంకుచితమగును దీనినే సంకోచ మందురు. ఆంగ్లమున దీనిని Restriction అనివ్యవహరింతురు. 'చీర' అను పదము మొదట వస్త్రవాచకము నేడు స్త్రీలు ధరించు వస్త్రవిశేషమును మాత్రమే చీర అందురు. అన్యదేశ్యములందును నిట్టిమార్పులు కలిగినవి. భూఖామందు అనుపద మిందులకుచక్కని ఉదాహరణము. "ఖావిందు"-ఖామందుగా మారినది. భర్త, యజ మాని అనిఅర్థము. భూఖామందుఅనగా భూస్వామి. ఖామందుఅనినను అదేఅర్థము.

ఖర్త అనుఅర్థమున నిది ప్రయోగింపబడుటలేదు. జవాను:— దీనిశబ్దార్థము యువకుడు ఇట్టి విస్తృతమైనఅర్థమును వీడి సైనికుడు, సేవకుడు అను పరిమితార్థములనొందినది.

2. వ్యాకోచము:—ఒకపదము వ్యుత్పత్తినిబట్టి విశిష్టమైన అర్థమునువహించి క్రమముగా విస్తృతార్థమును బొందును. తైలము మొదట తిలసంబంధమైన నూనె అను అర్థముకలది. ఇపుడు సారరూపమైన ద్రవపదార్థమని అర్థము సంపంగి తైలము. షమా:—అనుపదమునకు వికృతి సెమ్మె. షమా అనగా దీపము. దీపపుసెమ్మెఅనుపదమును బరిశీలించిన స్తంభముఅను అర్థమును గ్రహించినట్లు స్పష్టమగును. ఈలక్షణము నాంగ్లమున Expans on అందురు ఫౌజు:— సైన్యము అనుఅర్థమునందే మొదట ఈ పదము ప్రయుక్తము, గుంపు, బృందము అనుఅర్థములు తర్వాత ఏర్పడినవి.

3. గ్రామ్యత్వము:—ఒకపదము విశిష్టమును సదర్థమునువహించి క్రమముగా దుర్థమును పొందు లక్షణమును గ్రామ్యత్వమందురు దీని నాంగ్లమునDegradation అందురు. కంపు మొదట పరిమళముఅను అర్థముకలిగియుండెను ఎఱ్ఱాప్రగ్గడ వేదములకంపు వేదపరిమళమనుఅర్థమున బ్రయోగించియుండెను. ఇది నేడు దుర్గంధమను అర్థమేస్ఫురింపజేయును. తాలింఖానఅనగా విద్యాపీఠము. నేడు కసరత్తుచేయు ప్రదేశమని అర్థము.

4. సౌమ్యత్వము:— అల్పార్థము నుదాత్తరీతిలో వ్యక్తీకరించుట, సభ్యతా సౌమ్యములకు నిదర్శనము. అసభ్యతను, అమంగళమును పరిహరించుట సామాన్యముగ గన్పట్టును. పసుపుకుంకుమలను లాకేత్వమిచ్చి దాకునుకొమ్మిచ్చి అని వ్యవహరింపరు-నిండినవని అందురు, ఈసౌమ్యత్వము నాంగ్లమున Euphemism అందురు, పాకీవాడు అనుపదమిట్టిది, మలమూత్రములను శుభ్రము చేయువాని పాకీవారుగ వ్యవహరింతుము. శుభ్రముచేయుట-పరిశుభ్రతకలవాడు అను అర్థద్వయముతో ఈ 'పాకీ' శబ్దమును ప్రయోగించుచున్నాము,

సంకేతము:- వృత్తులు, కులములు, సాదృశ్యధర్మములు మున్నగువానిని అనుసరించి కొన్ని సంకేతము లేర్పడుచుండును. వైదికుల వ్యవహారములో సంకేతార్థకసూచకపదములు కొన్నికలవు. వారిపరిభాషలో యత్పుణ్యం అనగా నాలుగణాలు. సాధారణ వ్యవహారములో చండశాసనుని యముడనియు, నుదాత్తస్వభావముగలవానిని ధర్మరాజనియు వ్యవహరించుటకలదు, ప్రాణికోటి స్వభావమును దృష్టిలో నిడికొని కొందఱి నట్లుపిలుచుట కలదు. చుఱుకుదనముగలవానిని ఎఱ్ఱతేలనుట, పోలీసువారిని ఖట్మల్

అనుట ఇట్టివి. ప్రణయోన్మాదమున పరిభ్రమించువాని మజ్నూ అనియు, భోగభాగ్యము ననుభవించువానిని నవాబనియు, సమయమునకు పనులు సవ్యముగా నెరవేరని కార్యాలయములను మొగలాయిదర్బారు అనియు, ఆపత్కాలమునను సుఖలోలుని, కడుపులోనిచల్ల కదలక బ్రతుకువాని తానీషాయనియు, ఆప్తవర్గముతో సంప్రదించక స్వతంత్రించి విపరీత నిర్ణయములు తీసికొనువారిని తుగ్లకు అనియు, నిలువదీసి అప్పులసొమ్ము వసూలుచేయు నక్షత్రకునివంటివానిని అరబ్బువాడనియు వ్యవహరించుట కలదు. ఇవిఅన్నియు నాయావ్యక్తుల స్వభావము ననుసరించిఏర్పడిన సంకేతపదములు.

**మాండలిక భేదములు:—** అన్యదేశ్యములలో కొన్నిటికి అర్థమునందు మాండలిక భేదములు కూడ ఏర్పడినవి. తెలంగాణమున తనఖా అనగా జీతము. ఇతరప్రాంతములలో గిరివి అనిఅర్థము. బేజారెత్తు.— విసుగెత్తు అనుఅర్థమునందే తెలంగాణమున ప్రయుక్తము. ఇతర ప్రాంతములందు గాభరాపడు, భయపడు అని అర్థము. కూచిసేయుట.— దాడిచేయుట అని సామాన్యార్థము, రాయలసీమలో మొన వాడిచేయు అను అర్థమున ప్రయోగింపబడుచున్నది,

# అనువాద సాహిత్యము

పదునెన్మిదవశతాబ్దిలో వెలువడిన మిశ్రభాషాకవిత్వము అంత్యనియమప్రధానమైన రచనావిధానము మున్నగువానివలన తెలుగువారికి ఉర్దూపారశీక కవితాభోరణులతో పరిచయమేర్పడినట్లు స్పష్టమగుచున్నది ఈయుగమునందలి కథానువాదములను పరిశీలించిన మనవారికి ఉర్దూపారశీకములందలి కావ్యములను ఆంధ్రీకరింపవలయునను సంకల్పముకూడ కలిగినదని భావింపవచ్చును.

ఉర్దూపారశీకములలోని రదీఫ్ఖాఫియాలతో ప్రగాఢపరిచయ మేర్పడినను అంత్యనియమములో పారశీకోక్తులను కూర్చుట కష్టము. పారశీక ఛందోరీతులను పద్యపునడకను అనుకరించుట పందొమ్మిదవ శతాబ్దిలో బీజప్రాయముగ గన్పట్టుచున్నది. నవయుగవైతాళికులలో నొకరగు గురజాడ అప్పారావుగారు పారశీకగజల్ గమకమును అనుసరించియే ముత్యాలసరములలోని కొన్ని గీతములను రచించినట్లు స్వయముగ వివరించినారు. అచ్చమైన గజల్స్వరూపమును తెలుగుమూసలోదింపిన గౌరవము దాశరథిగారికి లభించుచున్నది. ఉర్దూపారశీక గజళ్ళలోని గడుసుపోకడలను, భావసౌకుమార్యమును, అందచందములను జీర్ణించుకొనిన గేయములు పెక్కు వెలువడినవి. వీనిలో నధికములు చలనచిత్రగేయముల రూపమున బహుళప్రచారము నొందినవి. ఆరుద్ర, కొసరాజు, శ్రీశ్రీ, దాశరథి, నారాయణరెడ్డి ప్రభృతులువ్రాసిన గేయములలో ఈలక్షణము ప్రధానముగ గన్పట్టుచున్నది. డా. సి. నారాయణరెడ్డిగారి గేయములలో ఒకవిశిష్టలక్షణము గోచరించుచున్నది. సంప్రదాయమును పాటించుటయందును ప్రయోగము లొనర్చుటయందును వీరు ప్రత్యేకమైన మార్గము నవలంబించినారు. అంధానుకరణము వీరికి రుచింపదు. పారశీగజల్లోని అందచందములు, కులుకు, ఒయ్యారము, విలాసము, సౌకుమార్యగాంభీర్యములు మున్నగువానిని అనుకరించియు, అందును క్రొత్తదనమును చూపి అనుకరణమును ఆభాసమొనర్చు శిల్పచమత్కృతి వీరియందు కన్పించును. "కలల అలలలో—పగలే వెన్నెల—, నన్నుదోచుకొందువటే-నిన్నలేని అందమేదో—, నన్ను విషము త్రాగనిండు—," మున్నగు గేయములలో ఈ విశిష్టలక్షణము తొంగిచూచును. తెలుగుమల్లెల గుమగుమలకు పారశీగులాబి సౌరభ సౌందర్యములను అలవరింపజేసిన అపూర్వ శిల్పచమత్కృతి ఇది.

పందొమ్మిదవ శతాబ్దమునందే ఉర్దూపారశీక సాహిత్యము ననువదించుట తెలుగువారు శ్రీకారముచుట్టినారు. అలంకారికరచనలో పారశీసంప్రదాయమునుపాటించుట దీనికి తొలిదశ. రెండవదశలో వీరు పారశీక కథల నాంధ్రీకరించుటకు పూనుకొనారు. పదునెన్మిదవ శతాబ్ద్యంతమునందును, పందొమ్మిదవ శతాబ్దమునందును వినోద సాహసకథాంశములపై తెలుగుకవులదృష్టి లగ్నమైనది. దీనికి బీజము శ్రీనాథయుగములో పడినది- ఈ యుగములో అంకురప్రాయమై క్రమవికాసము నొందినది. క్రమముగా తెలుగువారిదృష్టి ఉర్దూకథాసాహిత్యముపై ప్రసరించినది. ఈయుగమున తెలుగువారి దృష్టిని విశేషముగా ఆకర్షించినది పారశీక పద్య సాహిత్యము. అందును పారశీక సాహిత్యములో మకుటాయమానములగు ఖయ్యామ్ రుబాయీలు- సాదీ కావ్యములు తెలుగుకవులకు క్రొత్తదారులుచూపినవి, పరంపరగావచ్చు కవిసమయములు, అంగాంగ వర్ణనలు, సంయోగశృంగారము మున్నగులక్షణములతో పరిపూర్ణమైన ప్రబంధశృంగారమును అమలిన శృంగార మార్గములో పయనింపజేయవలయునను సంకల్పముగల రాయప్రోలు సుబ్బారావు ప్రభృతులకు ఖయ్యామ్ వియోగగీతికలు దోహదమొనర్చినవనుటకు సందేహములేదు మధువు, మధుశాల, గుల్, బుల్‌బుల్ మున్నగువానికి సంబంధించిన కవిసమయములు, వర్ణనారీతులు,ఎన్నియో తెలుగువారికి పరిచితములైనవి. సూఫీతత్త్వములోని భక్తిశృంగారవర్ణనలు, వియోగతత్త్వమాధురి క్రొత్తరూపములో తెలుగువారికి ప్రత్యక్షమైనవి.

దక్షిణాపథమున బహమనీ గోలకొండసామ్రాజ్యముల ప్రాభవమున పారశీ రాజభాషాగౌరవము నొందియుండెను, పారశీ భాషాపరిభావము క్రమముగా సాహిత్య పరిభావమునకు దారితీసినది. తెలుగువారు ఉర్దూపారశీకములందు పాండిత్యమును సంపాదించుకొని సాహిత్యగౌరవముగల కావ్యములను అనువదించుటకు పూనుకొనివారు. ఇట్టిదశలో తెలుగుకవుల దృష్టి ఉమర్ ఖయ్యామ్ రుబాయీలపై కేంద్రీకృతమైనది. ఉమర్ ఖయ్యామ్ రుబాయీలకు పెక్కు ఆంధ్రానువాదములు వెలువడినవి.

# ఉమర్ ఖయ్యామ్ రుబాయీలు

పారశీక సాహిత్యములో ధ్రువతారగా నిలువదగిన రుబాయీలను రచించి ప్రపంచసాహిత్యములో మహోన్నతస్థానము నలంకరించిన ఉమర్ ఖయ్యామ్ వివిధ శాస్త్రములలో నిష్ణాతుడు, బహుముఖ ప్రజ్ఞావంతుడు, రసికుడు, ఉత్తమ భావుకుడు, అన్నిటినిమించి ఉత్తమకవి. ఈతడు 18 మే 1048 నాడు సూర్యోదయమున నుదయమందెను. జన్మస్థలము నిషాపూరు ఉమర్ అసలుపేరు ఖయ్యామ్ తఖల్లుస్. ఈతడు జన్మించునాటికి పారశీకదేశములో ప్రశాంతమైన విప్లవము వర్ధిల్లుచుండెను. మతనిర్బంధములు, ప్రాపంచిక సుఖములపైవిరక్తి, వైరాగ్యమునందాసక్తి మున్నగువానిలో కరుడుగట్టిన పారశీకజాతికి నూత్నసందేశమును నూరిపోసినకీర్తి ఉమర్ ఖయ్యామ్‌కు లభించినది, ఖయ్యామ్ సమకాలికుడు ఇబన్‌సీనా భోగానుభవముతోపాటు విజ్ఞానార్జనమునకు కూడ ప్రాధాన్యము నొసగెను. ఈతని ఆదర్శములు ఖయ్యామును ప్రభావితమొనర్చినట్లు పండితుల అభిప్రాయము,

ఖయ్యామ్ ఇతరమహాకవులవలె పెక్కుకావ్యములు రచించి కీర్తిగడించలేదు. ఈతని రుబాయిలే మహాకావ్యతుల్యము. ఒకదశలో పారశీకపండితు లీతని రుబాయిలను ఉత్తమ కవితాఖండములుగను యీతనిని మహాకవిగను పరిగణించలేదు కాని ఈతని సూఫీతత్త్వము భోగపరాయణత, ఉత్తమకవితాధర్మములు ప్రపంచములోనిసహృదయుల నాకర్షించినవి. రుబాయి ఆటవెలదివంటి పద్యము. నాలుగుచరణములుండును. ఉమర్ ఖయ్యాము రుబాయిలు రసగుళికలవంటి ముక్తకములు, జీవితము క్షణభంగురము. గడచిన 'నిన్న' ను గూర్చి ఆలోచించినందువలన లాభము శూన్యము. రానున్న 'రేపు' స్వరూపమెట్టిదో తెలియదు, రేపటిలోపల కాయము నిలుచునో నిలువదో తెలియదు. చేతిలోనున్న 'నేడు' సత్యము కనుక తనివిదీర మదిరాపానమొనర్చి మరులుగొలుపు మత్తకాశినులతో మహానందలీల దేలియాడి తృప్తిదీర భోగము లనుభవించుట మేలని ఖయ్యాము తత్త్వము. ఖయ్యాము కోరిన కాంతాభోగము ముక్తికాంతతోడి సుఖమనియు మదిర భగవత్పరమైన చింతనామృత మనియు తాత్త్వికులు నిర్వచింతురు. ఈ సూఫీ తత్త్వములోని నిగూఢాంశము హైందవ భక్తిమార్గములోని మధురభక్తి ప్రభావజన్యమని విజ్ఞులమతము, చార్వాకుని సిద్ధాంతముల బోలియున్న సిద్ధాంతములలోని అంతరార్థమిది యని పండితులు వ్యాఖ్యానింతురు.

ఏది ఎట్లున్నను ఖయ్యాము తత్త్వము ప్రపంచములోని సహృదయుల నాకర్షించినది. ఖయ్యామ్‌నకు ప్రపంచవిఖ్యాతి నార్జించిపెట్టినది ఫిట్జరాల్డు ఆంగ్లానువాదము ఖయ్యామ్ తత్త్వము నొక వ్యాసరూపమున ఈ పండితుడు 1858లో చాటి 1860 ప్రాంతమున డెబ్బదియైదు రుబాయీల నాంగ్లమునందనువదించి ప్రకటించెను. ఈ అనువాదము ప్రపంచవ్యాప్తి నొందినది. లక్షలకొలది ప్రతులు వెలువడినవి[1]. దాదాపు అన్ని ప్రపంచభాషలందును ఖయ్యామ్ రుబాయీ లనువదింపబడినవి.

దాతార్‌గారు ఖయ్యామ్ రుబాయిల నన్నింటిని ఆంగ్లానువాదముతోడను విపులమైన పీఠికతోడను బ్రకటించిరి. ఖయ్యామ్ రుబాయిల సంఖ్యనుగూర్చి పండితులలో భిన్నాభిప్రాయములు కలవు. ఖయ్యాముపేర రుబాయీలను రచించి చేర్చినవారును పెక్కురు కలరు. వేమన పద్యసంఖ్యవలె ఖయ్యామ్ రుబాయీల సంఖ్య పెరిగినది ఖయ్యామ్ రుబాయీలను కొందఱు పాక్షికముగను, మఱికొందరు సంపూర్ణముగను ఆంధ్రీకరించిరి.

పానశాల: ఖయ్యాము తెలుగుఅనువాదములలో పెక్కు ఫిట్జెరాల్డు అనువాదము ననుసరించినవి. పారశీకమునుండి ప్రత్యక్షముగ ననువదించిన వారిలో ఆదిభట్ల నారాయణదాసు, దువ్వూరి రామిరెడ్డి, డా. బూర్గుల రామకృష్ణరావు ప్రభృతులు ప్రముఖులుగ గన్పట్టుచున్నారు. వీరిలో దువ్వూరి రామిరెడ్డిగారి అనువాదమే విశిష్టమైనది. ఉమరు ఖయ్యాము తత్త్వమును రమణీయముగను, రసవంతముగను ననువదించుటలో రామిరెడ్డిగారిని మీరినవారు లేరనుట అతిశయోక్తి కాదు.

రామిరెడ్డిగారు సంస్కృతాంధ్రభాషలందు పరిణతప్రజ్ఞను సంపాదించుకొనినవారు పారశీకపండితులు. ద్రాక్షాగుళుచ్ఛమువలె వీరికవిత మాధురీగుణభూయిష్ఠము. రసవత్కవితను ప్రసాదించి కవికోకిలయినారు. ఒకవిధముగజూచిన ఉమరు ఖయ్యాము కంటె రామిరెడ్డిగారి అనువాదము మధురముగ దోచును. పారశీకముకంటె మాధుర్యమున తెలుగుబాస మించుటయు నందును రామిరెడ్డిగారి రమణీయభావుకత మేళవించుటయు నిందులకు కారణములు. రెడ్డిగారు గ్రంధారంభమునందు ఖయ్యామ్ ప్రశంస యొనర్చుసందర్భమున తెనుగుతీయందనము నిట్లు ప్రశంసించిరి.

---

1. ఇటీవల అమీర్‌కబీరుగారు ఖయ్యాము రుబాయిలను మాతృకతోపాటు ఫిట్జెరాల్డు అనువాదము, ఫ్రెంచి జర్మనుభాషల అనువాదములతో బ్రకటించిరి. ఈరాణ్ ప్రచురణము 1963.

పారసికన్న శ్రావ్యమై పల్లవకోమలమై సుధారసం
బూరెడు మా తెనుంగునుడి నొప్పిదమౌను నీదుభావముల్.
ఏరిచి చేర్చి కూరిచితి నింపగు కావ్యము నోఖయామ నీ
పేరిట యూవదాంధ్రి పృథివీస్థలి శాశ్వతమై తనర్చుత౯.

పారసి మధురమైనభాష. తెలుగు మధురతరమైనభాష. ఖయ్యాముగారి బుల్ బుల్పాటలను కవికోకిల మించుటలో నాశ్చర్యము లేదు.

రామిరెడ్డిగారి మాతృకలోని సారమును తనగుండెనుండి పిండిన కవితాధారలో మేళవించినట్లున్నది. మూలమునకు విధేయులై మూలమునకు వన్నెలుదిద్దిన వీరి అనువాదవిధాన మతిరమణీయము. వీరి అనువాద రామణీయకతను అనువాద వైశిష్ట్యమును నిరూపించుటకు పద్యముల నన్నింటినే ఉదహరింపవలసివచ్చును.

ఖుర్షీదె కమందె సుబహ్ బర్ బామ్ అఫ్గంద్
కైఖుస్రవె రోజ్ బాదహ్ దర్ జామ్ అఫ్గంద్
మైఖుర్ కె మునాదియె సహర్ గహ్ ఖేజాం
ఆవాజయె సరెకో దర్ అయ్యామ్ అఫ్గంద్.

రామిరెడ్డిగారీ రుబాయి నిట్లనువదించిరి.

తరుణార్కుండు సువర్ణవాగురులచేతం బాదుషాహా దివం
బగు హర్మ్యోపరి గర్వగోళశిఖరప్రాంతంబు బంధించె; వా
సరవైఖుస్రువ, రక్తిమాసవము నాశాపాత్రి బూరించె; ని
ర్ధతి ఘోషించె మునాది మేల్కొలుపు ప్రాతఃపాన గూఢార్థముల్. 19

హర్మ్యోపరిగర్వగోళశిఖరప్రాంతంబు మూలమునకు మెరుగులు దిద్దినది. మూలమున కత్యంతసన్నిహితమయ్యు రమణీయతనొందిన అనువాదవిధానమిది. ఫిట్జెరాల్డుగారీ రుబాయి నిట్లనుసరించిరి. ఆంగ్లఅనువాదము అనువాదముకాదనియు, కేవలము అనుసరణరూపముననున్న స్వేచ్ఛానువాదమనియు ఈ రుబాయి ఆంగ్లానువాదమును పరిశీలించిన స్పష్టమగును.

Awake! for Morning in the Bowl of Night
Has flung the Stone that puts the stars to flight
And Lo! the Hunter of the East has caught
The Sultan's Turret in a Noose of Light. — 1

దాతారుగారి అనువాదము దీనివలె అనుసరణప్రాయముగ నున్నది.

The Sun has clasped our heads with beaming ray,
and in our heart His holy word displays;
Awake! like the early rising birds in choir
are singing thus thy secrets for the days. III-2

ఫిట్జెరాల్డుననుసరించిన రాయప్రోలువారి అనువాదమును రామిరెడ్డిగారి అనువాదమున తులనాత్మకముగ బరిశీలించినచో పారశీకరుబాయిని అనుసరించిచేసిన యనువాదవైశిష్ట్యము స్పష్టముగ గోచరించును. పై రుబాయిని రాయప్రోలు సుబ్బారావుగారిట్లనువదించిరి

లెమ్మా! నిశాకమండలు తరిఁ వడగా విసరెఁ ప్రభాతమం
దమ్మల దిఙ్మణికిఁ చకిత తారక లావల బాఱు కాంతి సూ
త్రమ్ముల యుచ్చులొడ్డెను సుతారిపు తూరుపువేటకాడు ర
మ్యమ్మగు పాదుషా కనకహర్మ్య శిఖాకలశాలిచుట్టునన్,

మధు.కల—1

ఫిట్జరాల్డు అనుసరణమునకు వెన్నెల వెలుగు గూర్చునది రాయప్రోలువారి అనువాదమగుచో ఖయ్యామురుబాయీల ద్రాక్షాసవమునందమృతము రంగరించినట్లున్నది దువ్వూరివారి అనువాదము. ఖయ్యాముభావములు శిరీషకుసుమకోమలములు. ఈ భావసౌకుమార్యమును రామరెడ్డిగారు కాపాడి అనువాదమునుకూడ మాయనిమల్లెలు గా నంతరించిరి.

ఖారీకె బజేరె పాయ్ హర్ హైవానేస్త్
జుల్ఫె సనమి వ అబూయ్ జానానేస్త్
హర్ ఖిష్తె కె బర్ కంగరిహ్ ఐవానేస్త్
అంగుష్తె వజీరె వసలే సుల్తానేస్త్

మాతృకయందలి మూడవపాదమును రామిరెడ్డిగారు భావానుగుణముగ పెంచి ఇట్లనువదించిరి.

కాలిడినంత గుచ్చుకొను కంటకముల్ ప్రియురాలి మోమునఁ
వ్రేలిన ముద్దుముంగురులొ! బిత్తరికన్బొమలౌనొ యేమొ! రా
జాలయ భగ్నగోపశిఖరావళి గన్నులగట్టు నిష్టకా
మూలలు పూర్వభూ భుజులమస్తము లౌనొ! వజీరువ్రేళులొ! —17

మూలమునకు సన్నిహితముగ నుండిఅందముగా ననువదించిన పద్యములిం దెన్నియో కలవు.

ఈఁకూజ చూమఁ ఆషిఖెజారె బూదస్త్
దర్ బందె సరె జుల్ఫెనిగారె బూదస్త్

ఈఁదస్త కెదర్ గర్దనె ఊమిబీని
దస్తేస్తె దర్‌గర్ధనె యారె బూదస్త

మూలమునందలి పదములనుకూడ వదలక భావమునకు లోటురానీయకుండ రమణీయముగ ననువదించుట శబ్దములపై సంపూర్ణాధికారముగల మహాకవులకేచెల్లును. ఈపద్యానువాదము యిందులకు తార్కాణముగ నున్నది.

ఆ కూజాయును నన్నుఁబోలె ప్రణయవ్యామోహమందెంది కాం
తాకమ్రాలకశృంఖలావలయబద్ధంబయ్యెఁ గాఁబోలు ముక్తా
నాకుందోఁచు దదీయకంధరను లగ్నంబైన చేకొండె మో
షాకంఠప్రమదోప గూహనసుఖా సంసక్తమంచుఖా సఖీ. —117

ఖయ్యాము భావసౌకుమార్యము మృణ్మయ మదిరాచషకములకుకూడ వచ్చినది. ఖయ్యామ్ ప్రియురాలితో సుకుమారముగ మాట్లాడునట్లు కూజాలు కుమ్మరితో సంభాషించును.

దీకూజగరి బదీద మందర్ బాజార్
బర్‌పారి గిలెలక్ హమీజద్ బిస్యార్
వఆఁగిల్ బజబానె హాల్‌బాలీ మీగుఫ్త్
మన్ హమ్‌చూ తొ బూద-అయ్‌మరా నేకుదార్

ఈ రుబాయిని రామిరెడ్డిగా రిట్లనువదించిరి.

"నిన్నటిరోజు కుమ్మరిని నేఁగనుఁగొంటి బజారువీధిలో
మన్నొకముద్రఁజేసి మడమం జెడదొ్రక్కుచునుండ వానితోఁ
దిన్నగ మందలించె నది దీనత "మెల్లగ నల్లఁదొ్రక్కుమో
యన్న యెఱుంగవేనను? నొకప్పుడు నీవలె నుందగాఁడనే" 118

ప్రకృతిలోని ప్రత్యణువునందును ప్రియురాలి ఛాయలుజూచిన ఖయ్యాము 'వుకత హృద్యముగానున్నది.

దర్‌హర్ దష్తికె లాలజారీ బూదస్త
ఆఁలాల జఖూనె షహర్‌యారి బూదస్త
హర్‌బర్గె బనషా కెజ్ జమీఁ మెవీద్
ఖాలీస్తె బర్‌రుఖె నిగారి బూదస్త

ఖయ్యాము మధురోహలకు రూపకల్పన మొనర్చినట్లున్నది దువ్వూరివారి అనువాదము.

పొలమున నేత్రపర్వముగ బూచిన రాగవతీసుమంబు శో
భలవిలసిల్లె బూర్వ నరపాలుర రక్తకణాలమండి యే
చెలియ నిగారపుం దళుకుచెక్కుల నేలిన పుట్టుమచ్చపై
వెలసెనొ నీలకాంత కనువిందొనరించెను బూలరెమ్మలన్. —19

ఖయ్యాము తత్త్వమునకు ప్రతీకగా నిలిచిన రుబాయిని రామిరెడ్డిగారు స్పష్టముగను మధురముగను జాటిన పద్యమిది.

జీవితసార్థవాహము విచిత్రగతిం బయనించు; నందులో
నీవొక రెప్పపాటయిన నెయ్యురతో సుఖమందుదేని మో
దావహ మంతకన్నఁగలదా? మధుపాత్రిక నందియిమ్ము సా
కీ! వివరించెదేల తిలకింపని రేపము? రేయిజారెడిన్. —27

* * *

జిలిబిలి కమ్మగప్పురపు జిన్నెల వెన్నెలగుత్తి తానులం
జిలుకుచుఁ జైత్రయామవతి చీరచెఱంగునఁ బూతఁపూచె; నె
చ్చెలి యిటువంటి కాలమికఁ జిక్కదు; భోగ్యము మద్యమెన్ని ల
క్షల నమలీనిశాప్రియుడు కాంతులనో మనగోరి మిట్టలన్. —26

* * *

కమ్మని పిల్లతెమ్మెరల కౌగిళులం బులకించి వాసనల్
చిమ్ముగులాబి; బుల్బులి హసించు సుమంబుల రామణీయకం
బిమ్ముగఁ గ్రోలి మైమఱచు; నేల విలంబము? పాత్ర నింపరా
రమ్ము లతాంగి యిద్దఱము రాలక పూర్వమె పూలపోలికన్.

* * *

పరమొగిరమ్మొ దాని తలపైనొక దోసెడు మన్ను చల్లి సుం
దరి మెఱుగుంగపోలములు దాఁచిన ముద్దులు దొంగిలించి సం
బరముగ శీధువానుము; నమాజులు పూజలుఁ జేయనేల? యె
వ్వరయిన వచ్చినారె మృతివాటికకేగిన పూర్వయాత్రికుల్.

అనువాదమయ్యు స్వతంత్ర రచనగా భాసించునది ఉత్తమోత్తమమైన అనువాదమని విజ్ఞులందురు. ఈ అనువాద సూత్రనికషోపలమున బరీక్షించినచో రామిరెడ్డిగారిది పదార్వన్నె పసిడి యనుట కెట్టి సందేహములేదు.

తెలుగువారికి నూత్న వియోగగీతికల వినిపించి రసార్ద్రకవితాసవమిచ్చి అభినవకవితకు వెలుగుబాటలుచూపిన ఖయ్యాంను మనము విస్మరింపలేము.

దువ్వూరివారి అనువాదమునుగూర్చి మఱియొక ముఖ్యవిశేషము గమనింపదగినది. వీరి అనువాదము విశిష్టముగా వెలువడుట కీఅంశము ప్రధానమైనదనితోచును. కవికి అనుభూతి ప్రధానమైనది. వియోగభారమును కవితాముఖమున అనుభవించుట వేఱు. నిత్యజీవితమున ననుభవించుట వేఱు. రామిరెడ్డిగారి గుండెలోనిండిన వియోగభారము ఖయ్యాము అనువాదములో రసధునులై ప్రవహించినది.

''ప్రియావియోగ దుఃఖసమ్మూర్ఛితమైన'' రెడ్డిగారి చిత్తమును కాళిదాసుని మేఘసందేశము ఖయ్యాము రుబాయతు సంజీవనౌషధములవలె పునరుజ్జీవింప జేసినవని వారే స్వయముగ వివరించిరి వారి అనుభూతిని వారిమాటలలో వివరింతును.

''ఆ కాలమున వివక్తమైన సౌధోపరిస్థలము. రుబాయతు. నాకు ఏదుగడగ నుండినవి. 1926 అక్టోబరు నెల 10 వ తేదీ నాటి రాత్రి ఒంటిఘంట గడచిన నిద్ర పట్టకయుండెను. ఏ పుస్తకమును చదువ బోయినను మనస్సు దానిపై లగ్నమగుటలేదు. హృదయము కలకపాఱి నిరయసదృశమయి హేయములును ఘోరములును నగుభావములకు ఆలవాలమై యుండెను. నా హృదయముతో సరిపోలుటకో అనునట్లు ఆకాశము కూడ మేఘాచ్ఛన్నమై యుండెను. పై మేడమీది బయలులో కూర్చుండి దీపముపెట్టుకొని రుబాయతు చదువుచుంటిని. రుబాయతును ఆంధ్రీకరించిన బాగుగనుండునను ఉద్దేశముకలిగినది. ఒకటి రెండు రుబాయీలు తర్జుమా చేసితిని. అంతలో వానచినుకులు పడనారంభించెను. పడకగదిలోనికి పోయి తలుపువేసికొని నిదురపోవ ప్రయత్నించిచిని. ప్రయత్నించుకొలది నిదుర దూరమగుచుండెను. ఏమిచేయునదిలేక ప్రొద్దుపోడుచువఱకు రుబాయతు తర్జుమా చేయుచుంటిని.''

రామిరెడ్డిగారి అనువాదమున 125 పద్యములుకలవు. ఖయ్యాము రుబాయతులలో కొన్నిటియందు పునరుక్తులుకలవు. అట్టి పద్యములలోని భావములను ఒకచోట కుదించి కొన్నింటిని అనువదించిరి. 1926 నుండి 1958 వరకు పానశాల ఏడు ముద్రణముల నొందినది. అందమైన అనువాదమున కందమైన పేరు పానశాల. సహృదయులకు ఖయ్యాము కవిత్వాసవమును పంచిపెట్టు పానశాలఇది

నైషాపురములోని ఉద్యానవనములో గోడప్రక్క చల్లని వృక్షముల చ్ఛాయయందు ఖయ్యాముగోరీ కలదు. భక్తులు సహృదయులు ఖయ్యాము సమాధిని దర్శించి

పుష్పమాలలు సమర్పింతురు. ప్రతి వసంతమున పూచినపూవులు ఖయ్యాముసమాధిపై రాలుచుండును. మరణించినను మాయనివాసనల రుచిచూచుచున్న ఖయ్యాముధన్యుడు.

ఆదిభట్ల నారాయణదాసుగారు: వీరు బహుభాషాపండితులు. పారశీకము నుండియే వీరును అనువదించిరి. కవితాలత స్వేచ్ఛగా నల్లుకొనిపోవుటలో నందము గలదు. దానికి ఇనుపపందిళ్లు వేసినచో వికృతమగును. ఆదిభట్ల నారాయణదాసుగారు ఖయ్యాము రుబాయీలను అచ్చతెనుగులో ననువదించుట సమంజసముగా గన్పట్టదు. పదలాలిత్యమును భావసౌకుమార్యము నచ్చతెనుగున నిర్బంధముగా దర్శింపజేయుట వలన వీరి అనువాదము రసికలోకమున కానందమునుగూర్చలేక పోయినది.

తలపోదివిన తోడ్తోనే
చెలువుగ నీ బొమ్మలాట చెలగించు౯ దాఁ
దెలియుఁదెలుపు దెలిపించు౯
బలుమరు నావేల్పుకాని పనిలేదెదియు౯.

ఖయ్యాము రుబాయీలను వీరు సంస్కృతమునందును ననువదించిరి. తెలుగు అనువాదము 1932 లో బ్రకటితము.

తెలుగునను వేల్పుమాటల
నలబారసి రాచబాసయగు నాలుగు మో
ములకైతల నలరించుచు
నలుగడ మెప్పొందు నీవు నలువవు కావే.

అని నిడుదవోలు వేంకటరావుగారు వీరికిగల చతుర్భాషాపాండిత్యమును బ్రశంసించిరి.

మధుకలశము:—

ఫిట్జరాల్డునను సరించి ఖయ్యాము రుబాయీల ననువదించినవారిలో రాయప్రోలు సుబ్బారావుగారు విశిష్టులు. అభినవాంధ్రకవులలో పదలాలిత్యమునకు భావసౌకుమార్యమునకు రాయప్రోలువారు ప్రథమముగ నెన్నదగినవారు. ఫిట్జరాల్డు ఆంగ్లానువాదమునకు వన్నెకూర్చునట్టుగ నున్నది వీరి అనువాదము దువ్వూరి రామిరెడ్డిగారికి ఉమర్ ఖయ్యామ్‌తో ఆత్మీయత ఏర్పడియుండెను. రాయప్రోలు సుబ్బారావుగారిని ఉమర్ ఖయ్యామ్ ఆకర్షించుటకు రెండు కారణములుకలవు. ఒకటి వియోగశృంగారము. రెండవది సుకుమారమై నిర్మలమై స్వచ్ఛమైన ప్రణయచిత్రణము. వేదనాభరితమైన హృదయము. వియోగము హృదయక్షాళనమొనర్చి స్వచ్ఛతరమొనర్చును. రాయప్రోలు

వారు అమలినశృంగారరసచిత్రిణమునం దభిరుచికలవారు. ప్రాచీన ప్రబంధ శృంగార ధోరణికంటె భిన్నమై స్వచ్ఛమైన శృంగార రసాభివ్యక్తికి వీరు సుముఖులు. వీరు రచించిన కావ్యములందిది అచ్చముగా బ్రతిబింబించును. ఉమర్ ఖయ్యాము వియోగ గీతికలు సోదరీ సోదరుల మాతా శిశువుల ప్రేమకు ప్రతీకలు కాకున్నను వ్యక్తీకరణలో నొకవిధమైన స్వచ్ఛత లాలిత్యముకలదు. ఈగుణమే ఖయ్యాము అమృతమును మధు కలశములో తెలుగువారికి పంచిపెట్టుటకు హేతువైనది.

రాయప్రోలువారు ఫిట్జరాల్డుకు సన్నిహితులై యున్నారు. వారి భావచ్ఛాయ లకు కవితాసౌరభమును గుబాళింపచేసిరి.

Ah, make the most of what we yet may spend,
Before we too into the Dust descend;
Dust into Dust and under dust, to lie,
Sans wine, sans Song, sans Singer and Sans End!

మనమును మంటిక్రిందపడి మాయకపూర్వమె లబ్ధమైన గా
ని ననుభవింపజెల్లు తరుణీ! అటుపిమ్మట ధూళి ధూళితో
నెనసి యణంగిపోవు మధువెందును, పిమ్మట గానమాగు గా
యనులును నిద్రవోదురు, లయ్యశ్రుతులున్ చెవికందవాపయిన్. 23

మూలమునిసుమంతయు విస్మరింపక సరసకవితాధోరణిలో రాయప్రోలు వారు అనువదించినారు. కొన్నికొన్ని పద్యములను వీరు ఆలంకారికముగననువదించిరి.

They say the Lion and the Lizard keep
the Courts when Jamshed gloried and drank deep
And Bahram, that great Hunter-the wild ass
Stamps o'er his Head, and he lies fast asleep.

ఎవరును శాశ్వతముగ నిలనేలినవారు లేరనియు, మదిరాపానమొనర్చి సుఖించుట యె మేలనియు బోధించిన ఖయ్యామ్‌గీతమును ఆంగ్లానువాదము ననుసరించి రాయప్రోలువారు ఇట్లనువదించిరి.

జముషిదు శీధుపానమున యశస్సుఖివేలిన, నేలలందు సిం
హములు నివంగులున్ తలుపున్యాయసభాక్రమమున్ండ్రు నేడు, బ్రై
రము; మృగయామదాంధుని శిరంబెట వ్రాలెనొ ఆయ్యెడన్ యథే
ఛ్ఛముగను త్రొక్కు-గార్దభము దానచలింపదు నిద్రనాతడున్. —17

gloried అను పదములోని భావమును "యశస్సుభిసేలిని"యనుట రమణీయముగ నున్నది. The great Hunter మృగయా మదాంధుడని అనువదించిరి. ఉమర్ ఖయ్యాము ఈభావమును వ్యక్తీకరించినవిధానమే రమణీయముగ నున్నది.

కొన్నికొన్నిపద్యములు ఆంగ్లపద్యములకు వ్యాఖ్యానప్రాయములుగ నున్నవి. భావవ్యక్తీకరణము మూలమునుసరించియే యున్నది.

Ah, my beloved, fill the cup that clears
To day of past regrets and future fears
To-morrow? - Why, Tomorrow I may be
My self with yesterday's sev'n Thoosand years

దీనికి రాయప్రోలువారి తెలుగుసేత యిట్లున్నది.

గతదివసపరిపీడనయు గాఢభవిష్యదపోహ భీతియున్
హతమొనరించు ఈమధువు నందపుగిన్నియ నిండనింపు; మీ
వితమున రేపురేపని తపించెద వుగ్మలి యెన్ని 'రేపు' లీ
క్షితిపయి నిన్నలందు కలిపెన్ గతకాలమయాబ్దకాళిలోఁ. —20

Past regrets ను గత దివసపరిపీడనమనుట– future fear ను గాఢ భవిష్యదపోహభీతియనుట–మూలమునకు వ్యాఖ్యానప్రాయమే. 'రేపురేపుఅని తపించుట' భావపటిష్ఠతకు తోడ్పడినది.

రాయప్రోలువారి అనువాదమునందు పెక్కుపద్యములలో నిట్టి అనువాద రీతియే కన్పట్టుచున్నది.

And we, that now make merry in the Room
They left and Summer dresses in New Bloom
Our selves must we beneath the Couch of Earth
Descend, our selves to make a Couch-for whom?

కులికెడు క్రొత్తశోభనపు కోకలు తాలిచి గ్రీష్మదూతి; న
వ్వుల తిరునాళ్ళలోన తనివోము గదేమనమిందు, ముందు రా
గిలిన ప్రియుల్ గతించిరి సఖీ! మనమేగమె యింక భూమిక్రిం
దల పవళించి ఎవ్వరికొ తల్పములౌదుము గామె యావలన్. —23

ఉమర్ ఖయ్యామ్[1] :—

ఉమర్ అలీషాగారు తమకు లభించిన ఖయ్యామ్‌ప్రతిలోని 720 రుబాయీల నుండి 714 రుబాయీలను 1926—1928 మధ్య ఆంధ్రీకరించియుండిరి. కాని వారిజీవిత కాలమున నిది ప్రకటితముకాలేదు. ఇటీవల ఈ అనువాదము రెండుమార్లు ప్రచురింప బడినది. వీరు ఉమర్ రుబాయీల నధికసంఖ్యలో ననూదితమొనర్చినందుననిది ఉమర్ సర్వతోముఖ పాండిత్యమును వివిధఅంశములపై అతనికిగల అభిప్రాయములను వెల్ల డించుటకు దోహదమొనర్చినది. ఉమర్ రుబాయీలకు కొన్నింటికి పాఠాంతరములు పెక్కుకలవు. ఉమర్ అలీషాగారు అట్టి పాఠాంతరములను కొన్నింటిని తమ అనువాద మునందు జేర్చుట గమనింపదగిన అంశము. సుర, దారిద్ర్యము, మధుప్రలోభము, ఈశ్వరుడు, నిరాశ, సౌందర్యము, కర్మఫలతో ప్రసంగము మున్నగు శీర్షికలలో ఖయ్యాము రుబాయిల అనువాదము ప్రకటింపబడినది. వీరిఅనువాదము మూలమునకు సన్నిహితముగా నున్నది.

లబ్ బర్‌లబె కూజ బర్దమ్ అజ్గాయతెఆజ్
తా జూ తలబమ్ వాస్తమె ఉమ్రెదరాజ్
బాషన్ బజబానెహాల్ మీగుఫ్త్ ఈఁరాజ్
ఉమ్రేచ తొ బూదఅయ్ దమే బామఁా సాజ్.

ఉమర్ అలీషాగారీరుబాయి నిట్లనువదించిరి.

ఆసఁ జషకంబుఁ బెదవుల నంటి యాయు
వెంతొ యభివృద్ధిసేయగా నెంచ, నదియు
నిట్టులనె; నేను నీవలె నెపుడొ నరుడ
నన్ను సేవింపు మింకఁ గొన్నాళ్ళు నీవు. —63

ఫిట్జరాల్డుగారి అనువాదమిది.

Then to this ear then Bowl did I adjourn
My lip, the secret well of life to learn
and lip to lip it murmur'd 'while you live'
Drink! for once dead you never shall return.

ఉమర్ ఖయ్యాము ననువదించునపుడు కొందఱు రుబాయీల కనుగుణముగ కందములను ఆటవెలదులను, తేటగీతుల నుపయోగించిరి. దువ్వూరి, రాయప్రోలుల

1. ఉమర్ అలీషాకవి గ్రంథప్రచురణ సంఘము వారిచే రెండవసారి ప్రచురింపబడిన ప్రతి—సరస్వతీప్రెస్ రాజమండ్రి ముద్రణము.

అనువాదములో వృత్తవైవిధ్యమంతగా గన్పట్టదు. ఉమర్ అలీషాగారు సందర్భానుసారముగ కందములు మున్నగువానిని గ్రహించిరి.

కుమ్మరి మట్టిని గాలన్
ద్రుమ్మగ నదిచూచి వానిగూర్చి వచించెన్
గుమ్మరి నీవలె మునునే
నిమ్మహి మానవుడ గౌరవింపుము నన్నున్. —61

మాతృకకు సన్నిహితముగ నున్నదని నిరూపించుటకీ పద్యమొక్కటిచాలును.

బర్సంగ్ జదమ్ దోష్ సుబూయె కాషీ
సర్మస్త్ బుదమ్ కెకర్దమ్ ఈఁ ఔబాషి
బామన్ బజబానె హాల్ మీగుఫ్త్ సుబూ
మన్ చూఁతుబుదమ్ తు నీజ్ చూఁమన్ బాషీ.

మదమున నేను బాపినయి మంజులరంజిత కాచకుంభమున్
బదములదన్ని తాతిపయి బాదితి, నన్నదిచూచి యిట్లనున్
మొదటఁ ద్వదాకృతిన్ మనుజుఁ బోలిన దానినె నేను నీవును
దుద కొకనాడు నావలెనె డొల్లినశింతువు నిక్కమిద్దరన్.

## బూర్గులవారి అనువాదము:—

డాక్టర్ బూర్గుల రామకృష్ణారావుగారు సంస్కృతాంధ్రాంగ్లభాషలతోపాటు అరబీ పారశీ ఉర్దూభాషలందు పాండిత్యమునుగడించిరి. పారశీక వాఙ్మయమునుగూర్చి వీరు కొన్నివ్యాసములుకూడ ప్రకటించిరి. ఉమర్ ఖయ్యామ్ తత్త్వమునుగూర్చి వీరు రెండుమూడు అమూల్యములగు వ్యాసములు 'సుజాత' యను పత్రికయందు ప్రకటించి యుండిరి. అవి సారస్వత వ్యాసముక్తావళిలో చేర్చబడినవి. 1927 ప్రాంతములో ఉమర్‌నుగూర్చి వ్రాసినవ్యాసములో సందర్భానుసారముగ ఉమర్ ఖయ్యామ్ రుబాయీల నుదహరించుచు వాటి తెలుగుఅనువాదముకూడ చేర్చిరి. ఈ పద్యములవలన వీరి అనువాద విధానము పరిశీలించుటకు వీలుకలదు.

ఉమర్ ఖయ్యామ్ తత్త్వపరిశీలనాత్మకముగనున్న రామకృష్ణరావుగారి వ్యాసములో దాదాపు ముప్పది రుబాయిల అనువాదము లుదాహృతములు. వీరు ఖయ్యామ్ రుబాయిలలోని భావమును మాయనీయకుండ యథామూలముగ ననువదించిరి.

ఉమర్ ఖయ్యామ్ చక్కని తార్కికుడు. పాపపుణ్యములనుగూర్చియు, భోగ లాలసతనుగూర్చియు, నరనారాయణులకుగల అద్వైతభావమును తర్క వాదముతో నిరూపించును. దీనరక్షకుడును పాపరక్షకుడునునగు భగవంతుని గుణములు నరులు పాపముచేయనిచో సార్థకములు కావట! ఇతని తర్కమును చూడుడు.

నాకర్ద గునాహ్ దర్ జహాఁ కీస్త్ బెగో
ఆఁకస్‌కె గునాహ్ నకర్ద్ చూఁజీస్త్ బెగో
మఁబద్కునమొ తుబద్‌ముకాఫాత్ దెహీ
పస్ ఫర్క్ మియానె మనొతు చీస్త్ బెగో.

ఈ రుబాయిని రామకృష్ణరావుగారు ఇట్లనువదించిరి.

ధరి నపరాధ మెవ్వడును తప్పియె జేయని వాడెవండు? యా
నరు డెటు లిజ్జగంబున మనఁ గలగెఁ దురితంబుజేయకే?
దురితము లేనొనర్చెదను దుష్టఫలంబుల నిత్తువీవు శ్రీ
హరి! మరి భేదమున్న నిసుమంత వచింపుము నీకు నాకునుఁ.

తన మధుపాత్రను బగిల్చి గులాబిరసమును మంటిపై చల్లిన నేరము భగవంతునిపై నారోపించి యతడే మత్తుడని నిరూపించినవిధము ఖయ్యాము తర్కమునకు పరాకాష్ఠ.

ఇబ్రీఖ్ మయెమరా షికస్తీ రబ్బీ
బర్మన్ దరెఐష్ రా బెబస్తీ రబ్బీ
బర్ ఖాక్ ఫిగందిమయె గుల్గూఁనె మరా
మన్ మస్త్‌నయమ్ వలెతు మస్తీ రబ్బీ.

మాతృకలోని సారమును తెలుగులో నప్లేదింపిన బూర్గులవారి అనువాదరీతి ప్రశంసార్హము.

ముక్కలుగా బగిల్చితివి మోహనమౌ మధుపూర్ణపాత్రముఁ
మక్కువగూర్చు భోగమణి మందిరద్వారము మూసినావు మేల్
చిక్కనిద్రాక్షలం దొరసిచిందు గులాబిరసంబు మంటిపై
గ్రక్కునజల్లి మత్తుడవుగావె హరీ! యెటు లేను మత్తుడఁ.

భగవంతుడు బానిసల సేవలే గోరనపుడు నరులు భగవంతు నేల బూజింపవలయునను ఖయ్యామ్‌ప్రశ్నకు సమాధానమిచ్చుట కష్టము. ఈకారణమున భగవత్సేవ

కంటె మదిరాసేవయే ఉచితమని సాఖీకి విన్నవించును. సర్వఫలప్రదుడగు ఈశ్వరుడు భక్తుల నెట్లునుబ్రోచునని ఆతని విశ్వాసము.

సాఖి ఖదహో కె కార్యాజస్త్ ఖుదా
దర్ రహమతె ఖుద్ బన్దనవాజస్త్ ఖుదా
మీఖుర్ బబహారో బారెతాత్ మెఖరోష్
కెజ్ తాఅతె ఖల్ఖ్ బెనియాజస్త్ ఖుదా,

సకియరో! పాత్రనింపు మొగి సర్వఫలప్రదు డీశ్వరుండు తా
సకలజనాళినిఁ తన విశాలకృపారసవృష్టి బ్రోచెడుఁ
పరికటవసంత సీధురసపానముజేసి దురింతమైన సే
వకత దొరంగు మా ప్రభువు బానిససేవల గోరదెన్నడుఁ.

భగవత్తత్వమునకు సంబంధించిన రుబాయిల అనువాదము లిందు పెక్కు గలవు. ఖయ్యాము తత్త్వమును యధాతధముగ తెలుగువారు గ్రహించుటకు వీరి అనువాదము తోడ్పడుననుట కెట్టి సందేహములేదు అతిశయోక్తులు, సొంతకల్పనములు, మూలాతిరిక్తవర్ణనలు వీరిఅనువాదమున గన్పట్టవు. వ్యక్తీకరణములో స్పష్టత ప్రధానముగ బరిశీలింపదగినది. అన్వయకాఠిన్య మెచటను గన్పట్టదు.

ఉమర్ ఖయాం[1]:—

మాధవపెద్ది, బుచ్చిసుందరరామశాస్త్రిగా రొనర్చిన స్వేచ్ఛానువాద మిది. దాదాపు 120 రుబాయీలను వీరనువదించిరి. ఉమరు, ఉదయరాగము. మధువు, పూఁదోట, సమీక్ష, చదువు గురువు, వేదన, కాలము, పర్యవేక్షణము. మధుఘటము మున్నగుశీర్షికలలో వీరిఅనువాదము కూర్పబడినది. ఫిట్జరాల్డు ఆంగ్లానువాదమునువీరనుసరించినారు. కొన్ని రుబాయీలలోనిభావము విపులీకరించియు, నాలుగైదు రుబయీల లోని భావముల నొకపద్యమునందు కుదించియు స్వేచ్ఛానువాద మొనర్చుట యీ అనువాదమునందలి విశిష్టలక్షణము.

నవనవంబగు జీవనము పరిసాదింప
విశ్వమంతయు బల్లవించు వర్షమున
జీవిజీవికిని ధారావాహికముగ
హృది రాగరస మావహిల్లు వర్షమున
అను నిమేషమ్ము నీ యధరబింబమ్ము

---

1. నవ్యసాహిత్య పరిషత్తు గుంటూరు. జూలై 1944.

పిలుచుచున్నటు వలపించు వర్ణమున
నలరు ద్రాక్షారసం బా పాత్రతోడ
ప్రేయసీ! తెచ్చి నాపెదవి కందిమ్మ
ఇకరాదు తిరిగిపోయిన నిమేషమ్మ
తత్‌క్షణమ్మె తెమ్మ ద్రాక్షారసమ్మ. పుట—6

ఫిట్జురాల్డు అనువాదముననుకరించి అనువదించినపద్యములలో నిదియొకటి.

And we, that now make merry ın the room,
They left, the summer dresses ın New bloom
Our selves must we beneath the Couch of Earth
Descend, our selves to make a Couch for whom

ప్రియజన మేస్థలిఁ విడిచిపెట్టెనో యీ మన కా స్థలమ్మె యా
శ్రీయమయి చూచితే యెటు వసంతనవోదయ రాగరంజితం
బయినదొ శయ్యగూర్పుము రయమ్ముగఁ గాలముతీఱిపోయి భూ
శయనమునొంది యింకెవరి శయ్యలమౌదుమొ యెల్లి నెచ్చెలీ.

మధుపాలిక:—

వి. ఎం. దాతార్‌గారు విపులమైన పరిశోధన మొనర్చి ఉమరు ఖయ్యాము రుబాయిలను ఆంగ్లానువాదముతో బ్రకటించియుండిరి. పాఠాంతరములు, ప్రక్షిప్తములు. ఖయ్యాముప్రశంస, అతని దేశకాలములు, జీవితవిశేషములు, రుబాయీల సంఖ్య, ప్రపంచభాషలలో వానిఅనువాదములు, పద్యసూచిక. ఖయ్యాముకవితావైశిష్ట్యం, మున్నగుఅంశములపై దాతారుగారు చక్కని పీఠికనుగూర్చిరి.

పారశీకమునుండి ప్రత్యక్షముగ ననువదింపనివారు సాధారణముగ ఫిట్జురాల్డు అనువాదమునే అనుసరించియుండిరి. దాతారుగారి ఆంగ్లానువాదముననుసరించి స్ఫూర్తిశ్రీగారు ఖయ్యాము ననువదించిరి. వివిధశీర్షికలలో బ్రకటింపబడిన ఖయ్యాము రుబాయిల అనువాదము స్రవంతిలో బ్రకటితము.[1] ఇటీవల వీరనువదించిన 249 పద్యములు మధుపాలిక అనుపేర గ్రంథరూపమున వెలువడినది.

ఫిట్జురాల్డువలె దాతారుగారుకూడ కొన్నిరుబాయిలను స్వేచ్ఛగా ననువదించిరి. దీనిననుసరించిన స్ఫూర్తిశ్రీగారి అనువాదమునందు ఖయ్యాము వైశిష్ట్యము పాక్షికముగ గోచరించును. మూలమును స్వతంత్రముగ ననువదించినప్పుడు ఇదితప్పదు.

1. స్రవంతి: జూలై 1956. నవంబరు. డిసంబరు 1957 సంచికలు.

ఖయ్యాము ఇస్లామ్‌మతమునుగూర్చియు, ప్రవక్తనుగూర్చియు వచించిన రుబాయిలను పరిశీలింప అతడు కేవలము ప్రాపంచిక భోగములగూర్చి వచింపలేదని స్పష్టమగును. భగవంతునిగూర్చియు, మహమ్మదు ప్రవక్తనుగూర్చియు ఆతనికిగల భక్తిపారవశ్యమందు గోచరించుచున్నది.

ఐజాతె తుదర్ దొకౌణ మక్సూదొ వజూద్
నామెతొ మహమ్మద్ వ మఖామత్ మహమూద్
దిల్ బర్‌లబె దర్యామెషఫాఅత్ బస్తమ్
వజ్దీద రవాం మీకునమజ్ దీదదురూద్.

దాతారుగారీ రుబాయి నిట్లనువదించిరి.

Thon art ın both the worlds creatıon's lıght
Thy name Muhammad, Place ıs almost heıght
My heart reclınes on ocean of thy grace
My eyes are flowıng rıvers for they sıght.

రెండుజగమ్ము లందు ప్రసరించెడు సర్జనకాంతివీవు: నీ
వుండు నివేశ మున్నతము; యుష్మదుదారమహత్త్వ హత్త ప
న్నుండెద నాదరోదధిని; ఉత్తమనామ! మహమ్మదూ! కనుల్
రెండు ప్రవించుచుండెను సరిత్తులుగా నిను గాంచువాంఛమై.

స్ఫూర్తిశ్రీగారి అనువాదము ఆంగ్లమూలముననుసరించినది. భావమునకెట్టి లోటు కలుగనిరీతి వీరిఅనువాదము సాగినది. ఈ పద్యమిందులకు తార్కాణము.

నీ చెలికాండ్రు నీదరిని నిల్వగ. చేరగనీరు నన్ను; నీ
యాచనచేయు నూహమెయి నడ్డముల్నియు దాటినాను నా
లోచనమందు నీ కిరణలోకము పేరిచిచూపి తాత్మ లె
న్నో చరియింప నీకొరకు నుద్యతమైఖరి జ్ఞానభాస్కరా!

దీనికి ఆంగ్లమూల మిట్లున్నది:—

Thy frıends donot allow my reaching Thee
Thus harassed I have come beseeching Thee,
Thy beens, O Sunof wısdom, reach my eye
and show more souls than at oms, seeking Thee. 1-57

ఉమర్ ఖయ్యాం రుబాయీలు [1]:-

ఆంగ్లభాషతో పరిచయములేని మండువ జగ్గారావు అను తమమిత్రుల అభిలాష తీర్చుటకై చలంగారు ఫిట్జరాల్డు ఆంగ్లానువాదము ననుసరించి ఉమర్ ఖయ్యామ్ రుబాయిలను ఆంధ్రీకరించిరి. ఇవి కొన్ని వచనగేయ రూపములందును, మరికొన్ని కేవలము వచనమునందును కలవు. కొన్ని ఉదాహరణములు బరిశీలించినవో వీరి అనువాదము మూలానుసారిగనున్నట్లు స్పష్టమగుచున్నది.

"ఆ కేక విని పానశాల ముందు నుంచున్న మనుషులు అరిచారు.

"తొందరగా తెరవండి తలుపులు ఈలోకంలో మనబతుకు క్షణభంగురం. ఒకసారిపోయామా, తిరిగిరావడ మనేదిలేదు. కాలం పరుగెత్తుతోంది, తెరవండి తలుపులు, తొరగా తెరవండి." —7.

పాతేశిన నా వొంటి బూడిదలోంచి కూడా
ఎంతో హృదయాన్ని కట్టేసే పరిమళం గాలిలోకి ప్రవిస్తుంది.
ఆ దోవన పోయే ఎంతటి భక్తుడైనా ఆగి, లెలీక
ఏమిటా ఈ సుగంధమని తబ్బిబ్బుకావలసిందే. —72.

అమరకావ్యము:[2] ఫిట్జరాల్డుననుసరించిన శ్రీరామచంద్ర అప్పారావుగారి అనువాదమిది.

ఈ కొమ్మ నీడలో, ఈ పండు తునకతో
మధుర మధురపాత్రతో, ప్రణయకావ్యమ్ముతో
నీవు నాతోడ స్వర్గ గాన మాలాపింప
ఇంక ఈ విపినమే చాలు నందన వనము.

ఇతరానువాదములలో డా. చిలుకూరి నారాయణరావు, బలరామాచార్యులు, దొంతిరెడ్డి ప్రభృతుల అనువాదములు పేర్కొనదగినవి. ఇవి అన్నియు ఫిట్జరాల్డు అనువాదము ననుసరించినవి.

## —: సర్మద్ రుబాయిలు :—

సూఫీసర్మద్ పారశీలో దాదాపు 320 రుబాయిలను రచించెను. ఇవి సూఫీ తత్త్వప్రధానములైనవి. ఈ యోగి దిగంబరుడై సంచరించుచున్నందున 1070 ప్రాంత

1. బుక్ సెంటర్. విశాఖపట్నం— ఆగస్టు 1960
2. ఈశ్వర సం॥ శ్రావణము. శ్రీపతి ముద్రణశాల, కాకినాడ.

మున ఆలంగీరు ఆజ్ఞచే మరణశిక్ష నొందెనని కొందఱి అభిప్రాయము. కాని ఇతర కారణములును ఈలపట్టి శిక్షనొందుటకు కారణములని కొందఱు అభిప్రాయపడు చున్నారు. ఆలంగీరుపుత్రుడగు దారాషికోను సూఫీసర్మద్ తనపక్షములో నుంచుకొనెనట. ఈ సాహచర్యము ఆలంగీరుకు నచ్చలేదు.

ఉమర్ రుబాయీలకు పెక్కు అనువాదములు వెలువడినవి. కాని సూఫీ సర్మద్‌ను అనువదించినవారు డా. బూర్గుల రామకృష్ణరావు గారొకరే. సర్మద్‌తత్త్వ మునుగూర్చిన వ్యాసములో వీరు కొన్ని అనువాదముల నచ్చటచ్చట ఉదాహరించి యుండిరి. మొత్తము రుబాయిలను అనువదించి పరిష్కృతమొనర్చి ప్రకటింపవలయు నను సంకల్పమున రామకృష్ణారావుగారు ఉండిరి. కాని అది వారిజీవితకాలమున వెలు వడు భాగ్యమునకు నోచుకొనలేదు. ఉమర్ తత్త్వముతోపాటు సూఫీసర్మద్‌తత్త్వముకూడ తెలుగువారికి ఈ అనువాదము మూలమున సుపరిచితమగుననుటకెట్టి సందేహము లేదు.

## . . : షేక్ సాది : .

పారశీకసాహిత్యములో మహోన్నతస్థానము నలంకరించిన మహాకవి షేక్ సాది. నైతిక కవిత్వమునకు ప్రతీకగా నిలుచునట్టిది ఈమహాకవి రచించిన గులిస్తాన్ కావ్యము. షేక్‌సాది ప్రశస్తమైన ఈకావ్యమును తన 120వ ఏట రచించెనని విజ్ఞుల అభిప్రాయము. మౌలానా అల్తాఫ్‌హుస్సేన్‌హాలిగారు 'హయాతె'సాదీఅను గ్రంథము నందు సాదీజీవితమును అతని బహుముఖమైనప్రజ్ఞను వేనోళ్ళ ప్రశంసించియున్నారు. జీవితములోని అపార అనుభవమును తరచిచూచి శతాధిక సంవత్సరములలో గడించిన సాటిలేని లోకానుభవమును పరిణతప్రజ్ఞపు మూసలోబోసి మహోన్నతమైనకావ్యమును సృష్టించిన షేక్‌సాది పారశీక సాహిత్యమునందే కాక ప్రపంచ సాహిత్యమునందును స్వర్ణపీఠము నలంకరించుచున్నాడు. సాదీకవి మహోన్నత ఆదర్శములు, ఉదాత్తమైన కవితారీతులు తెలుగుకవుల నాకర్షించినవి. సాదీకవిత్వపు పాలవెల్లిలో మునకలువేసి, అమృతమునుచేపట్టి ఆస్వాదించుటకు ప్రయత్నించినవారిలో దువ్వూరి రామిరెడ్డిగారు అగ్రగణ్యులు. వీరు షేక్‌సాదీగారి గులిస్తానును గులాబితోటగను, బోస్తానును పండ్ల తోటగను తెలుగునాట నిర్మించిన మహాకవులు. వీరి అనువాదమునందలి విశేషములివి

రెండుమూడు సందర్భములందుతప్ప తక్కినభాగముల అనువాదమంతయు యథామూలముగ సాగినది. రామిరెడ్డిగారు మూలమునందలి వచనము వచనరూపము గను పద్యమును పద్యరూపముగను ననువదించిరి. మాతృకలోని భావమును కుదించుట కాని విస్తరించుటకాని సాధారణముగ కన్పట్టదు. సాదీకవిత్వములోని భావౌన్నత్యమును

నీత్యుపదేశమును. వ్యక్తీకరణవిధానమును రామిరెడ్డిగారు యథాతథముగ ననుసరించిరి. పారశీక పదబంధముల సొగసును చక్కని తెనుగు నుడికారములో వ్యక్తీకరించి అనువదించుట దువ్వూరివారి అనువాదమునందలి విశిష్టగుణమని చెప్పవచ్చును. మూలము నందలి భావముల నెట్టిమార్పులేక చక్కగ ననువదించిన భాగములలో ఒకటిరెండు ఉదాహరణములు.

ఒకానొక యువకుడు యౌవనగర్వమున తన తల్లినొకసారి దూలనాడెను. ప్రేమమూర్తియగు తల్లి తనపుత్రుని నర్మోక్తులతో మందలించినసందర్భము:-

వఖ్తె బజహల్ జవాని బాంగ్ బర్ మాదర్ జదమ్ దిల్
ఆజుర్ద బకనె బనష్త్ వగర్యాం హమి గుఫ్త్ మగిర్
ఖుర్దిఫరామోష కర్దికె దరష్తి మికని.
చగోష్ గుఫ్త్ జానె బఫర్ఙందె ఖలీష్
చుదీదష్ పలంగ్ అఫ్గన వ పలీతన్
గరాజ్ బహెచె ఖుర్దియత్ యాద్ ఆమ్దె
కె బేచార బూది దర్ ఆగోషె మన్
నకరిదరిం రోజ్ బర్మన్ జఫా
కె తుషేర్ మర్ది వమన్ పీర్జన్

యౌవనపుటజ్ఞానమున మా తల్లిని అరచి కసరితిని. ఆమె హృదయమున వేదనపడుచు ఒకమూల కూర్చుండి ఏడ్చుచు నిట్లనియె. "నీకు బాల్యము జ్ఞప్తియున్న యెడల నన్నిట్లు కష్టపెట్టియుండవు."

పులివలె శౌర్యంబు బలమును గల్గి
గున్నయేనుగు బోలు కొడుకును గాంచి
మనములో నిట్లనె ముదుసలి తల్లి
పాల్ద్రావి నాయెద బన్నున్ననాటి
నిస్సహాయస్థితి నీ స్మృతియున్న
గసరికొట్టను నన్ను; గాని యీనాడు
సింహసత్త్వుడ వీవు; జీర్ణాంగి నేను.

VI.6

ఒకభాషలోని నుడికారము నేఱొకభాషలోనికి తెచ్చుటకష్టము. సరియైనపదజాలము లభించనపుడు మూలమునందలి భావములను భావానువాదపద్ధతిలో ననువదించుట సమంజసముగ గన్పట్టును. ఒకటిరెండు సందర్భములందు పదానువాదము మాతృకకనుగుణముగ నున్నను స్పష్టతను గోల్పోయినది.

"సూఫీమతసామాజికుల సౌశీల్యమెట్టిదని నేనొక పెద్దమనుష్యుని అడిగితిని. ఆయన ఇట్లుచెప్పెను. వీరిలో నధముడు తనసొంతకార్యముల నటు కట్టిపెట్టి మున్ముందు స్నేహితుల యభీష్టము నెరవేర్చును. పండితులిట్లు చెప్పియున్నారు. "సొంతమునకు కట్టువడిన సోదరుడు సోదరుడును కాడు సొంతమును కాడు." "

పయనముందు తోడిబాటసారియు నిన్ను
వదలి గడచిపోవ వాడు హితుడె?
ఎడద సంకెల నీను నెవడుబంధింపడో
అట్టివాని చెలిమి కాసపడకు. II-42

''హుక్మా గుఫ్తంద్ బ్రాదర్ కె దర్ బందె షస్త్ నబ్రాదరస్త్ వన ఖవీషస్త్"

అనుభాగము ననువదింపపట్ల 'సోదరుడు సోదరుడునుకాడు' అనునంతవఱకు భావస్పష్టత కలదు. సొంతమునుకాడు అనునప్పుడు భావము సుగమము కాలేదు.

కొన్నికొన్నిసందర్భములందు దువ్వూరి రామిరెడ్డిగారు ఔచిత్యము, సభ్యతా సంస్కారములను దృష్టియందుంచుకొని కొంతస్వాతంత్ర్యము వహించిరి. ఒకఘట్టము నందు మూలమునందలి అలంకారమును యథాతథముగ స్వీకరింపక భావమునుమాత్రము భంగ్యంతరముగ ననువదించిరి. బూతులలో నీతులుచొప్పించుటలో సాదీ స్వాతంత్ర్య మువహించెను. అట్లువ్రాయుటకు సాదీకే చెల్లినది. నగ్నసత్యమును నగ్నముగా వెల్లడించినప్పుడు అనువాదకులు ఔచిత్యమును పాటించుట సమంజసముగ నున్నది.

"నీవేల పెండ్లి చేసికొనవు?" అని యొక ముసలివాని నడిగిరి. ''నాకు ముసలి దానిపై కోరికలేదు''.

''నీకు.భాగ్యమున్నది కావున యువతినే యేల పెండ్లియాడరాదు." ''ఏల యన అదియువతియేయైన నావంటిముసలాతని ఎట్లు ప్రేమింపగలదు'' అనిఆయనచెప్పెను.

డెబ్బదేడుల తాతయ్య నిబ్బరంపు
యౌవన రసానుభూతి పై నాసగొనుట
కలను నంధుండు కన్నులు గాంచినట్లు
తరుణిబలమును గోరు, నీ ధనముగాదు. VI-8

"జోర్ బాయెద్ న జర్ కె బాంవరా
గజరె దోస్త్ తర్ న దహమన్ గోష్"

పదిమణుగుల మాంసముకంటె ఒకగాజరిగడ్డ మేలని మూలమున గలదు. సాదీ అపారమైన లోకానుభవము కలవాడు. గాజరిగడ్డలోని పోషకగుణము మాంస తుల్యమైనదని ఒకఅర్థము. 'గాజర్' పురుషాంగమునుకూడ సూచించును. మాంసభూయిష్ఠమైన బృహత్కాయము కంటె శక్తి ప్రధానమైనదని సాదీ సరసముగ వ్యక్తీకరించెను. రామిరెడ్డిగారి సందర్భమున భావానువాదమొనర్చి "తరుణి బలమునుగోరు నీ ధనము గాదు"అనుటయు సముచితముగ నున్నది.

మాతృకలోని అలంకారమును స్వీకరించియు స్వల్పమైన మార్పుచేసిన ఘట్టములును ఒకటిరెండు రామిరెడ్డిగారి అనువాదమున గన్పట్టుచున్నవి.

అగర్ ఖనత్తల్ ఖురి అజ్ దస్తెఖుష్ఖవి—బఆబ్ షీర్నె అజ్‌దస్తె తర్షరవి.

పండితు లిట్లుచెప్పిరి — "జీవనామృతము అమ్మబడుచున్నను ప్రాజ్ఞులు ఆత్మగౌరవమును వెచ్చించి దానిని విడువరు. ఏలయన నీచముగ బ్రతుకుటకంటె గౌరవముతో మరణించుటయె యుత్తమము."

చిట్టెడేసిన పుట్టెడౌనట్టి మొగము
వాని చేతి రసాయన మానుకంటె
సంతసము వెలిబుచ్చెడు సరసుచేతి
చేదుసొరకాయ దినుటయె శ్రేష్ఠమగును. III-111

మూలమునందలి తర్షరవి భావానువాదమును సంతరించుకొనినది ఖుష్రవి అంతియ, ఏల్వా (మసాంబ్రిము) నకు మారుగ రామిరెడ్డిగారు చేదుసొరకాయ అని ప్రయోగించిరి.

భావానువాదమునకు మఱియొక ఉదాహరణము. దీనిని ప్రత్యేకముగ పరిశీలింపవలసియున్నది. మాతృకలోని విశిష్ట సంప్రదాయసూచకములగు భావములనుకాని విశిష్టవర్ణనలనుకాని వదలివేయుట కొన్ని సందర్భములందు ఉచితమనిపించదు. విజాతీయ భాషాకావ్యములోని అపరిచితములగు ధర్మముల నట్లే అనుపదించుటవలన నితరదేశములలోని ప్రత్యేకలక్షణములను ఆ జాతిలో పాతుకొనిన విశిష్టగుణములను గ్రహించుటకు వీలగును సాధారణముగ ననువాదకులు అపరిచిత పురాణగాధలను సంప్రదాయవిశేషములను మార్చుచుందురు. దువ్వూరి రామిరెడ్డిగారు అట్లే యొనర్చిరి.

రాళ్ళలో వెండిబంగారు ప్రభవమయ్యు
అవిలభించునె ప్రతి రాతియందు మనకు
స్వాతిచినుకులు పలుచోట్ల బడియు శుక్తి
గర్భమున యందె ముత్య మావిర్భవించు. VII-6

'సహేల్' ఒకనక్షత్రము. వేసవిలో ఉదయమునందును చలికాలమునందు రాత్రిలందును నిది ఉదయించును. యమన్ ఇతరప్రాంతములకంటె ఎత్తులోనున్నది కినుక అచట మొదటకనిపించును. యమన్‌వాసులు ఎత్తయినప్రదేశములందు దాదాపు నలువదిరోజులవఱకు చర్మములను ఆరిబెట్టుదురు. ఈనక్షత్రకాంతిప్రభావమున చర్మమునందు చక్కనిరంగు, సుగంధము ఏర్పడును. మూలమునందలి దృష్టాంతముతో తెలియనగు ఈ విశేషాంశములు అనువాదమునజేర్చినచో క్రొత్తవిశేషములు గ్రహించుట కవకాశముండును. రామిరెడ్డిగారీఘట్టమును సంప్రదాయపూర్వకమైన దృష్టాంతములస్వీకరించి అనువదించిరి. భావమునకుమాత్రము ఎట్టిభంగము వాటిల్లలేదు.

స్వల్పములగు ఇట్టిమార్పులు తప్ప గులాబితోటలోని పద్యరచన, అనువాద విధానము సాదీహృదయమునకు దర్పణమువలె నున్నది ఉమర్ ఖయ్యాము రుబాయీల అనువాదమువలె రెడ్డిగారి గులిస్తాన్ అనువాదముకూడ ప్రశస్తమైనదని చెప్పుట కెట్టి సందేహములేదు.

## గాలిబ్ గీతాలు:

పందొమ్మిదవశతాబ్ది ఉర్దూసాహిత్యములో అత్యున్నతమైన స్థానము నలంకరించినవారు మహాకవి గాలిబ్. ఉరుదూ పారశీకములం దపారమైన పాండిత్యమును సంపాదించినవాడు. పుట్టుకవి పదునొకండవఏటనే ఉర్దూపారశీకములందు చక్కనికవిత్వమును చెప్పినవాడు. కైతలరాణియే అతని వరించివచ్చినది. గాలిబ్ లేఖిని ఇరువైపుల వాడిగలది. పద్యరచనయందును, వచనరచనయందును నితడు సిద్ధహస్తుడు. గజల్ కవితాసంప్రదాయమునకు గాలిబ్ సార్వభౌముడనవచ్చును. ప్రణయ, సూఫీతత్త్వములతో నిర్భరమైన సంప్రదాయపూర్వకమైన గజల్‌రచనకు క్రొత్తరుచుల గల్పించినవాడు గాలిబ్. అపారమైన ప్రాపంచికానుభవము, జీవితములోని కష్టసుఖములు వ్యక్తిగత అనుభూతులు మున్నగునవి గాలిబ్‌గజళ్ళకు నూత్నజీవము నొసగినవి.

మహాకవి గాలిబ్ నిష్కపటమైన హృదయముగలవాడు, స్వతంత్రప్రవృత్తి కలవాడు, స్వేచ్ఛాజీవి. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామమున నిరంకుశ బ్రిటిషు ప్రభుత్వము నెదిరించుటకు పరోక్షముగ పనిచేసినవాడు. జీవనభృతిని ప్రభుత్వమువారు ఇచ్చుటకు మానివేసినను నోరెత్తినవాడు కాడు. జీవితములో వచ్చిన కష్టములను తాద సిల్లినకష్టములను చిరునవ్వుతో నెదుర్కొనినాడు. మృత్యువుతో పోరాడుటకైనను వెనుదీయలేదు. తనకునచ్చిన సిద్ధాంతమునుండి ఒక అడుగైనను వెనుకవేయుటకు అంగీకరించని ధీరుడు, స్థిరసంకల్పుడు. కాసులేకున్నను దర్జాగా మహారాజువలె జీవించిన

రసికుడు. స్వర్గ నరకములగూర్చి పాప పుణ్యములగూర్చి అతని దృక్పథమే వేఱు. పానశాలా ప్రాంగణము, సుందరాంగులగోష్ఠి అతనికి స్వర్గద్వారములు. ప్రేయసి కాటుకకన్నులే పుణ్యభూములు.

సర్వవిధముల విశిష్టమైన వ్యక్తిత్వము గాలిబ్ కవిత్వమున కూడ దర్పణము నందువలె ప్రతిబింబించుచున్నది. అతని కవిత్వమునందును ఇతరులయందు లేని వైశిష్ట్యము గోచరించును. భావసౌకుమార్యముతోపాటు భావగాంభీర్యము, మహోన్నత శైలిలో భావవ్యక్తీకరణము, ఉపమాదృష్టాంతపూర్వకముగ సిద్ధాంతప్రవచనము, భావ క్లుప్తత, సామాన్యపదములతో నుదాత్త భావ వ్యక్తీకరణము, ఉక్తివైచిత్ర్యము, వ్యంగ్య చమత్కృతులు, హృదయకుహరములోని భావములకు చక్కని రూపకల్పనము, శిరీష కుసుమపేశలమైన రీతిలో ప్రణయభావములను వ్యక్తీకరించుట మున్నగునవి గాలిబ్ కవిత్వములోని విశిష్టగుణములు.

ప్రబంధ శృంగారముతో తికమకపడుచున్న తెలుగుకవులకు ఉరుదూలోని ప్రణయకవితాచిత్రణము క్రొత్తయనిపించినది. కవులకు ఇరుగుపొరుగు భాషలలోని క్రొత్తదనమును రుచిచూచు సంకల్పముకలిగినది. కేంద్ర, రాష్ట్ర సాహిత్యఅకాడమీలు ఈ విషయమున జేయుచున్నకృషి కవుల నాకర్షించినవి. కవితకు భాషాపరిధులు లేవని విశ్వసించు ఉదారాశయులగు కవులకు అన్యసాహిత్యసౌందర్యమును దర్శించవలయునను ఆకాంక్ష కలిగినది. ఈ ఆకాంక్ష ఫలితమే గాలిబ్ తెలుగునేల నవతరించుట.

గాలిబ్‌వలె విశిష్టమైన వ్యక్తిత్వము కలవారు దాశరధిగారు. స్వేచ్ఛా స్వాతంత్ర్యములన్నను. ప్రణయకవితా రీతులన్నను హృదయము గోదావరివెల్లువ వలె పరుగులెత్తుచుండును. దాశరధి వ్రాసిన ''వలపు పాట''లందును. ప్రణయగీతికలందును ఇటీవల వెలువరించిన "కవితాపుష్పక"గేయములందును ఉర్దూగజళ్ళలోని ప్రణయచిత్ర ణచ్ఛాయలు గోచరించుచున్నవి.

దాశరధి వ్యక్తిత్వము కొంతవఱకు, గాలిబ్‌కు సన్నిహిత మగుటవలనను, స్వయముగ మహాకవి యగుటవలనను గాలిబ్ గీతములలోని ఆత్మీయత అనువాదము నందును ప్రస్ఫుటముగ గన్పట్టుచున్నది. ఈకారణముచేతనే దాశరధిఅనువాద మంతగా ప్రశస్తినొందినది.

గాలిబ్ గజళ్ళలో తనకునచ్చిన కొన్నిపాదములను, మక్తాలను ఏరి దాశరధి అనువదించెను. ఈ ఒక్కఅంశమే దాశరధి మహాకవిగా వహించిన స్వాతంత్ర్యమును

నిరూపించుచున్నది. ఒకటిరెండుపాదములు నచ్చినవిగదా యని మొత్తము గజలునే అనువదించుటకు యత్నించలేదు. మాతృకను యథాతథముగ ననువదించినపట్ల కూడ దాశరథి తనఅభిరుచినే ప్రధానముగ నెన్నుకొనెను. గాలిబ్హృదయమును తనకుతోచి నట్లు తెలుగువారికి ఆవిష్కరించినాడు. మహాకవు లనువాదములొనర్చినచో నిట్టి విశిష్ట మార్గమునే అనుసరింతురు. ఉదాత్తభావమును క్లుప్తముగా కొన్నిమాటలలో వ్యక్తీక రించుట ఉర్దూకవితలోని ప్రధానలక్షణము. దాశరథి అనువాదముకూడ ఈ సరణిలో, నడచినది.

తూనె మైకషి కీ ఖస్మ్ ఖాయిహై గాలిబ్
తేరే ఖసమ్‌కా కుఛ్ ఏతబార్ నహీ।

దాశరథి ఈ పద్యపాదములను అట్లే అనువదించెను.

గాలిబా! త్రాగనని శపథాలుసేతు
గాని నీఒట్లుపై నమ్మకమ్ము పోయె. —91

కొన్నిచరణముల ననువదించుపట్ల మూలములోని భావమునుమాత్రమే వ్యక్తీ కరించెను కాని మాతృకలోని పదములకు తెలుగుపదములు కూర్చలేదు.

బేదరొ దీవార్‌సా ఎక్‌ఘర్ బనానా చాహియే
కోయి హమ్సాయ నహో ఔర్ పాస్బాఁ కోయి నహో

ద్వారబంధములును తలుపుతాళములేని
ఇరుగుపొరుగు లేని యిల్లువలయు. —57

జిక్ర్ ఉస్ పరీవష్ కా ఔర్‌ఫిర్ బయాన్‌అప్నా
బన్‌గయా రఖీబ్ ఆఖిర్ జో రాజ్దాఁ అప్నా

అప్సరసను వోని ఆమెను వర్ణింప
శత్రువయ్యె నాదు మిత్రవరుడు.

మున్నగు పద్యభాగము లిందుల కుదాహరణములు. దాశరిధికి శబ్దచమత్కృ తులకంటె అర్థగాంభీర్యము పట్ల ఆసక్తిమెండు. గాలిబ్ కొన్నికొన్ని చరణములందు శ్లేషచమత్కృతులతో రసాభివ్యక్తి యొనర్చెను. దాశరథి అట్టి చరణములను సామాన్య రీతిలో మాత్రమే అనువదించెను.

పూఛేహైఁ కె ఓ గాలిబ్ కౌన్‌హై
కోయి బత్లావొకె హమ్ బత్లాయెఁ క్యా

ఇట గాలిబ్ శబ్దములో శ్లేషచమత్కారము కలదు.

గల్‌బా హాసిల్‌కర్నేవాలా = గాలిబ్‌అని చమత్కారము. ఇది అనువాదమున లోపించినది.

గాలి బెవ్వడంచు కాంతప్రశ్నించిన
నేమి ఉత్తరము నీయవలము. —374

గాలిబ్ ప్రణయభావ వ్యక్తీకరణములు వ్యంగ్యపూర్ణములు. సుకుమారరీతిలో వెలువరించిన భావములను దాశరధి మాతృకానుసారముగ కవితాధోరణిలోననువదించెను

వాయిద ఆనేకా వఫా కీజియె ఎక్యా అందాజ్‌హై
తుమ్‌నె క్యోఁ సోంపిహై మేరే ఘర్‌కి దర్బాని ముఝె.

ప్రియురాలి నిరీక్షణలో కన్నులు కాళ్లు కాయలుగాచినవి అని కవిభావము, ప్రియురాలికి సుకుమారమైన మందలింపు.

వత్తునని రాక నా గృహద్వారమునకు
నన్నె కావలాగా నిల్పినా వదేమొ? —64

సీఖేహైఁ మైరుఖోఁ కె లియె హమ్ ముసవ్వరి
తక్రీబ్ కుఛ్ తొ బహర్ ములాఖాత్ చాహియే

అందగత్తెలతో ముచ్చటాడు కొరకు
చిత్రలేఖన విద్యన్నేరితిననేను. —67

## మీర్ కవితా మాధుర్యం.[1] :—

గాలిబ్‌సమకాలికుడు మీర్, గజల్‌సాహిత్యములో విశిష్టస్థానమును సంపాదించుకొనినాడు. సూఫీ వేదాంతము, సంయోగ వియోగశృంగారచిత్రణము, ఉక్తిచమత్కారము మున్నగునవి ఈతని గజళ్ళలోని ప్రధాన లక్షణములు. మీర్‌గజళ్ళలోని కొన్నిచరణములను దాశరధిగారు అనువదించిరి. గాలిబ్ గీతములందు కన్పట్టు అనువాదధోరణి యిందును కన్పట్టును. మీర్‌కవిత్వములోని భావసౌకుమార్యమును వియోగశృంగారచ్ఛాయలను దాశరధి యథాతథముగ ననువదించెను.

ప్రాణ మున్నంతవఱకు నాబాధ యుండు
మగువ ననుదోచె నను బాధ మాసిపోదు.

* * *

---

[1] కవితాపుష్పకం. పుట 39—41. డిసెంబరు 1966

రమణి దరిమీలితాక్షి గోళముల యందు
దండిగ నిషా: షాయము నిండియుండె.

## జఫర్ మధుతరంగాలు[1]:—

ఢిల్లీసుల్తానులలో చివరిప్రభువు బహదురు షాజఫర్. ఈతడు రాజకవి. గాలిబ్, మీర్ వంటి మహాకవులను తన దర్బారులో గౌరవించెను. జఫర్ చక్రవర్తి ఆంగ్లేయులనెదుర్కొని తనకుగల దేశభక్తినిచాటెను. ఆంగ్లసామ్రాజ్యము నెదుర్కొని పదవీభ్రష్టుడై ఎన్నియో కష్టనష్టములకు గురియయ్యెను. జఫర్‌కవి రచించిన గేయములలో నుత్తమములనిపించిన కొన్ని పద్యభాగములను దాశరధిగారు ఆంధ్రీకరించిరి. ప్రణయవియోగ మాధుర్యమును ఈ రాజకవి అతిసుకుమారరీతిలో వర్ణించెను. ఇవి హృదయములను ద్రవింపజేసి సహృదయుల నుదాత్తభావనాప్రపంచములో విహరింప జేయును. ఉర్దూభాషలో శృంగారచిత్రణములోని నాజూకుతనము అనువాదమునందును గన్పటును.

చెలిశిరోజపు టుచ్చులలో పడ
నట్టి హృదయము ఉన్నదా?
ఉచ్చులో పడి మరల బయటికి
వచ్చు హృదయము సున్నరా!

మెరుపుతీగవంటి తరుణివచ్చునటన్న
ఇంటి గ్రుడ్డిదీప మేలొ నవ్వె?
సాఖి కిలకిలనవ్విన సమయమందు
పానపాత్రిలు కలశముల్ పక్కుమనెను.

గోష్ఠినుండి ఆయమ జారుకొనుట తోనె
కనక దీపమె ఉరిపోసి కొనినదంట.

## అమ్జద్ రుబాయీలు

ఆధునిక ఉర్దూకవులలో అమ్జద్‌కవి విశిష్టస్థానము నలంకరించినాడు. సూఫీ వేదాంతతత్త్వప్రతిపాదకములగు ఈతనిరుబాయీలు ఉర్దూసాహిత్యమున కలంకారములు.

---

[1] కవితాపుష్పకం పుట 42—46 డిసెంబర్ 1966.

ఈ కవి హైదరాబాదువాసి. ఉపాధ్యాయుడుగ ఉద్యోగజీవితమారంభించి అకౌంటెంట్ జనరల్ ఆఫీసులో ఉన్నతపదవిని అనుభవించి ఉపకారవేతనము పొంది 1961 సంవత్సరములో దివంగతుడయ్యెను. జీవితములో ఎన్నియో ధక్కాముక్కీలు తినినవాడు. ఈతనికుటుంబము 1911 లో మూసానది వెల్లువపాలైనది. ఈతడుకూడ ప్రవాహములో కొట్టుకొనిపోయి కొందఱిసహాయమున బ్రతికిబైటపడెను. అమ్జద్‌కవికి నలువురుభార్యలుండిరి. ద్వితీయపత్నియగు జమాలున్నిసాసల్మా సాహచర్యమున ఈకవి వేదాంతిగా మారెను. అమ్జద్ సూఫీతత్త్వనిష్ణాతుడు, మహమ్మదీయుల సూఫీ తత్త్వమునకును హైందవ అద్వైతతత్త్వమునకును కొంత సామ్యముకలదు. అమ్జద్ వ్యక్తీకరించిన భావములు ఈఅంశమును నిరూపించును. వేమనవలె తత్త్వమును, నీతులను అలతి అలతిమాటలలో వ్యక్తీకరించెను. ఈకవిచెప్పిన నీతిప్రధానములైన రుబాయిలు బహుళ ప్రచారమునొందినవి.

ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీవారు అమ్జద్‌కవి రుబాయీల ప్రాధాన్యమును గుర్తించి కొన్నిరుబాయిలను శ్రీ సదాశివగారిచే అనువదింపజేసి ప్రకటించినారు.

సదాశివగారు రుబాయికి తగినట్లుగ ఆటవెలది తేటగీతిపద్యముల నెన్నుకొని అమ్జద్‌రుబాయిలను అనువదించిరి. మూలమునందలి భావములను వీరు పరిపూర్ణముగ తమ అనువాదమునందు వెలువరించిరి. అమ్జద్‌కవిత్వము నిరాడంబరమైనది. భావక్లిష్టతకాని అన్వయకాఠిన్యముకాని కన్పించదు. సదాశివగారి అనువాదముకూడ మూలముతో తాదాత్మ్యము పొందినట్లున్నది.

హర్‌చీజ్ కా నాభి బడి ఖోదౌలత్‌హై
బేఫికీ్రకా సోనాభి బడిదౌలత్ హై
ఇఫ్లాస్‌నె సఖ్తిమౌత్ ఆసాన్‌కర్ది
దౌలత్‌కా నహోనాభి బడిదౌలత్‌హై

రత్నమువంటి నీతిసూక్తి ఇది. సదాశివగారు ఈ రుబాయిని మూలముననుసరించి ఇట్లనువదించిరి,

అన్నిటిఁ ద్యజించు టొకటె మహాధనమ్ము
బాధలేని నిదురయే మహాధనమ్ము
పేదఱిమి మృత్యుబాధను బ్రిదులఁ జేసె
అల యకించనతయ సూ మహాధనమ్ము.

ఒకటిరెండు సందర్భములందు మాత్రము మూలములోని భావమును స్పష్ట ముగ గ్రహించుటకు అనువాదము తోడ్పడుటలేదు.

అబ్ ఓ నఖుమార్ హైన వో సాఖీహై
కైఫియత్ ఇష్క్ హై న ముష్తాఖి హై
తోడాథా జోఫూల్ మైనె కల్ సూఖ్ గయా
లైకిన్ అభి కాంటేకి ఖటక్ బాఖీహై

నేడు సాఖి లే దాకైపుకూడ లేదు
ఇపుడు పరిణయంబు లేదు తదీహ లేదు
కంటకంబువలని బాధ కలదుకాని
పూవు నిన్నదెంచితి వాడిపోయె నేడు.

చివరి రెండుపాదములందు అన్వయము సుగమము కాలేదు. నిన్నతెంపిన పూవు ఎండిపోయినది. కాని తెంపునపుడు కలిగిన ముల్లువలని బాధ పోలేదని మూల మునందలిభావము. మాతృక నాధారముగ గ్రహింపక అనువాదమునందలి భావమును స్పష్టముగ గుర్తింపలేము.

అజ్జద్ అపారమైన లోకానుభవము కలవాడు. ఈకవి నీతిసూక్తులిందులకు ప్రత్యక్షప్రమాణము. మనకు తెలిసినఅంశమునే మనమునకు హత్తుకొనునట్లు చక్కని కవితారూపమున వెలువరించుట అజ్జద్ కవిత్వములోని విశిష్టధర్మము. సదాశివగారి అనువాదము అజ్జద్కవిత్వమునకు ప్రతిబింబముగా నున్నది.

కమ్‌జర్ఫ్ గర్ దౌలతో జర్ పాతాహై
మానిందె హిబాబ్ ఉభర్ కె ఇతారాతా హై
కర్తేహైఁ జరాసీ బాత్‌పర్ ఫక్ర్ ఖసీస్
తినాకా థోడీసీ హవాసే ఉడ్‌జాతాహై.

అజ్జద్ నీతిసూక్తులలో ఇది విశిష్టమైనది. అల్పున కధికధనమబ్బినచో నీటి బుగ్గవలె పొంగిపోవునను సత్యమిందు చక్కగా వ్యక్తీకరింపబడినది. ఈ కవి స్వీక రించిన ఉపమానములు దృష్టాంతములు పాఠకులకు సుపరిచితములైనవియే. పై రుబా యిని సదాశివగా రిట్లనువదించిరి.

వెలితివానికి ధనము లభించెనేని
బుద్బుదంబు విధాన నుబ్బొంగుచుండు
అల్పవిషయాన గర్వింతు రధము లెన్న
గాలిలోఁ జిఱు పఱకయు దేలిపోవు.

నిగూఢవేదాంతతత్త్వమును ప్రతిపాదించుపట్ల అమ్జద్ చూపిననేర్పును సదా శివగారుకూడ ప్రదర్శించిరి.

నేను నీవహమను సురాపానమత్త
చిత్తులమః యువికిని బ్రదర్శించువార
మెటుల పొసగెడు నస్తిత్వ మిర్వురకును
నేనలేను కాదేని నీవైన లేవు.

మున్నగు పద్యము లిందుల కుదాహరణములు. ఉర్దూకవిత్వములోని విశిష్ట గుణములను అమ్జద్ రచనలోని గొప్పతనమును గ్రహించుటకు సదాశివగారి అనువాదము చక్కగా తోడ్పడును.

## మంజరి :—

గాలిబ్ కవితాసౌందర్యమును దర్శించిన తరువాత దాశరథిగారికి ఉర్దూగజల్ స్వరూపమును తెలుగులో ప్రవేశింపచేయవలయునను సంకల్పము కలిగినది. తెలుగు నందనవనములో ఇపుడే వికసించిన అపూర్వపారిజాతమంజరి ఈ మంజరి. ఈశీర్షికతో ఇప్పటికి మూడు నాలుగు గేయములు వెలువడినవి.

ఉర్దూపారశీగజల్‌లో కవులువిప్రలంభశృంగారమునే బహుళముగపోషించిరి. పారశీకప్రణయకవిత్వమునందు మధుపాత్ర, బుల్‌బుల్, సాఖి, మధుశాల, గులాబి తోట మున్నగునవి వైభవమునకు మధురభావములకు సంకేతములుగ నిలిచినవి. తొలి దశలో ఈ సంకేతము లిట్టిపరిమితపరిధిలో మాత్రము స్వీకరింపబడెను. భంగ్యంతరముగ పారలౌకిక తత్త్వవివరణమునకు భగవత్తనిరూపణమునకును ఇవితోడ్పడినవి. ఇక్బాల్‌వంటి మహాకవులు సంప్రదాయపూర్వకములగు ఇట్టి సంకేతములకు క్రొత్త ఊపిరి పోసి అందు జాతీయతా ముద్రవేసిరి. బుల్‌బుల్ స్వేచ్ఛాస్వాతంత్ర్యములేని బానిసకు పంజరము దాస్యద్వారబంధముగల దేశమునకు బుల్‌బుల్‌గీతములు, స్వేచ్ఛాస్వాతంత్ర్య ములకు ప్రతీకలుగ రూపొందినవి.

గజల్ విశిష్టధర్మమగు ప్రణయకవితామాధురిని. జాతీయధర్మసంవాసితమగు స్వేచ్ఛాస్వాతంత్ర్య భావచషకములో రంగరించి దాశరధి చక్కని గేయములను గజల్ పద్ధతిలో రచించెను. అంత్యనియమమును, రదీఫ్‌ఖాఫియా మున్నగు నియమములను వ్యక్తీకరణవిధానమును దాశరథి పారశీఉర్దూగజల్ సంప్రదాయమునను సరించి పాటించెను.

రమ్మంటే చాలుగానీ రాజ్యాలు విడిచిరానా
నీ చిన్నినవ్వు కోసంస్వర్గాలు గడిచిరానా.

* * *

కనులందు మంచులాగా కలలన్నికరగిపోగా
కావేరివోలె పొంగే కన్నీరు తుడిచిరానా
నీవున్న మేడగదిలో నను చేరనీయ వేమో
జలతారుచీర కట్టి సిగపూలు ముడిచిరానా
పగబూని కరికువారు బంధించి ఉంచినారు
ఏనాటికైన గానీ ఈగూడు పొడిచిరానా

ఈగీతమునందు రానా అనుపదము రదీఫ్, విడిచి అన్న పదము ఖాఫియా, 'రానా'అన్ని పంక్తులయందు ఒకవిధముగనే ఉన్నది. "విడిచి" గడచి, వడిచి, తుడిచి, అను మార్పులనొందినది. దుస్సహమైన వియోగముతో కృశించిననాయికవిలాపమిది. చివరిపంక్తులలో స్వాతంత్ర్యముగోల్పోయిన వ్యక్తియు, జాతియు స్ఫురించును.

నా ప తా :—

మంజరీగుచ్ఛము లోని ద్వితీయ కుసుమ మిది.

ఇన్నినాళ్ళకు తెలుపమంటివి
ఎందుకొరకే నాపతా

* * *

నిన్ను బోలిన కరినులకు నేనెన్నడైనా లాపతా,
అడిగినప్పుడు చెప్పకుండుట ఎడదగల నాకొప్పదు
ఏసమయమున ఎక్కడుండునొ వ్రాసుకోవే నాపతా
తెల్లవారే వేళ కమలము కళ్లు విప్పేటప్పుడు
బాలభానుడు తొంగిజూచే ప్రాగ్దిశాగ్రిము నాపతా

విరహజలనిధి దాటిరాగా ప్రియుడు కౌగిటచేర్చగా
పరవశమ్మున పైటజార్చిన సఖి భుజాగ్రము నాపతా.

*  *  *

పానశాలావరణమందున పాత్రదానము సేయగా
మధువునొసగే సాఖి లోచనరోచిరోగ్రము నాపతా.

నేనుచేయని నేరమునకై నిప్పులను విరజిమ్ముతూ
కోపభరమున తాపుతాచే సతిపదాగ్రము నాపతా.

పతా అనుపదమును రదీఫ్ స్థానమున్నందు ప్రయోగించి గజల్ గమకమును సంతరించుకొనిన ఈగేయమునకు దాశరథి కొత్తరుచుల గలుగజేసెను. ప్రణయనిర్భరమును విప్లవాత్మకమును అగుభావములను దాశరథి ఈ గీతమునందు రసవంతముగా చిత్రించెను. మత్లాకూడ క్రొత్త అందమునొందినది.

పానశాలా ప్రాంగణమున లీలావిహారమొనర్చుచు అందమైన పానపాత్రలో ప్రణయమధువునుప్రసాదించు లతాంగియగు సాఖీ కజ్జలరేఖాంచిత నేత్రాంచలములందు దాగినకవి కేవలముప్రణయమ్మునే చిత్రించలేదు. దేశములో విప్లవము వర్ధిల్లినపుడు వీర వర్యుల కనులలోని దవానలాగ్రముపైనను నిశ్చయముగా సంచరించును.

విప్లవము వర్ధిల్లువేళల వీరవర్యుల కనులలో
ధగధగాయిత నవదవానల కీలికాగ్రము నాపతా.

గజల్ చివరిపంక్తులను మక్తా అందురు. ఇందు కవి తన తఖల్లుస్ తెలుపుకొనును. దాశరథి ఈగేయమునందీ సంప్రదాయమునుకూడ పాటించెను.

ఎన్నడైనా ఎప్పుడైనా నిన్నుగూర్చే పాడెద
అంతకంటే "శరధి" గళమున ఏ తరానా లేదులే.[1]

గేయములోని ఈ గమకము తెలుగుగేయములకు క్రొత్తనడకలను, అందచందమును గూర్చినది.

ప్రేమార్చన:— (మిత్రమంజరి 1963)

ఉర్దూ కవితావీధులలో వినూత్నములైన రాచబాటలు నిర్మించినకీర్తి మహాకవి ఎక్బాల్‌కు లభించినది. ఒకవిధముగా పరిశీలించినచో సీతడు నవయుగ వైతాళికుడుగ

[1] ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక. 5—10—66

గిర్తింపబడుటకు సర్వవిధముల అర్హుడు. శతాబ్దముల తరబడి పరిజాహృదయమున పాతుకొనిపోయిన మూఢవిశ్వాసములను, మూఢభక్తి విధానమును ఎక్బాల్ పెవి నిశితముగ విమర్శించి దాస్యశృంఖలాబద్ధమైన జాతిని స్వేచ్ఛాస్వాతంత్ర్యవాయువులను బీల్చుటకు ప్రబోధగీతము లాలపించెను. విశ్చలమై, నిర్మలమై, ప్రేమపూర్ణమైనభక్తిమార్గమున దేశభక్తిని పోషించి శిలలబూజించి గుండెలనురాళ్ళుగ జేసికొనుటకంటెను, ద్వేషపూరితవాయువులను బీల్చుటకంటెను, హృదయపద్మమునుండి స్వచ్ఛమైన ప్రేమసౌరభమును గుబాళింపజేయుట తగునని ఈ మహాకవి నయాశివాలయ్ అను గేయమునందు సందేశమొసగెను.

ఈ గీతమునునువదించిన వారును ఎక్బాల్‌వలె విశాలదృష్టియు, మహోన్నతాదర్శములు కలవారును, కళాదృష్టికలవారును అగు మహాకవులు, అభినవాంధ్రకవితకు మూలవిరాట్టు ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు. మల్లెపూవువంటి మనస్సు మలినములేని అనురాగమునకు నాట్యరంగమనియు, తల్లిని ప్రేమించినట్లే మాతృదేశమును కూడ ప్రేమించవలయుననియు వీరి పరిబోధగీతముల సందేశము. కొన్ని సందర్భములందు రాయప్రోలువారి అనువాదము మూలవిధేయముగను, మఱికొన్నిసందర్భములందు భావప్రధానముగను, స్వేచ్ఛానువాదరీతిలోను సాగినది. స్వేచ్ఛానువాదముగల్గ సందర్భములన్నియు మూలమునకు వ్యాఖ్యానప్రాయములుగను పసిడికితావియచ్చినట్లుగను నున్నవి. ఎక్బాల్ గీతమునందలి భావౌన్నత్యము, కవితాశిల్పము, సందేశరామణీయకత మున్నగు విశిష్టగుణములను అనువక్తలు తమ అనువాదమునందు చక్కగా దర్శింపజేసిరి.

సచ్ కహెదూం ఏబ్రిహమిన్ గర్ తూ బురా నమానె
తేరేసనమ్ కదోంకే బుత్ హోగయే పురానే
అపోంసే బైర్ రఖ్నా తూనే బుతోంసె సీఖా
జంగోజదల్ సిఖాయా వాజ్‌కోభి ఖుదానే
తంగ్ఆకె మైనె దీర్ఘోహరమ్‌కో ఛోడా
వాజ్‌కావాజ్ ఛోడా తేరేఫసానే.

ఈ గేయభాగమును రాయప్రోలువా రిట్లనువదించిరి.

అలుగక విందువేని నిజమాడెద బ్రాహ్మణవర్య! నీదు దే
వళమున నున్నమూర్తుల ప్రభావ మభావమునందె చాల ప్రా
వడిన కతాన. ద్వేషగుణపాఠము లబ్బెను నీకుగూడ, మా
శిలల సమీపమందె మొలచెన్ గురుపీఠము సైత మావల౯.

తలపులు ధ్యానధారలు యథాయథలైన పెనంగొనెన్ మత
ప్రళయ వివాదవైరము, భరంబడి వేసటజెంది నీదు దే
వళమును, నా మసీదు, ననివార్యముగా త్యజియించితిన్ నమా
జులపిలుపున్ పురాణముల చోదనకూడ అపాకరించితిన్.

మూలమునందొకటి రెండు పాదములందు గల భావమును సుబ్బారావుగారు వ్యాఖ్యానప్రాయమొనర్చిన దానికిది ఉదాహరణము.

ఆ గైరియత్ కేపర్దే ఎక్ బార్ ఫిర్ ఉఠావేఁ
బిఛ్డోంకు ఫిర్ మిలావేఁ నక్షెదివి మిటా దేఁ

రమ్మిటు రమ్ము బ్రాహ్మణ! పరస్పరమున్ కననీని యీ తెరన్
బిమ్మము దూరదూరముగ, చీల్చినసూత్రము త్రెంచి, వీరలన్
క్రమ్మర కల్పివేయుదము రమ్ము! ప్రజన్ విడదీయు ద్వైత భా
వమ్మును పారదోలుద ముపాయముగా నిటురమ్ము వేగమే.

పదానువాదవిధానము ననుసరించియు, భావసౌకుమార్యమును, భావౌన్నత్యమును చెదరనీక రాయప్రోలువారు నరసరీతిలో అనువదించిరి.

సూని పడిహుయిహై ముద్దత్ సె దిల్కీ బస్తీ
ఆ ఎక్ నయా శివాలా ఇస దేస్ మే బనా దేఁ
దునియాకే తీరథోఁసే ఊఁచా హో అప్నతీరథ్
దామానె ఆస్మాఁ సే ఇస్కా కలస్ మిలా దేఁ

హృదయగృహంబు పాడువడియెన్ బహుకాలమునుండి, రమ్ము క
ట్టుద మొక నూత్నమందిర మిటుల్, జగతిందిల తీర్థయాత్రలం
దది మహిమోన్నతంబయి, సమస్త సుహృజ్జనపూజ కొక్కటే
పదమయి వెల్గుచుండును నభంబున తత్కలశాలి మ్రోయగన్.

తక్కిన పద్యములలోను మాతృకలోని భావము వివరణాత్మకముగ నున్నది. వ్యాఖ్యానరూపమున నున్నను అనువాదము కవితాశిల్పశోభితమగుట వీరిఅనువాదములోని విశిష్టధర్మము.

# కథాసాహిత్యము

చార్ దర్వేషుకథలు:—

నలుగురు పకీరులకథ అను నామాంతరమున బ్రకటింపబడిన చార్ దర్వేషు కథలు తెలుగుసాహిత్యములో ప్రసిద్ధమముగ పారశీకమునుండి ననూదితమైన కథా కావ్యము. పందొమ్మిదవ శతాబ్దియందు వచనరూపమున కథాకావ్యములు వెలువడుట, అందును పారశీకాది భాషలనుండి అనూదితములగుకథలు వెలువడుట ప్రధానముగ గమనింపదగిన అంశము.

చార్ దర్వేషుకథల ననువదించినవారు ఎఱ్ఱమిల్లి మల్లికార్జునులు. పారశీకకథా కావ్యమును క్రీ.శ. 1801 సంవత్సరంలో మీరుఅమ్మన్ అనుపండితుడు ఉర్దూభాషయం దనువదించి యుండెను. ఈ కథలు రమణీయముగను నాహ్లాదకరములుగను నుండుట వలన ఆంగ్లము మున్నగు భాషలందును పరివర్తనమునొందిన అంశమును మహారాజశ్రీ గోదేరాయనింగారు వినియుండిరి. విద్యావ్యాసంగము నిమిత్తము గ్రంథావలోకనమొనర్చు సందర్భమునందు వారిదృష్టి చార్ దర్వేషుకథలపై ప్రసరించినది. ఇట్టికథల ననువదించి నచో సహృదయుల కానందమును గూర్చునని వారుభావించిరి. వారిఅభీష్టము ననుస రించి మల్లికార్జునపండితులు 1881 సంవత్సరములో నాంధ్రీకరించిరి.

వీరి అనువాదము యథామూలకము. సరళమైన వ్యావహారిక భాషలోనిది అనూదితమగుట గమనార్హము. కథావస్తువివరణమునందుకాని పాత్రలనామములయందు కాని ఎట్టిమార్పు కన్పట్టదు. శైలి హృద్యముగ నున్నది. ఒకటి రెండు ఘట్టములను పరిశీలించినచో ఈ అంశము స్పష్టమగును.

"హాతేం దినములలో అరబ్బీదేశమునకు 'నవుఫరు'అనే పేరుగల పాదుషా అధికారియైయుండెను."

"నవుఫర్ యెదుటపడగానే యితణ్ణి ఎందుకుపట్టుకున్నారని అడిగితే. వక రాతిగుండెగల అబద్ధీకుడు ఇటువంటిపని తనకన్న మరియెవరు చేయగలరని ఈఫలితం తనకే గల్గినందున ఆకాశముమీద జండాపాతితి ననెను."

## తోతీనామా కథలు-కీరబహత్తరి:—

కథావాఙ్మయమున సంస్కృతమే ఇతరభాషలపై ప్రభావమును గలిగించినది. శుకసప్తతికథలు సంస్కృతమునుండి పారశీకాదిభాష లందనువదింపబడినవి. అవి తోతీనామాలనియు కీరబహత్తరి అనియు బ్రసిద్ధములు ఇవియే మరల తెలుగునందు మరల ప్రవేశించినవి. ఈ కథల లిఖితప్రతి యొకటి మదరాసు ప్రాచ్యలిఖిత పరిశోధనా గారమున గలదు (D No. 607) అనువాదము యథామూలము.

## యవనయామినీ వినోదకథలు :—

ఇవి 1889 లో బ్రకటితములు. ఈకథలు పాఠశాల విద్యార్థులకు పఠనీయ గ్రంథముగా నుండెను. ఈశతాబ్దమునందును ఈసబురథలు, ప్రష్యాదేశపు వడతియొక్క వినోదకథలు మున్నగునవి తెలుగులోవెలువడినవి. ప్రష్యాదేశపు కథలఅనువాదము ద్రవిడభాషద్వారా తెలుగునకు వచ్చినది. పుదుచ్చేరి రంగయ్యగారొనర్చిన ఈ అను వాదము 1902 సంవత్సరములో రెండుభాగములందు వెలువడినది

## బిచ్చమెత్తిన రాచబిడ్డ:—

ఖాజాహసన్ నిజామి చారిత్రికగాథలను రచించుటలో సిద్ధహస్తుడు ఈతడు 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానంతరము మొగలాయి ప్రభువంశజు లనుభ వించిన దీనస్థితిని కన్నులకు గట్టినట్లుగ కథానికల రూపమున జిత్రించెను అట్టి ఉరుదూ కథలనుండి ఒకకథను పి సీతాదేవిగా రాంధ్రీకరించిరి [1]

బిచ్చమెత్తిన రాచబిడ్డ అను ఈ కథయందు బహదురుషా కుమార్తె కరీంషా బేగమునకు గారాబుపట్టియగు సాహెబు ఆలంమీర్జా కమర్‌సుల్తాన్ బహదురు దుర్దశ చిత్రితము. బ్రిటిషువా రేర్పఱచిన పింఛను సరిపోనందున ఈ రాజకుమారుడు ఢిల్లీ వీధులలో రాత్రిపూట భిక్షాటనకై బయలుదేరుచుండెను. రాజవీధులలో దర్జాగా సంచ రించుచు ప్రజాకోటివలన సలాము లందుకొను రాజకుమారుడు తుదకు నిశాసమయమున ప్రజలనుండియే భిక్షను పొందవలసివచ్చినది. హంసతూలికా తల్పమున హాయిగా నిదురింపజేసి స్వర్గసుఖముల ప్రసాదించిన నిశలు తుదకాతని భిక్షాటనకు తోడ్పడవలసి వచ్చినవి కరుణరసాత్మకమైన ఈగాథ రాతిగుండెనైనను కరగింప జాలునట్టిది.

---

[1] ఈ అనువాదము భారతి సంపుటి 9— సంచిక 6 (1932) లో ప్రకటింపబడినది

## గోలకొండ కథలు:—

ఆధునిక ఉరుదూరచయితలలో లబ్ధప్రతిష్ఠులైన డాక్టర్ మొహిఉద్దీన్ ఖాదరీ జోర్ గారు గోలకొండచరిత్రకు ప్రభువులకు సంబంధించిన కొన్ని సంఘటనలను రమణీయములగు గాథలరూపమున వెలువరించిరి. ఇవి "సైరెగోలకొండ" అను కథానికా సంపుటము రూపమున ప్రకటింపబడినది. ఈ కథానికలు బహుజన ఆదరపాత్రము లైనవి. చాలాకాలమువఱకు ఈ కథానికల సంపుటి పాఠ్యగ్రంథముగ ఉండెను. ఇందలి గాథలను కొన్నింటిని డా. పల్లా దుర్గయ్యగారు అనువదించిరి. నేనుకూడ మిష్క్ మహల్, అనార్ కే చౌదాదానే అను రెండుకథలను అనువదించియుంటిని. దాశరథి ఈ కథలలోని కొన్ని అంశములను సాంపడీ అను కథలోని కొన్ని సంఘటనలను వస్తువుగా గ్రహించి రేడియోనాటిక వ్రాసియుండిరి. ఇది "నవమి" అను నాటికాసంపుటమున ప్రకటితము.

## ప్రేమచంద్ కథలు - నవలలు:

ఉర్దూ హిందీ భాషలలో పెక్కు నవలలు కథానికలు రచించి మున్షీ ప్రేమ్ చంద్ ఉపన్యాససమ్రాట్ అను బిరుదము నొందెను. ప్రేమచందుగారి రచనలు 1901 నుండి వచ్చినవి. నాటినుండియే ఉర్దూ హిందీసారస్వతములో వారిపేరు మ్రోగినది. వీరికథలు లొరిసారిగా జమానా అనుపత్రికలో ప్రకటింపబడినవి. ప్రేమచందురచనలలో మొదటివిశిష్టమైననవల గోదాన్. వరదాన్ చివరిది. కథానికలు శతాధికములు. ప్రేమ పచ్చీసి, ప్రేమబత్తీసి, ఆఖరీ తోహఫా మున్నగు కథానికాసంకలనములు ఎన్నియోవెలు వడినవి. ప్రేమచంద్ ఉరుదూలో వ్రాసిన కథలను నవలలను స్వయముగ హిందీభాష యందును ప్రకటించెను. చివరిదశలో రచించిన "మంగళసూత్రము" వంటి ఒకటి రెండుగ్రంథములు హిందీలోమాత్రమే వెలువడినవి.

ప్రేమచంద్ మానవతావాది. బాల్యదశనుండియు కష్టనష్టములకు గుఱియయ్యెను. జీవితములో అపారమైన అనుభవమును సంపాదించెను. ఈలౌకికానుభవము అతనిరచనకు నూత్నశక్తిని ప్రసాదించినది. సంఘసంస్కరణమునందును, మానవుని నైతికోన్నతియందును ప్రేమచందుకు అభిమానముమెండు. వ్యక్తిచిత్తవృత్తియందును, సంఘమునందును సంస్కారమత్యావశ్యకమని భావించినవారిలో ప్రేమచందు ప్రముఖుడు ఇతడెంతసంస్కారప్రియుడో అంత ఆదర్శవాది. మానవత్వము నష్టముచేసికొనుటయే మహావిద్యయని భావించినవాడు. స్వచ్ఛమైనప్రేమ శరచ్చంద్ర చంద్రిక వంటిదని అతనిమతము. ఇతని ఆదర్శవాదమునకు యథార్థవాదమునకును భేదమంతగాగన్పట్టదు.

స్వప్నలోకమునందుకాని, ఊహాప్రపంచమునందుకాని అతనికి విహరింపవలయునను ఆసక్తిలేదు. మానవుని నైతికోన్నతిని ఆదర్శప్రాయముగ సాధింపవలయుననియు హృదయకాసారమును స్వచ్ఛమైన ప్రేమామృతముతో పూర్ణమొనర్చవలయునని నిలని ఆకాంక్ష. తన అభీష్టములైన ఇట్టిఆదర్శములను యథార్థవాదముతో మేళవించి అత్యుత్తమ కథానికలను, నవలలను ప్రేమచందు రచించెను. ఈనవలలు కథానికలుకొన్ని ఆంగ్లము జాపానీ, గుజరాతీ మున్నగుభాషలలో ననూదితములైనవి

శిల్పశోభితమైన ప్రేమచంద్ మహోన్నతఆదర్శములు తెలుగు రచయితలను బ్రభావితులజేసినవి. శాంతినికేతనములో కళోపాసనమొనర్చి వంగదేశసాహిత్యోద్యమ ములోని క్రొత్తరుచులను తెలుగువారు నవలల అనువాదరూపమున గ్రహించిన యుగ మది. వంగసాహిత్యప్రభావ మొకవైపు ప్రసరించుచుండ ఉర్దూభాషతో బరిచయముకల రచయితలదృష్టి ప్రేమచందు రచనల అనువాదముపై మరలినది ప్రేమచందు సాహి త్యములోని అభిరుచిని తెలుగువారికి ప్రథమముగ గలిగించిన కీర్తిగౌరవములు ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారికి లభించుట ముదావహము. తెలుగు నవలయు కథానికయు అప్పుడప్పుడే క్రొత్తరూపము దాల్చుచుండినకాలమది. క్రీ శ. 1915 లో మాడపాటివారి అనువాదము బ్రకటింపబడినది నాటినుండి నేటివఱకును ప్రేమచందు కథలు నవలలు ఎన్నియోఅనువదింపబడినవి

ఆంధ్రమునందనువదింపబడిన ప్రేమచంద్ కథలు నవలలు రెండు వర్గము లందుజేర్పదగియున్నవి ఉరుదూద్వార అనూదితములైనవి హిందీద్వారఅనువదింప బడినవి. ఏభాషనుండి అనువదించినను ప్రేమచందుప్రభావము మాత్రము స్పష్టముకదా! కేవలమనుసరణప్రాయములైన రచనలుకూడ కొన్ని వచ్చినవి. ప్రేమచందు ఆంధ్రాను వాదములలో ప్రతిదానినిగూర్చి వివరించుట ఇట సాధ్యముకాదు. కనుక విశిష్టములైన కొన్ని అనువాదములు మాత్రమే ప్రస్తుతము బరిశీలింపబడినవి

రాణీ సారంధా:—

క్షాత్రము మూర్తీభవించిన చంపత్‌రాయ్ రాణీ సారంధాదంపతుల గాథ ఇది. క్షత్రియవంశమర్యాదను కాపాడుటకై తన పతీసుతుల ధారవోసి తుదకు ఆత్మార్పణము గావించిన వీరనారీ శిరోమణి రాణీసారంధా. ప్రేమచందు చిత్రించిన ఈ వీరగాథను హనుమంతరావుగారు యథామూలముగ నాంధ్రీకరించిరి. మూలమునందలి సన్నివేశ ములను సంభాషణలను పంతులుగారు యథాతథముగ ననువదించిరి. వీర, కరుణరస

ప్రధానమైన ఈ కథానికయందు ప్రేమచంద రాణీసారంధా శీలచిత్రణమునందు చూపిన ప్రత్యేకతకు అనువాదకు లెట్టి భంగమును వాటిల్లజేయలేదు.

తనరాజ్యము శత్రుహస్తగతమగుట చూడనేరని చంపత్‌రాయ్ తన్ను కత్తితో పొడిచి చంపుమని రాణీసారంధాను కోర నామె చకితురాలయ్యెను. సారంధా భర్త అభిలాషను దీర్చెదనని అంతకుమున్నే వాగ్దాన మొసగి యుండెను. తనభర్త ఇట్టి విపరీతమైన కోరికను వెలిబుచ్చునని ఆమె కలలోనైనను ఊహింపలేదు. మాటప్రకారము సారంధా గుండెను రాయిజేసికొని కంపితహస్తముతో కత్తిని గ్రహించి భర్త్రువక్షమును చీల్చెను. శత్రుసైన్యములోని అధికారు లీదృశ్యమును జూచి సంభ్రమాశ్చర్యచకితులై రాణీసారంధా సమక్షమున వినమ్రశిరస్కులై నిలిచిరి. తనపుత్రులలో నెవరైనను సజీవులై యున్నయెడల తమ శవములను వారి కప్పగింపుమని సైనికాధికారులను కోరుట, తుదకు ప్రాణప్రియుని గుండెను చీల్చుకొని ఎగచిమ్మ రక్తరాగసిక్తపునీతమైన కత్తిని తనఎదలో గ్రుచ్చుకొని భర్త్రుశవముపైపడి నిర్జీవయగుట మున్నగునవి పతాకస్థాయిలోని వీరకరుణరసాత్మక సన్నివేశములు. ఈ ఘట్టములను హనుమంతరావు పంతులుగారు చెక్కుచెదరని విధముగా ననువదించిరి.

షాహీ సిపాహీ సారంధాకీ ఏజురఅత్ ఔర్ ఓసాన్ దేఖ్‌కర్ దంగ్‌రహ గయే. అదావత్నే ఎహతరాయ్‌కా జగహ్‌ది. సర్దార్‌నే ఆగేబడ్‌కర్ కహా, "ఖుదా గవాహ్‌హై. హమ్‌సబ్ ఆప్‌కే బందబేదరమ్ హైం. ఆప్‌కా జో హుకుమ్ హో బసర్‌ఓచష్మ్ బజాలాయింగే." సారంధానే హంస్‌కర్ కహా, "అగర్ హమారే బేటోంమేసే కోయీ జిందాహో తో దోనోంలాష్ ఇసే సోంప్‌దేనా." ఏ కహకర్ వహీ ఖూన్‌ఆలూద్‌తైగా అప్నే సీనేమే ఘోంప్‌లియా. జబ్ ఓ జమీన్‌పర్ గిరి తో ఉస్‌కా సర్ చంపత్‌రాయ్‌కే సీనేపర్‌థా.

"సారంధా యొక్క నిరుపమానమైన ధైర్యమును చూచి చక్రవర్తి సైనికులు చిత్రప్రతిమలైరి. వారిమనసు నందుండిన విరోధము గౌరవభావముగమారెను. అంత వారి సరదారులు ముందడుగిడి యిట్లు విన్నవించిరి. "అమ్మా! మేమందఱమును మీ దాసులమని దైవసాక్షిగ ప్రమాణము సేసెదము. మీఆజ్ఞ మాకు శిరసావంద్యము. రాణి యామాటలకు జిఱునవ్వు నవ్వి మాకుమారులలో నెవ్వడైన బ్రతికియుండెనేని మా శవములను వానికి నప్పగింపుడు"అని చెప్పి రక్తసిక్తమైన యా కటారును దన రొమ్మున గ్రుచ్చుకొని భర్తవక్షస్థలమున దలనునిచి నేలకొఱగి ప్రాణములబాసెను."[1]

---

1 మల్లికా గుచ్ఛము — పుట 68

రాణీ సారంధా: ఈకథకు ఇటీవల మఱియొక అనువాదము వెలువడినది. ప్రసాద్‌గారి అనువాదము వివరణాత్మకముగ నున్నందున దాదాపు 60పుటలవఱకు పెఱిగినది. మూలవిధేయముగ నున్న అనువాదమిది. భాషయు సరళముగ నున్నది.

ముసలిదాని యుసురు:- హనుమంతరావు పంతులుగారు అనువదించిన ఈకథకు మూలము ప్రేమచందువ్రాసిన "ఆఃబేకస్"అను కథ. కథానామమును, కథలోని పాత్రల నామములను పంతులుగారు తమ అనువాదమునందు మార్చివేసిరి. మాతృకలోని ప్రధానపాత్ర మున్షీరామసేవక్ చాందాపురములోని భూస్వామి. అనువాదమున మాయవరము లోని సుప్రసిద్ధ దేశపాండ్యా భైరవమూర్తిగా మారినాడు. 'మొంగా'అను బ్రాహ్మణ వితంతువు "అంకమ్మ" అనునామము దాల్చినది. మున్షీరామసేవక్ భార్య 'నాగిన్' తెలుగుకథలో నాగమ్మయైనది.

ఇట్టి స్వల్పములైన మార్పు లొనర్చినను పంతులుగారు కథాంశమును యథామూలముగనే అనువదించిరి. మున్షీరామసేవకుడు 'లా'పట్టము నొందకున్నను న్యాయశాస్త్రపారీణుడు. గ్రామప్రజలకు'లా'విషయమున సలహాలిచ్చుట అతనివృత్తి. ఆదాయమంతంతయె. అప్పుడప్పుడు అప్పులుతీసికొని జీవనము గడుపుచుండెను. ఈతనిపైగల విశ్వాసముచే ఒకానొక ముదుసలి రణనిహతుడైన తనభర్తమూలకముగ వచ్చిన ఐదు వందలరూపాయలను మున్షీవద్ద దాచియుంచెను. ఆతడు నెలకింత చొప్పున వృద్ధవనిత కొసగుచుండెను. కొన్నినాళ్ళకు బాకీఅంతయు చెల్లిపోయినదని మున్షీ ముసలిదానితో చెప్పెను. వృద్ధురాలు చకితయై తనకింకను రెండువందలు రావలసియున్నవని మున్షీకి విన్నవించుకొనెను. కాని లాభములేదయ్యెను. ఆ ధనము నతనినుండి పొందుమార్గాంతరము గానక వృద్ధవనిత పంచాయతీవారి నాశ్రయించెను. వారును మున్షీపక్షముననే తీర్పునొసగిరి. ముసలిది చేయునదిలేక అనుక్షణము మున్షీని తిట్టుచు మతిభ్రమించి చివరకు కన్నుమూసెను. పీడ వదలినదని మున్షీ ఊఱటనొందెను. కాని దాని ఉసురు మాత్రము మిగిలిపోయెను. ఆ ఉసురు నాగమ్మప్రాణమును హరించినది. ముసలిదాని ఉసురు ఈకథయందు చిత్రింపబడినది. కావున కథకిట్టి పేరిడుట సమంజసముగనున్నది.

ఈకథానువాదముకూడ మూలానుసారిగ సాగినది. ప్రేమచంద్ రచనలోని జీవశక్తిని పంతులుగారు తమ అనువాదమునందు చక్కగా ప్రదర్శింపజేసిరి. ఒకటిరెండు సందర్భములందుమాత్రమే పంతులుగారు స్వేచ్ఛానువాద విధానము అవలంబించిరి.

ఖానూన్ ఔర్ అదాలత్ కాతో ఇన్హే ఖౌఫ్ నథా. ఇస్ మైదాన్‌మే ఉఆకా సామ్నాకర్నా పానీమే రహ్‌కర్ మగర్‌సే బైర్ కర్నాథా.

ఈవాక్యము మున్షీ శీలమునకు ప్రాణము వంటిది. 'లా' విషయమునకు సంబంధించినంత వఱకు మున్షీ నీటియందలి మొసలి వంటివాడు ఆ అంశముపై నతని నెదుర్కొనుట కష్టము. తక్కిన అంశములలో మున్షీకి కొన్ని లోపములు కలవనియు నతడు శక్తిహీనుడనియు ప్రేమ్‌చంద్ మున్షీశీలములోని ఆంతర్యమును సూచించెను. "లాపాయింటు"లో మునలిదానిపై గెలుపుసాధించెను, కాని చివరకు మునలిదానియుసురు నెదుర్కొన లేడయ్యెనను అంశము సరసముగ వివరింపబడినది. పంతులుగారీభాగము నిట్లనువదించిరి.

"లావిషయమున నతని కేమాత్రము భయములేదు. లారంగమున మన మూర్తితో బోరాడుట పర్వతమును ఢీకొనుటయే."[1]

ఈ వాక్యమునందు భావమున కెట్టిలోపము కలుగలేదు. కాని శీలచిత్రణమున ప్రేమచందు చతురోక్తి అనువాదమున మృగ్యము.

అగ్నికుండము:—

క్షత్రియధర్మనిర్వహణముపట్ల బాంధవ్యమునుకూడ త్రోసివుచ్చిన సంఘటన ఇతివృత్తముగా గల కథయిది. పృథ్వీసింహుడు శౌర్యసాహసములకు ప్రతినిధి. ఆతని సోదరి రాజనందిని ధర్మసింహుడను పురుషసింహుని పరిణయమాడెను పృథ్వీసింహుని భార్య దుర్గాదేవి.

పృథ్వీసింహధర్మసింహులు ఆఫ్ఘనిస్తానముపై దండయాత్రకు వెడలినపుడు, వదినమఱదండ్రు (దుర్గాదేవి, రాజనందిని) కష్టకాలమున తమనాశ్రయించి వచ్చిన వ్రజ విలాసినితో విద్యావ్యాసంగముల కాలక్షేప మొనర్చుచుండిరి. సందర్భానుసారముగ వారు వ్రజవిలాసిని వివాహమునుగూర్చి ప్రసంగించిరి వ్రజవిలాసిని తానొనర్చిన ప్రతిజ్ఞనుగూర్చియు. సంకల్పించిన కార్యమును గూర్చియు వివరించెను. వ్రజవిలాసిని తండ్రి తనపెంపుడు ధేనువు కారణముగా నొకానొక రాజపుత్రునితో పోరాడి అసువుల వీడిన వృత్తాంతమును, అవసానసమయమున తండ్రి తనను హింసించిన రాజపుత్రునిపై పగదీర్చుకొనుమని వ్రజవిలాసిని కోరినవృత్తాంతమును వదినమఱదండ్రు వ్రజవిలాసిని వలన గ్రహించిరి. ప్రతిజ్ఞానుసారము వ్రజవిలాసిని ఆ రాజపుత్రు డొకనాడు కంటబడ నతనినెదుర్కొనుటయు నాతడు తప్పించుకొని పోవుటయు మున్నగు వృత్తాంతములను దెలిసికొని దుర్గారాజనందినులు వ్రజవిలాసిని సాహసమును ప్రశంసించిరి

1 మ. గు. పుట 72

పృధ్వీసింహ ధర్మసింహులు యుద్ధానంతరము స్వగృహమునకువచ్చిరి. వ్రజ విలాసిని ధర్మసింహునిచూచి చకితయయ్యెను ఆమె ఈరాజపుత్రుని రక్తమునే దప్పి గొనియుండెను. నాటిరేయి ధర్మసింహుడు వ్రిజవిలాసినిని సందర్శించి ఆమె సమక్ష మున మోకరిల్లిన దృశ్యమును రాజనందిని చూచినిశ్చేష్ట యయ్యెను.

పృధ్వీసింహధర్మసింహులు మరునాడు మృగయావినోదార్థము వనమునకేగిరి. వ్రిజవిలాసిని తండ్రిని హత్యచేసిన రాజపుత్రుని సంహరించుటకు తాను ప్రతినపూనిన వృత్తాంతమును ధర్మసింహుడు పృధ్వీసింహునకు వివరించి, తానట్టిపని యొనర్పజాల కున్న పృధ్వీసింహుని ఆ కార్యమును బూర్తిజేయుమని ప్రార్థించి అంగీకరింపచేసెను. వ్రిజవిలాసిని తండ్రిని సంహరించిన వ్యక్తి ధర్మసింహుడనురహస్యము పృధ్వీసింహు డతని వలననే గ్రహించి. చేయునదిలేక క్షత్రియధర్మమునకు కట్టుబడి కత్తివ్రేటుతో ధర్మసింహుని చంపెను రాజనందిని భర్తతో సహగమన మొనర్చెను. కొన్నినాళ్ళకు పృధ్వీసింహుడు రణనిహతుడగుటయు నాతనితో దుర్గాదేవియు సహగమన మొనర్చు టయు జరిగినది.

ప్రేమచందు వ్రాసిన ఈకథపేరు గునాహ్‌కా అగ్నికుండ్. హనుమంత రావుగా రీకథను అగ్నికుండ మనుపేర ననువదించిరి మూలమునకు సరియైన అను వాదమది. ఒకఘట్టమునందు మాత్రము స్వల్పమైన మార్పు కన్పట్టుచున్నది.

వ్రిజవిలాసిని సమక్షములో మోకరిల్లి విడిచిన దృశ్యమును రాజనందిని చూచి ఆమెతండ్రిని సంహరించినవాడు తనభర్తయే యని గ్రహించినది. కర్తవ్య మామెకు బలీయమై తోచినది. తక్షణమే భర్తనుసమీపించి వ్రిజవిలాసిని తండ్రిని సంహరించిన వానితల తనకు దెచ్చియిమ్మని రాజనందిని కోరినట్లును నందుల కాతడంగీకరించినట్లును మూలమున గలదు. అనువాదమునందు మృగయావినోదార్థము వెడలిన సందర్భమున ధర్మసింహుడే అట్టి ప్రతిజ్ఞ చేసినట్లుకలదు. రాజనందినియే అట్టి ప్రతిజ్ఞ చేయించిన వృత్తాంతమును అనువాదకులు మార్చిరి. పంతులుగా రీఅంశమును సూచ్యప్రాయముగ నొనర్చినను సమంజసముగా నుండెడిది రాజనందిని శీలమునకు దర్పణముగానుండెడిది.

ఆత్మ త్యాగము:-

ప్రేమచందుకృతమగు "ఆలహా"అను కథకు మాడపాటి హనుమంతరావు గారొనర్చిన అనువాదమిది. ఆలహుడు, ఓదలుడు ఇరువురు రాజపుత్రసోదరులు. చందేలప్రభువు పరిమళదేవుని పోషణమున బాల్యమునుండియు నున్నవారు. పోషక

ప్రభువు అనురాగమును సంపాదించినవారు. పరిమళదేవుని దర్బారులో ఈ రాజపుత్ర సోదరులు పొందుచున్న ప్రాభవమును జూచి సహింపనేరక వారి మేనమామ మహీపాలుడు వారిని గూర్చి రాజునకు చాడీలుచెప్పుచుండెను. ఒకానొక సందర్భమునందు ఆలహుడు క్షాత్రధర్మము ననుసరించి తన ఉత్తమాశ్వమును రాజున కొసగుటకు నిరాకరించెను. వారి రాజభక్తిని పరీక్షించుటకై ఇట్టి ఉపాయమును సూచించినవాడు మహీపాలుడే. పరిమళదేవు డిట్టి కుత్సితమైన పన్నాగమునకు వశుడై ఆలహుని రాజభక్తిని శంకించి రాజపుత్రసోదరులను దేశమునుండి వెడలగొట్టెను.

రాజపుత్రసోదరుల సాహస పరాక్రమములకు జంకి అంతవరకును నణగి మణిగియున్న శత్రువులు తలలెత్తి పరిమళదేవుని రాజ్యమును గబళించుటకై ప్రయత్నించిరి. ఆలహసోదరులు పూర్వపు పోషకప్రభురాజ్యమునకు వాటిల్లిన ఆపదనుచూచి మిన్నకుండిరి. తల్లిప్రోద్బలమున రాజ్యమును రక్షించుటకై ఆలహుడు మరలివచ్చి తత్కార్యనిర్వహణమున ప్రాణములువీడెను.

ఈకథయందు ఆలహుడు ప్రధానపాత్ర. ప్రేమచందు అట్టిపాత్రకు ఒసగిన ప్రాధాన్యమునకు భంగమువాటిల్లకుండ పంతులుగారు ఆత్మత్యాగమని కథానామమును మార్చిరి. ఆలహుని త్యాగనిరతి, ఆత్మార్పణము సూచ్యములు

ఆలహుని సాహసోదంతమును ఆప్రాంతములందలి ప్రజలు జానపదగేయములందు గీర్తించుచుందురు. అట్టిగేయముల నాధారముగగొని ప్రేమచందు ఈ కథవ్రాసినట్లు కథాప్రారంభమునకలదు. పంతులుగా రీఘట్టమును ననువదింపలేదు.

## పెద్దయింటిపిల్ల :—

'బడేఘర్ కీ బేటీ' అనుపేర మున్షీ ప్రేమచందువ్రాసినకథకు వేమూరి ఆంజనేయశర్మ గారి తెలుగుసేత ఇది. సమష్టికుటుంబ జీవనమాధురీ చిత్రణమునకును, సంపన్నగృహస్థుల మనోవృత్తి చిత్రణమునకును ఈకథ మచ్చుతునకవంటిది.

శ్రీకంఠుడు, లాల్ బహారీ, వేణుమాధవసింహుడను జమీందారు పుత్రులు. ఆనందీ, శ్రీకంఠునిభార్య, ఆమెపుట్టింటివారు సంపన్నగృహస్థులు ఇంటిపెద్దకోడలు. సమష్టికుటుంబమునకు పెట్టినదిపేరు మాధవసింహుని వంశము శ్రీకంఠునకు గ్రామాంతరము నందుద్యోగము, వారమున కొకసారి ఇంటికి వచ్చుచుండెడివాడు.

లాల్ బహారి ఒకనాటి మధ్యాహ్నము గబగబవచ్చి, తెచ్చిన రెండుపిట్టలను వదినెగారికిచ్చి మాంసము వండుమనెను. ఆనందీ ఇంటిలోనున్న పావుశేరు నేయితో

మాంసము వండి మఱదికి వడ్డించినది. పప్పులో నేయి లేకపోవుసరికి లాల్‌బహారి ఉగ్రుడై నేయిఅంతయు మాంసములో వేసినందులకు మందలించెను. మాటపైమాట పెరిగి పదినెగారి పుట్టింటిని నర్మోక్తులతో విమర్శించి లాల్‌బహారి కంచమును నేలకు విసరి కొట్టి పాదుకోళ్ళను వదినెపై విసరెను. ఆనందీ క్రోధదీప్తయైనది. వారాంతమున నింటికివచ్చిన శ్రీకంఠునితో జరిగినకథ పూసగుచ్చినట్లు వివరించినది. శ్రీకంఠుడు ఇంటినుండి వెడలుటకు నిశ్చయించుకొనెను. వేణుమాధవసింహుడు వంశమర్యాదను కాపాడుమనియు తమ్ముని ప్రేమానురాగములతో మందలించుట న్యాయమనియు నుపదేశించెను శ్రీకంఠుడు ఖండితముగ తమ్ముని ముఖమునైనను జూడననిపలికెను. లాల్‌బహారీ ఈమాటలు విని గృహమును వదలివెడలుట కుద్యుక్తుడై వదినెగారివద్ద సెలవు పుచ్చుకొనుట కేగెను ఆనందీ శాంతించి మఱదిని వెడలవలదని చెప్పి భర్తనుకూడ అతనిని వెళ్ళనీయ కుండునట్లు యత్నింపుమని ప్రార్థించెను. వారిహృదయముల నావరించిన ఆవేశపుపొరలు వీడిపోయినవి.

సోదరులు పరస్పర మాలింగనమొనర్చుకొనిన దృశ్యమును జూచి ఆనందీ ఆనందపరవశాత్మయైనది. మాధవసింహుడు పెద్దయింటిపిల్లలు కుటుంబవిచ్ఛేదమునకు దారితీయు పరిస్థితులనిట్లే చక్కదిద్దుదురని సంతుష్టుడయ్యెను.

ఆనందీపాత్ర వైశిష్ట్యమిట్టిది. ఆనందీలాల్‌బహారీల సంఘర్షణము శ్రీకంఠుని ఆవేశము, వేణుమాధవుని ఆవేదన లాల్‌బహారి పశ్చాత్తాపము, సోదర అంతరాంతరములందణగిన ప్రేమానురాగముల వ్యక్తీకరణము మున్నగుసన్నివేశములు మనోరంగములందు నాట్యమాడు నట్లున్నవి. రసపత్తరములైన సన్నివేశములను ఆంజనేయశర్మగారు మూలానుసారముగ జిత్రించిరి. ఆనందీ ప్రేమచందు సృష్టించిన సజీవపాత్రి. క్షణములో కోపము, క్షణములో శాంతము, అభిమానము, ఆవేశము, పెద్దలయెడ గౌరవభావము, పిన్నలయెడ ఆదరము మున్నగుగుణములు రాశిపోసినట్లుండును. ఈ పాత్రను సజీవముగ చిత్రించుటయందు ఆంజనేయశర్మగారు సఫలులైరి. ప్రేమచందు రచనలోని నుడికారపు సౌందర్యమును కూడ అనువాదమునందు కాపాడుట ప్రశంసార్హము. అనువాదమునందు శిల్పదృష్టియు నవతరించినది.

**పాడెబట్ట:** ప్రేమచంద్ రచించిన విశిష్టములైన కథలలో 'కఫన్' యొకటి. శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారు ఈకథను 'పాడెబట్ట' అనుపేర ననువదించిరి.

గేసూమాధవుల చిత్తవృత్తిని చిత్రించుటయందు ప్రేమచందుచూపినకౌశలము వర్ణనాతీతము. ఇంటిలోపల మాధవునిభార్య ప్రసవవేదన పడుచుండ బయటకూర్చొని

తండ్రికొడుకులు వేడివేడి ఆలుగడ్డలు నోరూర తినుచు పూర్వస్మృతులను తలచుకొని, తలచుకొని ఉవ్విళ్లూరుచుండిరి.

దురదృష్టవశమున మాధవునిభార్య పరలోకమునకేగినది. తండ్రికొడుకులు గ్రామములోని ఒకానొకసంపన్నుని ఆశ్రయించి అంత్యక్రియలనిమిత్తమై కొన్నిరూకలు సంపాదించి మార్గమధ్యమున గల మదిరాగృహమున ప్రవేశించి, తిని, త్రాగి, మైమరచి పడిరి ఉన్మత్తులైయున్నవారు పరలోకమును గూర్చియు, పాడెబట్టగూర్చియు చేసిన పరిసంగములు వారి మనోవృత్తికి దర్పణములు.

చంద్రిమౌళిశాస్త్రిగా రీకథను పదానువాదపద్ధతిలో నాంధ్రీకరించుట వలన మాతృకలోని రచనాశిల్పము పాత్రలసజీవధర్మములు లోపించినవి. భాషయు భావవ్యక్తీకరణమున కనుగుణముగలేదు. వీరి అనువాదములోని కొన్ని ఘట్టములను మూలముతో బోల్చి చూచినచో ఈవిషయము సుస్పష్టమగును.

చమారోంకా కుంబాథా ఔర్ సారేగాంవ్‌మే బద్నామ్. ఘేసూ ఏక్‌దిన్ కామ్‌కర్తా తొ తీన్‌దిన్ ఆరామ్ మాధవ్ ఇత్నా కాంచోర్ థా కె ఘంటభర్ కాంకర్తా తొ ఘంటాభర్ చిలంపీతా.

"అది మాదుగుల కుటుంబం. అదీగాక ఊరంతా బద్‌నాం: కేశవుడు ఒక నాడు పనిజేస్తే మూడురోజులు ఆరాం. ఇక మాధవ్ ఇంత పనిదొంగ గదాంటె ఒక గంటనిండా పనిజేస్తే ఒకగంటపూర్తిగా చిలుము తాగుతాడు."

(ఉర్దూ కథానికలు— పుట 204)

ఘంటాభర్ = గంటనిండా; ఇత్నా కాంచోర్ థా కే = ఇంత పనిదొంగ గదాంటె; ఉర్దూవాక్యరచనావిధము నట్లే అనుసరించిన అనువాదమిది.

ఘేసూకి బీవికా తో ముద్దత్ హుయి ఇంతఖాల్ హుఆ

ఘేసూభార్య చాలకాలముక్రిందటే చనిపోయినదను భావముగల ఈవాక్యమును శాస్త్రిగా రిట్లనువదించిరి.

"కేశవుడి భార్యకు కాలంముద్దతు(గడువు)అయిపోయింది.

(ఉర్దూకథానికలు— పుట 208)

దోనోం ఆలునికాల్‌నికాల్‌కర్ జల్తేజల్తె ఖానేలగే. కల్‌సేకుఛ్ నహీఖాయా థా ఇత్నా సబర్‌నథా కె ఇన్హే ఠండా హోజానేదేం. కయీబార్ దోనోంకీ జబానేం

జల్ గయీఁ. ఛిల్‌జానేపర్ ఆలూకా దేరూనీహిస్సా తో బహుత్ జియాదా గరమ్ నమాలూమ్ హోతా లైకిన్ దాంతోంతలే పహుంచ్తేహీ అందర్‌కాహిస్సా జబాన్ ఔర్ హల్‌ఖ్ ఔర్ తాలూకో జలాదేతాథా. ఔర్ ఇస్అంగారే కో ముహ్ మే రఖ్నేసే జియాదా ఖైరియత్ ఇసీమేథీ కే ఓ అందర్ పహుంచ్ జాయే. వహాఁ ఇసే ఠండా కర్నేకేలియే కాఫీ సామాన్‌థా ఇస్‌లియే దోనో జల్ద్‌జల్ద్ నిగల్‌జాతే. హాలాంకే ఇస్ కోషిష్‌మే ఉన్కీ ఆంఖోఁసే ఆంసూ నికల్‌జాతే.

"ఇద్దరూ ఆలుగడ్డలు పైపొట్టు తీసితీసి కాలేవి కాలేవి తినటం మొదలెట్టారు. నిన్నటినుంచి తిండే లేదు. అవిచల్లారాక తిందామన్నంత ఓపికా లేదు. ఎన్నోసార్లు నోరు నాలికా తెగకాలాయి. పొట్టుతీశాక ఆలుగడ్డపైభాగం మాత్రం మిక్కిలిఎక్కువ వేడి అనిపించదు కాని దంతాలుదాటి లోపలికి పోయిందా నాలికను అంగిటినీ రక్తనాళాలనూ కాల్చేస్తుంది. మరి ఆ వేడిని నోట్లో పెట్టుకుంటే ఎంతో క్షేమం అందులోనే ఉంది. ఏమిటంటే? అక్కడ లోపల చల్లారిపోతుందని. అక్కడ దాన్ని చల్లార్చేసామర్థ్యంగల వస్తువు లున్నాయి అందుకని వారిద్దరూ గబగబా మింగేస్తున్నారు. సాధారణంగా వారి యీప్రయత్నంలో వాళ్ళకి కళ్ళవెంట నీళ్ళుచుక్కలు గిర్రునతిరిగివచ్చేవి."

(పుట 208)

ఈ ఘట్టములోని కొంతభాగమునకు అనువాద మేమాత్రమును సరిగ గన్పట్టదు. అన్వయము కుదరని వాక్యరచనాధోరణివలన మాతృకలోని రసవత్తర సన్నివేశము అనువాదమున మృగ్యము.

"క ఫ న్":- వల్లభ్‌గారు ప్రేమచందు కథ నదే పేర ననువదించిరి. ఈకథానువాదము "పరివర్తన"[1] అను కథానికాసంపుటమున బ్రకటితము. అనువాదము యథామాతృకమైనను పాత్రల మనస్తత్వచిత్రణమున బిగువుతప్పినది.

## శేరుంబావు గోధుమలు:—

ప్రేమచందు వ్రాసిన సవాసేర్ ఘేహూఁ అను కథకు చావలి రాంచంద్రరావుగారొనర్చిన ఆంధ్రానువాదమిది. వీరనువదించిన ప్రేమచందుకథానికలన్నియు సరళవ్యావహారిక భాషయందు కలవు. ఇవిచదరంగయోధులను గ్రంథరూపమున బ్రకటితములు.[2]

---

[1] కథా ప్రచురణాలయము— విజయవాడ—1951

[2] విశాలాంధ్ర ప్రచురణాలయము— 1963

శేరుంబావు గోధుమలను కథలో వడ్డీవ్యాపారస్థుల తీరిని ఆశలు, కుత్సిత పరివృత్తి సహజకీతిలో ప్రదర్శింపబడినవి. శంకర్ పల్లెపటము తెలుగని దరిద్రుడు. ఒకపూట తినగలుగిని మరియొకపూట పస్తుండి పెటులో శివయాత్ర నానద్భుమండెను. ఒకానొక సాధువు తనయింటికి వచ్చినప్పుడు శంకర్ బొస్నరొట్టె లొసగుటకు సందేహించి గ్రామపురోహితుని యొద్ద శేరుంబావుగోదుమలు బదులుతెచ్చి పిండి విసిరించి రొట్టెలువేయించి స్వామిగారికి కడుపార బెట్టి ఆశీస్సులనొందెను. సంవత్సరమునకొకటి రెండుసార్లు గ్రామపురోహితునకు ధాన్యము దానముచేయుట పరిపాటి. శంకర్ రావెచ్చిన శేరుంబావుగోధుమలు తిరిగియిచ్చుటకు బదులు వార్షికదానరూపమున ఒకటి రెండు శేర్లు గోధుమలనధికముగా ముట్టజేసి బదులు తీరినదను భ్రమలోనుండెను.

ఆరేడు సంవత్సరముల అనంతరము గ్రామపురోహితుడు వడ్డీవ్యాపారిగా మారెను. శంకరుని కలిసికొని తనలెక్కలో శేరుంబావు గోధుమలు వడ్డీరూపమున పెరిగి మణుగులవఱకు బాకీలేచినదని గ్రామపురోహితుడు వివరింప శంకరుడు నిశ్చేష్టుడై చేయునది లేక వస్తులుండి గోధుమలకు తగినధర అఱువది రూపాయల వఱకు చెల్లించెను. ఇంకను కొంతవడ్డి మిగిలిపోవ ఒకటిరెండుసంవత్సరములలో ఋణ మధికమయ్యెను. ఇక వడ్డీచెల్లించుట కుదురదని శంకర్ మొందికెత్తి స్వేచ్ఛావిహారియయ్యెను ధనరూపమున ఋణమును తిరిగిచెల్లించడని గ్రామపురోహితుడు శంకించి ఆతనిచేత కాయకష్టముచేయించుకొనెను. శంకర్ జీవితాంత మట్టికష్టము చేసినను వడ్డీరూపమున పెట్టింపైన ఋణము మాత్రము తీరలేదు. ఆతని పుత్రుడు కూడ వడ్డీవ్యాపారుని సేవకు కుదురవలసివచ్చినది శేరుంబావుగోధుమల ఋణము శంకర్‌ను జీవితాంతము బాధించినది.

సిద్ధుడు శంకర్‌యింటికి అతిధిగావచ్చుట, శంకర్ శేరుంబావు గోధుమలకు పరుగులుతీయుట, వడ్డి పెనుభూతమావరించిన గ్రామపురోహితుని కుత్సితపరివృత్తి, మున్నగుసన్నివేశములను ప్రేమచందు సరసముగవర్ణించెను. ఈ కథానువాదము మూలమునకు సన్నిహితముగ నున్నది. సన్నివేశములందుకాని, పాత్రచిత్రణమునందు కాని యెట్టిమార్పులను కన్పట్టవు.

బావలి రామచంద్రరావుగారి అనువాదవిధానమును బరిశీలించుటకు ఒక ఉదాహరణము చాలును.

సాల్‌సాల్ గుజర్‌గయే. ఏక్‌దిన్ షంకర్ మజ్దూరీ కర్కే లోటా తో రాస్తే మేఁ పురోహిత్‌జీనే టోక్‌కర్‌కహా "షంకర్ కల్‌ఆకే అప్నే బీజ్‌బెంక్‌కా హిసాబ్

కర్ లే. తేరే యహాఁ సాఢేపాంచ్ మన్ హ్యూఁ కబ్సే బాఖీపదే హైఁ. ఔర్ తు దేనేకా నాం నహీఁలేతా క్యా హజమ్ కర్నేకీ నియ్యత్ హై క్యా?.

"ఏడుసంవత్సరాలు గడిచిపోయినాయి. ఒకరోజు శంకర్ కూలికివెళ్ళి తిరిగి వస్తున్నాడు. ఏమోయ్ శంకర్ రేపువచ్చి నీధాన్యం బాకీలెక్క చూసుకో. అయిదున్నర మణుగుల ధాన్యం యివ్వవలసి ఎన్నాళ్ళయింది నువ్వూ? ఇద్దామని అనుకోనైనా అనుకోవేం? పంగనామాలు పెడదామనుకున్నావా ఏం" దారిలోఆపి అడిగాడు పురోహితుడు
(చదరంగయోధులు— పుట 63)

ఉర్దూభాషలోని నుడికారమును అందలిభావమును అనువాదకులు చక్కగా జీర్ణించుకొని తెలుగునుడికారముతో మూలములోని భావములను శక్తిమంతముగను, విస్పష్టముగను వ్యక్తీకరించిరి.

లాటరీ:- ఆకాశములో గాలిమేడలు కట్టు చిత్తవృత్తిని చక్కగా దర్శింపజేయు కథయిది. విక్రమ్ అతనిసహచరుడు ఇరువురు కలిసి లాటరీలో లక్షలువచ్చునని ఆశపడి పుస్తకములను విక్రయించి పదిరూపాయలు సంపాదించి లాటరీటిక్కట్టుకొనిరి. దానిఫలితము తెలియకపూర్వమే తీయని కలలు కనుచు, అనుదినము దైవప్రార్థన మొనర్చుచు, లక్షలువచ్చినట్లే ఊహించి ఎట్లు ఖర్చుపెట్టవలయునో లెక్కలువేయుచు వారు ఆకాశహర్మ్యమును నిర్మించుకొనుచుండిరి. ఫలితము ఇక ఒకటి రెండు దినములలో తెలియుననగా దైవారాధనలు ప్రార్థనలు ఎన్నడులేనిభక్తితో సాగినవి. లాటరీలో వచ్చులక్షలకొలది రూపాయలనెవరెట్లు పంచుకొనవలయునో యని తీవ్రమైన వాదోపవాదములుజరిగినవి తుదకు ఫలితము ప్రకటింపబడినది. ఎవరికివారు తమకే వచ్చినట్లుగ ఊహించుకొనుచుండిరి ఎవరికిని బహుమతి రాలేదు. వారందఱును నిరాశాహతులైరి.

ఆశ, నిరాశలమధ్య దోలాందోళికమనస్కులైన ప్రజల చిత్తవృత్తిని ప్రేమచందు నిశితముగ బరిశీలించి ఈకథయందు చిత్రించెను. అనువాదము మూలానుసారిగ సరసముగ నున్నది. చావలి రామచంద్రరావుగారు ప్రేమచందుకథలకు సరియైన న్యాయమును చేకూర్చిరనుటలో సందేహములేదు.

పోటాపోటీ: గ్రామరాజకీయములను ప్రేమచందు ఈ కథయందు చక్కగా జిత్రించెను. జోఖూభగత్, బేచనచౌధరి అనువారికి దాదాపు మూడు తరములనుండి శత్రుత్వముండెను వారికిగల అభిప్రాయభేదములు గ్రామములో రెండువర్గములను స్థాపించినవి. ఒకరు దేశభక్తిని ప్రోత్సహించువారు. మఱియొకరు రాజభక్తిని ప్రజ

లకు ప్రచారము చేయువారు. వారి సిద్ధాంతభేదములవలన రెండుపక్షము లేర్పడినవి. చివరికి వారిరువురు అభిప్రాయభేదములను విస్మరించి స్వరాజ్యస్థాపనోద్యమము సమంజసమైన మార్గమని నిశ్చయించుకొనిరి భగత్‌జీ చౌధరిగారి అభిప్రాయములను హృదయపూర్వకముగ సమర్థించెను.

ఈకథయందును రామచంద్రరావుగారు భావప్రధానమైన లనువాదవిధానమునే అవలంబించిరి. ఈకథానువాదము కూడ మాతృకననుసరించినది. ఇంతకుమించి అనువాదమునందు ప్రత్యేకముగ గమనింప దగిన అంశములు లేవు.

ఆత్మారామ్:—

భౌతికాధ్యాత్మిక తత్త్వమును భంగ్యంతరముగ తెలుపు కథ యిది. మహాదేవ్ అను కంసాలి, జీవితసౌఖ్యములను బాగుగ ననుభవించినవాడు. గంపెడంత సంసారము కొడుకులు, కోడండ్రు, మనుమలు, మనుమరాండ్రు మున్నగు వారితో నాతనిగృహము కోలాహలకేంద్రముగ నుండెను. వృద్ధాప్యమున క్షణకాలము మనస్సు నేకాగ్రస్థితిలో నుంచుకొని రామకృష్ణ యనుకొనుటకైనను నింటిలో ప్రశాంతమైన వాతావరణము లేనందున మహాదేవ్ మధ్య మధ్య పిల్లలను జూచి చీదరించుకొనుచుండెను పెంపుడు చిలుక నుద్దేశించి కల్లెంత నిజమెంతొ గురుడు హరు డెరుగులే అని మహాదేవ్ అప్పుడప్పుడు రాగాలాపన చేయుచుండువాడు దురదృష్టవశమున నతనికి ప్రేమాస్పదమైన చిలుక పంజరద్వారములు తెఱచియున్నపుడు రివ్వున ఎగిరిపోయెను. బాలబాలికలు అల్లరిచేయుచు నొకనాడు పంజరపుతలుపును తెఱచివేసిరి. ఆ చిలుకను వెంటాడుచు మహాదేవ్ చెట్లు పుట్టలు గుట్టలు తిరిగెను. కాని చిలుకను పొందలేకపోయెను. తత్త్వగీతములైనను చిలుకను ఆకర్షింపలేకపోయినవి. చిలుకను వెంబడించుట మాత్రము మానలేదు. ఒక్కనాటి రేయి మహాదేవుడు చిలుకను కనిపెట్టుకొని తత్త్వగీతము నాలాపించుచుండ సమీపస్థులైన దొంగలు భయమునొంది పారిపోయిరి. వారు తమలో తాము పంచుకొనుటకు సిద్ధముగా నుంచిన నవరసులన్నియు మహాదేవుని హస్తగతమైనవి.

కాంచనదర్శన మాతని దృక్పథమును మార్చివేసినది. నవరసులను గ్రహించి గ్రామమునకు మరలివచ్చి పెద్దఎత్తున వ్రతములు సమారాధనలు చేసెను. అప్పులవారి బాకీ తీర్చెను. గ్రామవాసులందఱును ఒక క్షణములో ధనికుడై ధనమును మంచినీళ్ళప్రాయముగ ఖర్చుపెట్టుచున్న మహాదేవుని మహద్భాగ్యమును జూచి విస్మితచిత్తులైరి. వ్రతము లొనర్చి మహాదేవుడు తీర్థయాత్ర లొనర్చుటకు వెడలి తిరిగి రాలేదు. గ్రామప్రజలలో నతని పేరు ఆత్మారామ్‌గా సుప్రసిద్ధమైనది.

అతినిగూఢములైన వేదాంతరహస్యములను సామాన్యమైన ఇతివృత్తములో బంధించుట ప్రేమచందు రచించిన ఈ కథలో గమనించదగిన అంశము. మాయా మోహములు చిలుక మహాదేవ్ రూపములో సంగ్యంతరముగ సూచింపబడినవి ఇతర కథలవలె ఈ కథయు మూలానుసారిగ నున్నది. రామచంద్రరావుగారి సరసమైన అనువాద విధానమందును ప్రస్ఫుటముగ కన్పడును.

ప్రేరణ:— రామచంద్రరావుగా రనువదించినకథలలో నిదియు విశిష్టమైనదే. విద్యార్థులకును, ఉపాధ్యాయులకును నుండవలసిన సన్నిహితసంబంధమిందు సూచ్యము. ప్రేమచందు జాతీయతావాది. కొన్నినాళ్లు ఉపాధ్యాయుడుగను నున్నందున ఈ కథలోని అంశములు స్వానుభవములో గూడినవని భావింపవచ్చును. విద్యార్థులను దండించి శిక్షించుట సాధ్యము కాదనియు, వారి హృదయములో పరివర్తనము గలుగునట్లు యత్నించుట శ్రేయస్కరమనియు ప్రేమచందు ఈ కథానికలో వ్యక్తీకరించెను.

సూర్యప్రకాశ్ అను విద్యార్థి పోకిరీ కుర్రవాడుగ పేరుగాంచెను. చదువు సంధ్యలలో మాత్రము మితిలేని చురుకుదనము చూపువాడు. తరగతిలో ప్రవేశించి నప్పటినుండియు నల్లరిచేయుటకు బూనుకొనిన సూర్యప్రకాశ్ పరీక్షలలో నుత్తమ శ్రేణిలో నెట్లు విజయము నొందుచుండెనో అధ్యాపకులకే విడదీయరాని సమస్యగా నుండెను. కాలముగడచినది. ఉపాధ్యాయుడు ఉపకారవేతనమునొంది ఒకానొక గ్రామమున ఆదర్శప్రాయమగు విద్యాలయమును స్థాపించెను. సూర్యప్రకాశ్ విదేశము లందున్నతవిద్యాభ్యాస మొనర్చి ఉన్నతపదవిని అలంకరించి ఒకనాడు ఈ పాఠశాలకు వచ్చెను. సూర్యప్రకాశ్ తనకు పూర్వము గురువుగా నుండిన అధ్యాపకుని గౌరవించి తన కథను వివరించెను. అల్లరిపిల్లవాడుగ పేరుమోసిన సూర్యప్రకాశ్ వంటి శిష్యుడు మహోన్నతపదవిలో నుండినందులకు గురువుగారెంతయు సంతసించిరి. ఇది అంతయు గురువుల ప్రేరణఫలితమని ప్రకాశ్ భావించెను.

సంఘములోని భిన్నవిభిన్నములైన సజీవసమస్యలకు ప్రాతినిధ్యము వహించిన కథల నెన్నుకొని రామచంద్రరావుగా రనువదించుట ప్రశంసార్హము. ఉర్దూరచయితల కథలలోని వస్తువును తెలుగువారు గ్రహించుట కిట్టి అనువాదములు తోడ్పడును.

బిళ్ళంగోడు:- ఇది పేరునకు కథానిక యైనను స్కెచ్‌వలె నున్నది. ఇరువురు బాల్యమిత్రులు బిళ్ళంగోడు ఆటలో ఆరితేరినవారు. జయాపజయములగూర్చి వారు పరస్పరము సంఘర్షణకు దిగిన సందర్భములను కొన్ని కలవు. వారిలో నొకరు

మహోన్నతపదవిని పొంది గ్రామమునకు వచ్చి తన బాల్యసఖునితో బిళ్ళంగోడుఆడుట పరాజయము నొందిన స్మృతులను వినిపించి మధురానుభూతు లొందుట ఈ కథలోని ప్రధానాంశము. అధికారము, ధనము స్నేహమున కతీతములని ప్రేమచందు ఇందు నిరూపించెను

## రసిక సంపాదకుడు:—

ప్రేమచందు రచించిన కథలలో నాల్గింటిని లల్లన్‌గారు అనువదించి "మన స్తత్వం" అను కథానికా సంపుటము[1] నందు చేర్చి ప్రకటించిరి. వివిధరంగములలో నున్న మానవుల మనస్తత్వము ఈ కథలందు చిత్రితము.

నవరసపత్రికాసంపాదకుడు చోఖేలాల్‌శర్మ తనభార్య గతించి నప్పటినుండి మహిళలన్న ప్రత్యేకాభిమానము చూపుచుండెను. తన పత్రిక యందు కవయిత్రులు పంపిన గేయముల కధికప్రాధాన్యమొసగుటయే కాక వారికి ప్రశంసాపూర్వకములగు లేఖలు వ్రాసి దర్శనాభిలాషను వ్యక్తీకరించుచుండెను. సంపాదకుడు చూపుచున్న ఆద రానురాగములకువశులై కొందఱు కవయిత్రులు సంపాదకుని గృహమునకు వచ్చుటయు నాతనికి పరిచర్య చేయుటయు జరుగుచుండెను. ఒకానొక కవయిత్రి వ్రాసిన భావగీత మును చదివి ముగ్ధుడై ఆమె కవితాసౌందర్యమును మనసార మెచ్చుకొనుచు చోఖేలాల్ లేఖను వ్రాసెను. కవిత కంటెను కవయిత్రి సుందరియై యుండునని యాతడుభావించెను. తన కవిత నోరగంట యైనను చూడని వారికంటె కోరినక్షణమే పత్రికలో ప్రకటించుట కంగీకరించిన సంపాదకుని ఔదార్యమును ప్రశంసించి ఆమె సంపాదకుడు కోరినట్లు కార్యాలయమునకు వచ్చుటకు అంగీకరించెను. అపూర్వసుందరి కవయిత్రి దర్శనోత్సు కత తోడ సంపాదకుడు రసికతామూర్తియై అనుక్షణ మామెకై నిరీక్షించుచుండెను. కవ యిత్రి రానే వచ్చినది. రసికసంపాదకుని హృదయభాండ మామెను జూచిన మరు క్షణముననే భగ్నమైనది. ఉత్సుకత పాలపొంగువలె నుండి గడియలో నడుగంటినది. కవయిత్రియందపూర్వ సౌందర్యరేఖ లేమాత్రము గోచరించలేదు. రసికసంపాదకు డాశాభంగము నొంది ముద్రణమునకు సిద్ధముగానున్న కవితను తీసివేయుమని ముద్రాప కుల కాజ్ఞ యొసగుట, ముద్రాపకులు అప్పటికే ముద్రణ మారంభమైనదని చెప్పుట మున్నగు ఘట్టములందు రసికశేఖరుడగు సంపాదకుని మనస్తత్వము చక్కగా ప్రతి బింబించినది.

---

[1] జనతా ప్రచురణాలయం. విజయవాడ—2 డిసెంబరు 1958

లల్లన్‌గారి అనువాదములు సరళవ్యావహారికభాషలో నున్నవి. భావవ్యక్తీక రణములో స్పష్టతకలదు. మాతృకను యథాతథముగ ననువదించినవారిలో లల్లన్‌గారు నొకరు. మధ్యమధ్య ఒకటి రెండు వాక్యములు పదానువాదరీతిలో సాగినట్లు తోచును. ఇట్టివాక్యములలో మాత్రము స్పష్టతాగుణము కొంతవఱకు లోపించినది.

"కాని మహాత్ములకు గానీ, మహాత్మాతనానికి దరిదాపులకు చేరిన వాళ్ళకు గానీ, ప్రేమఖర్చుదారుగాక పోవడమేగాక ఏదో ఒక వస్తువును ఎదురుపొందుతుంది."

విందు:- హాస్యమును అధిక్షేపముతో రంగరించిన కథ యిది. వేదశాస్త్రములను చూరుకు జెక్కి కేవలము భోజనప్రియులై వివాహవ్రతములు మున్నగు వానికి సంబంధించిన విందుల కెగబడు విప్రుల మనోవృత్తిని ప్రేమచందు హాస్యఅధిక్షేపధోరణిలో సరసముగా చిత్రించెను. లల్లన్‌గారి అనువాదము మాతృకవలె సరసముగా సాగినది.

పండితయోతేరాం అను దరిద్రబ్రాహ్మణుడు భోజనప్రియుడు. రాణీగారు వ్రతార్థ మేడుగురు బ్రాహ్మణులను పిలుచుకొని రమ్మని కోరుట, షడ్రసోపేతమై, అపూర్వమైన విందు అన్యులకు జెందుట కిచ్ఛగింపక మోతేరాంపండితుడు తనఐదుగురు పుత్రులను భిన్నభిన్ననామముల తోడను, భార్యను పురుషవేషముతను తీసికొనివెళ్ళుట కథ అడ్డము తిరిగి పండితుడు పరాభూతుడై వచ్చుట మున్నగు సన్నివేశములు హాస్య అధిక్షేపపూర్వకములు.

మనస్తత్వం = పుట–41

మనస్తత్వము:- ఒకానొక పార్కులో నొక యువతి మైమరచి నిద్రపోయిన దృశ్యమును జూచి పలువురు పలువిధములుగా నర్థముచేసికొనుట ఈ కథయందలి ప్రధానవస్తువు ఒడలు మరచి పడియున్న స్త్రీ వేశ్యయై యుండునని పలువురు ఊహించిరి. ఇది కథవలె గాక స్కెచ్ వలె నున్నది. అనువాదము మాతృకకు సన్నిహితముగ నున్నది

దేవాలయము:- కన్నబిడ్డలపై తల్లికి గల మమకారము ఈ కథానికలోని వస్తువు. మాతృమూర్తి తన చిన్నారిశిశువు వ్యాధితో బాధపడుచుండ చూడలేక వేయి దేవతలకు మొక్కినది. దేవాలయములో ప్రవేశించి దేవుని భక్తిపురస్సరముగా సేవించినది. ఆమె భక్తి నిష్ఫలమై పోయినది. అసువుల వీడిన శిశువును చూచి

కెప్పున కేకవేసి మాతృమూర్తియు ప్రాణత్యాగ మొనర్చినది. మూలము ననుసరించిన అనువాద మిది. ప్రత్యేకముగ గమనింపవలసిన అంశములులేవు.

## రెండుతరాలు[1] :—

ఒక కుటుంబములోని రెండుతరాల గాథ ఈ కథ యందలి యితివృత్తము. భోలామహ్‌కు ప్రథమ కళత్రము వలన నిరువురు. ద్వితీయ భార్య వలన నలుగురు మొత్తము ఆరుగురు సంతానము. రఘు అందరిలో పెద్దవాడు. భోలామహా మరణానంతరము రఘే కొన్నినాళ్లు బాధ్యతారహితముగ సంచరించువాడు. పినతల్లి పుత్రులపై నతని కెక్కడలేనిప్రేమ. కుటుంబభారమును నిర్వహించుటకు పూనుకొని తనయొద్ద నున్న బంగారు బిళ్ళ నమ్మి గోవును దెచ్చి వ్యవసాయము నారంభించి వ్యవహార దక్షుడయ్యెను. అతని భార్య ఇంటిలో నడుగుపెట్టిన నాటినుండి పినతల్లితో మనస్పర్థలారంభమైనవి. చివరకు కుటుంబవిచ్ఛేదనమైనది రఘు కాలధర్మము నొందినాడు. అతని సంతానముపట్ల పినతల్లి ఎంతయు శ్రద్ధ వహించినది. విడిగానుండిన సంతానము చివరికి ఏకమైనది. లల్లాగారి అనువాదము మూలమునకు సన్నిహితముగ నున్నది.

జ్యోతి:— బూటీ భర్త మరణానంతరము తన ముప్వురు పిల్లలతో కాలక్షేపము చేయుచుండెను. పెద్దకుమారుడు మోహన్ రూపయా అను కన్నెను ప్రేమించ తల్లి ఆతనిని మందలించుచుండెను. ఉత్తమవంశ సంజాత కాదని విమర్శించెడిది. రూపయా గుణగణములను ప్రత్యక్షముగ దెలిసికొనిన తరువాత వివాహమున కంగీకరించినది. రూపయా జ్యోతివలె ఆ సంసారమునకు వెలుగు నొసగినది. మూలము ననుసరించి ఈ కథను లల్లాగా రనువదించిరి.

అమ్మ:- పాశ్చాత్యవిద్యావ్యామోహ మిందు భంగ్యంతరముగా విమర్శింపబడినది. మూడేళ్ళవఱకు ఖైదులోనుండి ఇంటికి తిరిగివచ్చిన ఆదిత్యుడు అవసానదశలో దేశాభిమానమను ఉన్నతాదర్శములతో జీవించవలయుననియు ఉన్నత ప్రభుత్వోద్యోగముల నాసింపవలదనియు పుత్రున కుపదేశ మొనర్చెను కాని అతని ఆదర్శము లడుగంటినవి. పుత్రుడు విద్యాభ్యాసములో విజయపరంపరల నొంది ఉపకారవేతనముపై పాశ్చాత్య దేశములకు వెడలినాడు. ప్రేమచంద్ రచించిన ఈ కథను కూడ లల్లాగా రనువదించిరి. అనువాదము యథామూలము.

---

[1] జనతా పబ్లికేషన్సు విజయవాడ 1958 ఈ కథానిక సంపుటములో జ్యోతి, అమ్మ, అను రెండు కథలును గలవు.

నిందా[1]:- స్వార్థరహితముగ సేవ యొనర్చినను సంస్థల నిర్వాహకులకు అపనిందలు తప్పవను సత్యమును ప్రేమచందు ఈకథలో సూచించెను. ఒకానొక సంస్థ నిర్వాహకుల గూర్చి మహిళామండలి సభ్యురాండ్ర విమర్శలిందు స్కెచ్ రూపములో వర్ణితములు. మూలానుసారముగ విశ్వప్రసాద్‌గారనువదించిన ఈ కథ కళోపాసకులను కథాసంపుటమున ప్రకటితము ఇతరకథానువాదములలో ముప్పన విశ్వప్రసాదు గారి ప్రేమపీఠము సుఖదాసు[2] సోమయాజులుగారి నారీజీవనము; కే. జి ఆచార్యగారి ప్రతిజ్ఞ[3] ప్రేమచందు సాహిత్యము అను పేర అనువదింపబడిన కథల సంపుటి మున్నగునవి. పేర్కొనదగిన అనువాదములు.

పెద్దకథలు—నవలలు:- ప్రేమచందు రచించిన పెద్దకథలకును నవలలకును తెలుగులో పెక్కు అనువాదములు వెలువడినవి. వీనిలో ప్రధానముగ బరిశీలింప దగినవి ఇవి.

దామెర్ల భ్రమరాంబ, విజయలక్ష్మిబాయమ్మ అను వారిరువురు కలిసి ప్రేమ చందుగారి సేవాసదనను తెలుగులోనికి అనువదించిరి. రెండుభాగములలో బ్రకటింప బడిన ఈ అనువాదము చిలకమర్తివారి పీఠికతో 1933లో వెలువడినది.

నిర్మల[4]:— ఛాయేశ్వర్‌గారొనర్చిన అనువాదము మూలము ననుసరించినది. ప్రేమచంద్ రచనా విధానము అనువాదము నందును చక్కగా గన్పట్టును.

సేవాసదనము[5]:— ఎన్. సోమయాజులుగారొనర్చిన ప్రశస్తమైన అనువాదమిది, ఇది ఇప్పటికే మూడు నాలుగు మారులు ముద్రితమైనది. అనువాదము చక్కని వ్యావహారికభాషలో సాగినది, పాత్రపోషణము నందును సన్నివేశచిత్రణము నందును సోమయాజులు గారు ప్రేమచంద్‌గారి రచనకు వన్నెలు గూర్చునట్లొనర్చిరి.

మంగళసూత్రం:-[6] చివరిదశలో ప్రేమచంద్ రచించిన వానిలో నిది విశిష్టమైనది. ఇది హిందీ నుండి అనూదితము. చావలి రామచంద్రరావుగా రొనర్చిన

---

[1] కళోపాసకులు, ఉమాపబ్లిషర్సు విజయవాడ 1951

[2] ప్రేమచంద్ పబ్లికేషన్సు, విజయవాడ.

[3] విశాలాంధ్ర ప్రచురణాలయము, విజయవాడ. 1962

[4] ప్రేమచంద్ పబ్లికేషన్సు. 1963 [5] ప్రేమచంద్ పబ్లికేషన్సు 1963

[6] విశాలాంధ్ర ప్రచురణాలయము, విజయవాడ. III Edit 1960

ఈ అనువాదము విశిష్టమైనది. ప్రేమచంద్ నిశితపరిశీలనాశక్తి, విమర్శనా విధాన మిందు చక్కగా ప్రతిబింబితము.

## కొత్త యిల్లు

జామియె మిల్లియా ఇస్లామియా(ఢిల్లీ)లో చరిత్ర ఆచార్యులుగా బనిచేసిన మహమ్మద్‌ముజీబ్‌గారు వ్రాసిన కథలు "కిమియాఘర్" అను కథానికా సంపుటము రూపమున వెలువడినవి. మానవ మనస్తత్వ చిత్రణ ప్రధానములుగ మనోవిజ్ఞాన దాయకములుగ నున్న వీరి కథలలో నొక కథను వేమూరి ఆంజనేయశర్మగారు అనువదించి "తల్లి" అను కథానికా సంపుటమున బ్రకటించిరి. ఆయూబ్‌ఖాను కూతురు కొడుకు ఇరువురు కాలముచేయ తనగృహ మచ్చిరాలేదనియు, నా యింటిలో భగవదారాధనకు దృష్టి మరల్చుశక్తి లేదనియు విశ్వసించి క్రొత్త యింటిని నిర్మించుటకు తల పెట్టెను గృహ నిర్మాణ సందర్భమున కూలికి వచ్చిన కన్నెపై మనసు మరలినది. ఆ కన్నె తావలచిన యువకునితో లేచిపోయినది. అయూబ్‌ఖాను మనసు వికలమైనది. అయూబ్ మానసిక పరివర్తన మిందు చక్కగా చిత్రితము. శర్మగారి అనువాదము కూడ మూలానుసారిగ నున్నది.

"ఆ పిల్లను వివాహంచేసుకోవడమా లేదా అది ఒక సమస్య. ఆమెను వివాహమాడడమే మంచిది. అయితే బంధువులందరూ అంగీకరిస్తారా? కూలిపిల్లకదూ బంధువుల కోసం ఆలోచిస్తే బంధువులు సమాజంపేరుతో నిర్దోషుల్నిగూడా రోజూ కొరితన వేయిస్తున్నారు. అందువల్ల వాళ్ళకోసం లేఖ్ఖ చేయకూడదు. కూలీదాన్ని పెళ్లి చేసుకున్నాడని ఇంటి నౌకర్లుకూడా ఎగతాళి ప్రారంభిస్తారేమో! బహుజనాభిప్రాయం మార్చడం ఎలాగా? లాఠీ చూపించి అభిప్రాయం మార్పించగలమా? ఒకరు ఎగతాళి చేస్తారని మనం ఏపని మాని వేస్తున్నాం. ఆత్మశుద్ధిగా మనం చేసేపనికి ఇంకొకరి అభిప్రాయాలతో పని ఏమిటి?'' పుట 9.

## కృష్ణచందర్ కథలు[1]

కృష్ణచందర్ ఉర్దూలో సుప్రసిద్ధ కథారచయిత, కథాశిల్పములో నితనిది అందెవేసినచేయి. పాత్రపోషణమందును, వస్తువివరణమునందును నితనికి ప్రత్యేకత గలదు. ఈత డభ్యుదయవాది సామాన్యమానవుడితని రచనకు వస్తువు. పీడితప్రజల

1 విశాలాంధ్ర ప్రచురణాలయము 1962

బాధలను కథలందు రసవంతముగా చిత్రించుటలో దిట్ట. సున్నితమైన హాస్యము, వ్యంగ్యమును చక్కని శిల్పములో మలచివేయు నేర్పు కలవాడు. ఈతని పాత్రలు ఊహాలోకములోనివారు కారు. వాస్తవిక జగత్తులో నిత్యము మన ఎదుట సాక్షాత్కరించువారే. దేశరక్షణకొఱకు ప్రాణత్యాగము చేయు సైనికులు, పూలుఅమ్మి జీవించు దరిద్రులు, కాయకష్టము చేయువారు, మొదలగువారు ఈతని పాత్రలలో దోబూచు లాడుచుందురు. వినూతనమైన సంస్కారముగల మానవసృష్టి అవసరమని ఈతని వాదన. ప్రేమచంద్‌వలె మానవతావాది. కథలలో భావనైశిత్యముతో పాటు కళా చాతుర్యము కూడ ఈతని కథలందు కలదు.

కృష్ణచందర్ కథలు ఆంగ్లము మున్నగు భాషలలోనికి అనువదింపబడినవి. భిన్న భిన్న వస్తుకములగు ఎనిమిది కథలనేరి జ్ఞానేంద్రగా రనువదించిరి. మాతృకలోని చేవ, పటుత్వము తగ్గని విధముగా సరళవ్యావహారిక భాషలో వీరి అనువాదము సాగినది. కృష్ణచందర్‌గారి కథాశిల్పము మాయనివిధముగా ననువదించుట ప్రశంసింప దగిన అంశము.

1. నేనెదిరిచూస్తా: పూల నమ్ముకొనుచు బ్రతుకుచుండిన ఒక యువకునికి జీహి అను చైనాయువతితో ప్రణయ మంకురించినది. జీహి కుటుంబముకూడ రంగు రంగుల పూలను విక్రయించుచు బొంబాయిలో జీవనము గడుపుచుండెను. జీహి అందమునకు ముగ్ధులై ఎందఱో యువకులామెను వరించవలయునని సంకల్పించుకొనుచుండిరి. జీహి తండ్రి అందరి నుండి కొంత ధనము గ్రహించి ఎవరికి వారికే జీహి నిచ్చి పెండ్లి చేసెదనని వాగ్దాన మొనర్చుచుండెను. జీహి కొరియా వెళ్లిపోయినది. జీహి తిరిగివచ్చునని క్రొత్తగా వలచిన యువకు డాశించినాడు. వేలకొలది సంవత్సరములకు పూర్వము భారతదేశముతో చైనీయులకు గల సంబంధము పునరుద్ధరింపబడునని కృష్ణచందర్ ఈ కథలో వ్యంగ్యముగ సూచించెను.

2. బాపూజీ పునరాగమనం: మహాత్ముడుచాటిన రామరాజ్యము స్వరాజ్యానంతరము రావణరాజ్యముగ మారినదని ఆర్థిక సాంఘిక పరిస్థితులందు మానవుల చిత్తవృత్తులయందు కలిగిన పరివర్తనమును రసవంతముగ చిత్రించి ఈ కథ యందు కృష్ణచందర్ సూచించెను.

3. తుపాకీగుండ్లు - చెర్రీపూలు: ఈ కథను కృష్ణచందర్ ఆంగ్లములో 'క్వీన్ ఆఫ్ హార్ట్సు' అనుపేర అనువదించియుండెను. జ్ఞానేంద్రగారు ఉర్దూకథ ననువ

రించియే అనువదించిరి. సియోలు యుద్ధజ్వాలలో ఆహుతియైన సైనికులగాథ యిది. సామ్రాజ్యవాదులు సియోలును అగ్నిజ్వాలలలో వేసినను ప్రజలను గెలువలేరను సిద్ధాంతమును రచయిత చాటెను. దేశము స్వాతంత్ర్యము గోల్పోయినను ప్రజా హృదయమున స్వేచ్ఛా స్వాతంత్ర్య జ్యోతులు వెలుగుచుండునని రచయిత విశ్వాసము.

4. వలపురేతిరి: ప్రియసీప్రియుల వివాహమునకు అంతరాయముగ నిలచిన వరకట్నము పిశాచమువంటిదని కృష్ణచంద్రుడీ కథ యందు సూచించెను.

5. బియ్యపుదొంగ: పొలములో పండిన వానన బియ్యపువాటా పండించు వారికిని పొందు అర్హత కలదని వీరిందు నిరూపించిరి. కష్టపడి పనిచేయు కర్షకులకు భూస్వాములకు మధ్యగల అంతరమును తొలగించ వలయునని అభ్యుదయవాదుల ఆదర్శము.

6. శాంతినికూర్చె చల్లనివేళ్ళు: ప్రేమ శారీరక వాంఛా పూర్ణమైనది మాత్రమేకాదు. దాని పరిధి విస్తారమైనది. హృదయ పద్మములోని పత్రములలో నది యొకటి. సోదరీ సోదరుల యందలి అనురాగము మిత్రులయెడ ప్రేమ, దేశప్రేమ మున్నగునవి ప్రేమపుష్పములోని విభిన్నమైన రేకులు అని కృష్ణచందర్ భంగ్యంతర ముగ ఇందు చాటెను.

7. ఐదురూపాయల స్వేచ్ఛ: దారిద్ర్యముతో క్రుంగిపోవువారు, దేశ స్వాతంత్ర్యానంతరము మిత్రులు బంధువులు భిన్నదేశవాసులుగనున్నవారు, మున్నగువారి చిత్తవృత్తులు పూర్వస్మృతు లిందు చిత్రింపబడినవి.

8. నేనెవ్వరినీ ద్వేషించను: కవులు రచయితలు అయిన కొందఱు మిత్రులు సినిమా కథల సిండికేటు ఏర్పాటుచేసి, సినిమాలకు కథలు పాటలు వ్రాసి లక్షలార్జించవలయునని సంకల్పించుకొనిన యితివృత్తముగల కథ యిది. కళాకారుల దృక్పథములో వచ్చిన పరివర్తనము ఇందు చిత్రితము.

భైరవమందిరం లిమిటెడ్: హాస్యవ్యంగ ప్రధానమైన కృష్ణచంద్రుని కథను వేమూరి ఆంజనేయశర్మగా రనువదించిరి. దేశములోని మతసంస్థలు పీఠములు వానికి సంబంధించిన ఆస్తులు, పీఠాధిపతుల స్వార్థము, వారసత్వపు పేచీలు మున్నగు అంశములను భైరవమందిర మాధారముగ గొని కృష్ణచందర్ చిత్రించెను. ఈ అను వాదము తల్లి అను కథాసంపుటమున బ్రకటితము.

**మోహిని:** భారతదేశము గూర్చి అమెరికా మున్నగు దేశీయుల భావములిందు వ్యంగ్యధోరణిలో వివరింపబడినవి. 'మోబీ' అను పేర గల కృష్ణచంద్రుని కథను 'మోహిని' అనుపేర చంద్రమౌళిశాస్త్రిగా రనువదించిరి. ఇది ఉర్దూకథానికలను సంపుటమున బ్రకటితము.

**విరిగిన విగ్రహాలు:** ఇది కృష్ణచందర్ వ్రాసెన నవల. బోలు శేషగిరి రావుగారు దీని ననువదించిరి విశాలాంధ్ర ప్రచురణాలయమువారు ప్రకటించినారు.

కృష్ణచందర్‌గారి కథలు నవలలు మున్నగు వాని యందు చిత్రింపబడిన ఇతివృత్తము, పాత్రల మనస్తత్వము, అభ్యుదయ వాదము మున్నగునవి తెలుగు వారికి మార్గదర్శకము లగుననుట కెట్టి సందేహములేదు.

**మావీధి:** అహమ్మదలీగారు వ్రాసిన "హమారీగలీ" అను కథ కిది తెలుగు అనువాదము. ఉర్దూ వాక్య విన్యాసరీతిని అనుసరించిన సందర్భము లిందు కొన్ని కలవు. దీని ననువదించినవారు చంద్రమౌళిశాస్త్రిగారు.

"పట్నంలోని ముస్లిం వర్గాలలో తీవ్రమైన ఆందోళన చెలరేగింది గదాంకె రషీద్‌ని ఉరితీస్తున్న జైలు ముందు వేలాది జనం గుంపు గూడింది."

ఈ కథానువాదమునందు ప్రత్యేకముగ గమనింపదగిన అంశము లేవియునులేవు.

**ఆనందీ:** గులామ్ అబ్బాస్‌గారు రచించిన విశిష్టకథానికలలో నిది యొకటి. చంద్రమౌళిశాస్త్రిగా రీ కథను మోహిని అను పేర అనువదించిరి. ఈ ఒక్క కథను మాత్రము శాస్త్రిగారు మాతృకానుసారముగను, చక్కగను తెనిగించిరి.

నగరమధ్యమున నివసించుచు రసికలోకమును తమ వయోవిలాసముల తోడను లలితకళావిన్యాసము తోడను ఆకర్షించుచు నగరవాతావరణమును కలుషిత మొనర్చిన విలాసినులను నగరమునకు సుదూర ప్రాంతము లందు వసింపజేయుటకు మునిసిపాలిటీ వారు సంకల్పించుటయు, వారు తరలి వెళ్లిన ప్రాంతము కూడ కొన్ని నాళ్ళకు మహానగరమై విలసిల్లుటయు ఇందు వర్ణితములు.

అబ్బాస్‌గారి రచనలోని వ్యంగ్య ధోరణిని, శక్తిమంతమైన భావవ్యక్తీకరణ పద్ధతిని, సజీవవర్ణనానైపుణిని. నిశితమైన రచనావిధానమును శాస్త్రిగారు తమఅనువాదము నందు చక్కగా ప్రతిబింబింప చేసిరి. నూతన భవన నిర్మాణ కార్యక్రమమును

సరసముగను, వ్యంగ్యముగను, వర్ణించిన ఘట్టము నిందులకు తార్కాణముగ జూపవచ్చును

ఇన్ దేవావోంకే మకానోంకి తామీర్‌కి నిగ్రాని ఇన్కే రిష్తదార్ యా కారందే తో కర్తేహితే కిసీకిసీ దిన్ దోపహర్ కే ఖానేసే ఫారిగ్ హోకర్ అప్నే ఇష్తాఖ్ కే హమ్రహా ఖుద్‌భీ అప్నే అప్నే మకానోం కో బన్తా దేఖ్నే ఆజాతీం. ఔర్ గురూబ్ ఆఫ్తాబ్‌సే పహలే యహాంసే నజాతీం. ఇస్ మోఖేపర్ ఫకీరోంకి టోలియాం నజానే కహాంసే ఆజాతీం ఔర్ జబ్‌తక్ ఖైరాత్ నలేతీం అప్నీ సదావోంసే బరాబర్ షోర్ మచాతి రహీతీం. ఔర్ ఇన్హేం బాత్ నకర్నే దేతీం కభీకభీ షహర్ కే లఫంగే షహర్‌సే పైదల్ చల్‌కే బేసావోంకి ఇస్‌బస్తీ సన్‌గిన్ లేనే ఆజాతే ఔర్ అగర్ ఇస్‌దిన్ బేహాయేం భీ ఆయీహోతీం తో ఇన్కీ ఈద్ హోజాతి వో ఇన్సే జరాహట్కర్ ఇన్‌కే గిర్దాగిర్ద్ చక్కర్ లగాతే రిహాతే. ఫకీర్‌సే కహాతే బేతుకే ఖహాఖహా లగాతే అజీప్‌అజీబ్ షక్లేం బనాతే ఔర్ మజ్నూనాన హర్కత్ కర్తే ఇన్ రోజ్ కిదాబికి ఖూబ్ బిక్రీహోతి.

ఈ ఘట్టమును శాస్త్రిగారు సరసముగ నిట్లనువదించిరి.

"వేశ్యవాటిక నిర్మాణము పర్యవేక్షణను యెక్కువగా వాళ్ళ సన్నిహిత బంధువులూ, ఇందుకోసం యేర్పాటు చేసుకొన్న పెద్ద గుమస్తాలు చేస్తుంటారు. ఒక్కో సారి మధ్యాహ్న భోజనాలైన తర్వాత వాళ్లే పట్నం నుండి స్వంతంగా బయలుదేరి, తమ ముఖ్యవిటులను వెంటవేసుకుని, నిర్మించబడే యిండ్లను చూట్టానికి విహారార్థముగా వచ్చేవాళ్ళు. పొద్దు కూకుతూ కూకుతూ ఉన్న సమయానికి తిరిగి పట్నానికి వెళ్ళి పోవటం జరుగుతుంది. వీళ్ళు నగరునుంచి బయలుదేరి యీ ప్రదేశానికి చేరుతున్నారని తెలిసినరోజు ఏక్కడెక్కడినుంచో వందలాది ఫకీర్లు బిచ్చగాళ్ళు ఆడామగా ఇక్కడకు చేరుకుని చేరుకుని అణాలు పైసలూ దానం ధర్మం పుచ్చుకొనేదాకా వాళ్ళకు ఊపిరి సలపనంత స్తోత్రపాఠాలు మాటలూ ప్రారంభించి మరొక్కళ్ళతో మాట్లాడే అవకాశం లేకుండా చేస్తుండే వాళ్ళు

నగరంలో ఏమి పనిలేకుండా తిరిగే ఆవారా యువకులూ. నిరుద్యోగరౌడీలు కూడా అప్పుడప్పుడు పొద్దు బుచ్చుకునేందుకు ఇచటికి రావటం అలవాటైంది. వీళ్ళంతా కాలినడకనే చేరుకుని, ఇక్కడ జరిగే కార్యక్రమాలని అనాహూతంగానే పర్యవేక్షించి వెళుతోండేవాళ్ళు. వీళ్ళు వున్నప్పుడు ఆ విలాసవతులు కూడా రావటం తటస్థిస్తే వీళ్ళకి పెద్దపండుగ వలెనే ఉండేది, అందగత్తెలు ఎటు తిరుగుతూంటే అటే వాళ్ళ

వెనక వెనకనే తిరుగుతూ ఒయ్యారాన్ని అభివర్ణించి అభినందిస్తూ, వెకిలిమాటలు, నవ్వులతో చిత్ర విచిత్రంగా ఈ రౌడీ రసిక బృందం సభ్యులు ప్రవర్తిస్తుంటారు. ఈ సంఘటనల రోజున కబాబు లమ్మే వ్యాపారి పంట పండినట్టే ఉంటుంది [1]

## బిచ్చగాడు

ఉర్దూ కథానికా కర్తలలో సుప్రసిద్ధులైన అఖ్తర్ హుస్సేన్ రాయపురీగారు రచించిన బిచ్చగాడు శ్మశానము అను రెండు కథలు విశిష్టములైనవి. ఈ రచయిత జీవన మృత్యువుల సంఘర్షణను రసవంతముగా చిత్రించెను.

బిచ్చగాడు అను కథయందు రాయపురిగారు చిత్రించిన సన్నివేశములు పరితలను కంపితగాత్రుల నొసట్టున్నపై దరిద్రులపై ఆధారపడి జీవించువారియు, అంధభిక్షకుల స్వార్థమునకై వినియోగించుకొనువారియు చిత్తవృత్తులను రాయపూరిగారు కన్నులకు గట్టునట్లు చిత్రించిరి.

చౌదరి ఒక అనాథశరణాలయమునకు యజమాని. అనాథలును, అంధులును అగు భిక్షుకులను చేరదీసి వారి ద్వారా ధనము సంపాదించుట అతని వృత్తి. ఉదయముననే చౌదరి వచ్చి ఒక బండిలో ఈ భిక్షుక బృందమును పసులమందవలె తీసికొని వెళ్ళి నగరమునందలి ప్రధాన వీధులందును, రహదారి స్థలములందును ఒక్కొక్కరిని దింపి సాయంకాలము మరల వారిని తోలుకొని అనాథ శరణాలయములో దింపువాడు. బిచ్చమడిగి తెచ్చిన ధనము చౌదరిగారి జీవికకు ఆధారము. చౌదరికి హోటళ్ళ యజమానులతో సన్నిహిత సంబంధ ముండెను హోటళ్ళలో అమ్మగ మిగిలిన ఆహారము తినిపారవేసిన అన్నము కూరలు మున్నగువానిని చౌదరి స్వల్పమైన ధరలకు కొనితెచ్చి ఈ భిక్షుకుల కుక్షిలో బడవేయువాడు.

భిక్షకమండలిలో యువతీ యువకులు కొందఱుండిరి. కనులు లేకున్నను మనసులతో చూచుప్రేమికుల జంటఒకటి అందులో నుండెను రాత్రింబవళ్ళు వారి ప్రణయము సాగుచుండెను. చౌదరిగారికీ విషయము తెలిసినది అంధయువతిని ఒక ధనికునకు విక్రయించినాడు. యువకునికి కొరడా దెబ్బలతోపాటు అనాథశరణాలయమునుండి బహిష్కారము శిక్ష నిలువనీడలేని ఈ అంధయువకుడు ఫుట్‌పాత్‌పై కాలక్షేపము చేయుచుండెడివాడు ఒకనాటిరాత్రి యజమాని కొట్టిన కొరడా దెబ్బలు ఎంతయో బాధించినవి. దుర్భరమైన చలి దానికి తోడు ఫుట్‌పాతలపై పోలీసు

---

[1] ఉ. క. పు. 16.

వారి బెదిరింపులు: అర్ధరాత్రి వీధులు తిరుగుచు ఒక ధనికుని ఇంటి ముందు పడియుండెను. సౌధాంతర్భాగమునుండి వినవచ్చు సంగీతములో ప్రేయసి కలకంఠము వినవచ్చినది. శారీరక మానసిక బాధలతో ఆ యింటిముందే అనాథశరణాలయములో వెలిగిన ప్రణయజ్యోతి చల్లారినది స్వార్థపరుల కుత్సితప్రవృత్తి దిక్కులేని అంధకుల దీనావస్థ ఈ కథయందు ప్రధానముగ చిత్రింపబడినది.

శ్మశానం: ఈ కథలో నొకానొక వ్యక్తి సత్యాగ్రహోద్యమమున ప్రాణము లర్పించిన వృత్తాంతము వర్ణితము. ఊరుపేరులేని వ్యక్తి దేశమునకై ఎంత త్యాగమొనర్చినను లెక్కలోనికి రాదను అంశము ఇందు నిరూపితము

అభ్యుదయ భావములకును, వాస్తవిక చిత్రణమునకును ప్రతీకలుగానున్న రాయపురిగారి ఈ కథలను వేమూరి ఆంజనేయశర్మగారు అనువదించిరి

బిచ్చగాడు అను కథలో అనాథశరణాలయమునుండి క్షతగాత్రుడై, బహిష్కృతుడై, చలితో వణకుచు నగరి మధ్యమున తిరుగు నప్పుడు రాయపురిగారు "విధవరాలి కన్నీరులాగ మంచు వర్షిస్తున్నది" అనుటయు శ్మశానం అను కథలో అనామకుని చితి "పేదవాడి గుడిసెలాగా భగభగమండిన" దనుటయు రాయపురిగారి అభ్యుదయ, వాస్తవికతామార్గమునకు నిదర్శనములు. వారి ఆదర్శములు అనువాదమునందును చక్కగా ప్రతిబింబించుచున్నవి.

అనుకోని ఆపదలు: డా॥ రషీద్‌జహాఁ రచించిన "నయీ ముసీబతేఁ" అను కథకు తెలుగుసేత. చంద్రమౌళిశాస్త్రిగారి ఈ అనువాదముకూడా మూలమున కతీతముగా సాగినది. ఏపదమున కా పదము తెలుగులో గూర్చినట్లున్నది. కొన్ని సందర్భములందు మూలమున కెట్టి సంబంధము లేక అనువాద మొనర్పబడినది.

యుద్ధము వలన ఉన్ని, పెట్రోలు, పంచదార, మున్నగు పదార్థముల ధరలు విపరీతముగ పెరిగిపోయినవి. కొందఱు నారీమణులు తమలో తాము ఈ అంశమును గూర్చియే చర్చించుకొనుట ఈ కథయందలి సారాంశము. పాత్రల సంభాషణావైఖరి చమత్కారపూర్వకముగను సరసముగను గలదు. అనువాదములో మాతృక యందలి ఈ గుణములు లోపించినవి; శాస్త్రిగారి అనువాదమునందు ఉర్దూ భాషలోని నుడికారములు, భాషాచమత్కృతులు తారుమారైనవి. ఈ ఉదాహరణములు వీరి అనువాద రీతిని వ్యక్తీకరించుచున్నవి.

1. "బిచారా జా- బడ్‌బడాతేహుయే ఖానేకేలియే తయార్‌హోనే చలేగయే బస్ ఇత్నా సమఝ్‌మే ఆయా "ఖైరు తుమ్ మత్‌లేనా ముఝెతో ఊన్ చాహియే. మై జరూర్ ఖరీదుంగా"

ఉన్నిధర పెరిగిపోయినందున కొందఱు కొనుటకు సందేహించుచున్నారు. మఱికొందఱు విధిలేక కొనుటకే నిశ్చయించుకొనిరి. ఆ సందర్భమునందలి వాక్యమిది. శాస్త్రిగారీ వాక్యముల నిట్లనువదించిరి

"బాబయ్యగారు తనలో తాను ఏదో గొణుక్కుంటూ అన్నం తినటానికి తయారయి వెళ్ళిపోయాడు చాలు. ఇంత జ్ఞాపకం వచ్చింది.

బాబయ్యగారు గొణుగుచు మాట్లాడిరి. వారి మాటలలో నింత మాత్రిమస్థమైనది అనుభావము మూలమున కలదు "బస్ ఇత్నా సమఝ్‌మే ఆయా" అను వాక్యమునకు గలఅర్థము అనువాదమున పూర్తిగ మారిపోయినది.

2 "నౌకరోంకి వర్దియాఁతో హర్‌సాల్ సౌ సవాసౌ మె బన్‌జాతీథీఁ. ఉన్‌కొతో ఆదత్‌హై బౌంధా ధంద్ ఉరానే కీ."

సేవకులకై బట్టలుకుట్టించుటకు నూఱు నూట పాతిక రూపాయలు సరిపోవు చుండెను. అజాగ్రతగా నుపయోగించుట వారికి అలవాటైకదా అని పై వాక్యమునకు సందర్భార్థము. శాస్త్రిగారి అనువాదము మాతృకకు భిన్నముగానున్నది

"ఉద్యోగం రోజుల్లో అయితే ఏటా వంద నూటయాభై రూపాయల్లో బట్టలు అయ్యేవి" పు. 3

3. "హాఁ యహీతో మైభీ కహతీ హుఁ కె ఏ పెట్రోల్‌పర్ పాబందీ సర్కార్నే క్యోఁ లగాదీ. అబ్ దామ్ దో రూపేచార్‌ఆనే గ్యాలన్‌థే; చలో తీన్‌రూపే కర్దేతీ లైకిన్ ఏ బారాబొర్ చాదా గ్యాలన్‌కీ ఖైద్ నలగ్తీ జిస్‌కేపాస్ దామ్ హోతే వో ఖరీద్‌తా జిస్‌కేపాస్ నహోతే వో నఖరీద్‌తా."

పెట్రోలు వాడకముపై ప్రభుత్వము విధించిన నిర్బంధమునుగూర్చి జరిగిన సంభాషణఇది. నియమిత పరిమితిలో పెట్రోలు నుపయోగించవలయునని నిర్బంధించుటకంటె ధర నధికముచేసిన సరిపోయెడిదిగా! శక్తియున్నవాడు కొనేవాడు లేనివాడు మిన్నకుండునుగదా అని ఈ వాక్యమున కర్థము

"అప్పనూ! నేననేదీనూ, ఈ పెట్రోలు మీద కంట్రోలు ఎందుకు పెట్టారు సర్కారు. ఇప్పుడు గ్యాలను ఖరీదు రెండు రూపాయల పావలా ఉంది. నడిచిచూడు మూడురూపాయలు చేస్తుంది కాని ఈ పన్నెండు మరిపధ్నాలుగు గ్యాలన్లనూ ఖైదు పెట్టదుగా ఎవరిదగ్గర జేరసారాలుంటాయో వారే కొంటారు". పు. 5

"చలో తీన్ రూపే కర్ దేతి" = పోనీ రెండుకాదు మూడు చేసిన బాగుండేది అనిభావము. నడచిచూడు మూడురూపాయలు చేస్తుంది అని శాస్త్రిగా రనువదించుటలో అర్థమేమియో తెలియదు.

4. "ఏలో తో మైక్యాకరూం దూల్హాన్. కూకింగ్ చీజ్ తో ఐసా గాయబ్ హుఆహై అబ్ దిఖాయీ నహీ దేతా మై అస్లమ్ కీ దుకాన్ పర్ గయా ఔర్ కహాకె భయ్ సోనేకే మోల్ దేదో. హమారే బచ్చేకా దిల్ బొహత్ చాహ్‌రహాహై".

కుకింగ్ చీజ్ (Cooking cheese) ను ఎత్తుకెత్తు బంగారు ఇచ్చి కొనుటకై నను ఒకరు సిద్ధముగా నున్నట్లు ఒకరు చెప్పిన వాక్యమిది. దూల్హాన్ పదమును భిన్నార్థములో గ్రహించియు, కూకింగ్ అనుపదమును వేరొక అర్థమున గ్రహించియు, శాస్త్రిగా రనువదించుట సమంజసముగా గన్పట్టదు.

"పెండ్లికూతురుకు మంచిగాజులు కావాలంటె దొరకటంలేదు. ఇప్పుడైతే అవుపించనే అవుపించవు. నేను అస్లమ్ కొట్టుమీదికిపోయాను అడిగాను బొంబాయిలో ఉన్నరేటుకే బంగారము ఇయ్యమని" పుట—8

"దూలహాన్ కుకింగ్" దీని నొకపదముగానే గ్రహించి " కింగ్" ను 'కంగన్' అనుకొని గాజులు అనియు, 'భయి' అను పదమును బొంబాయి అనుకొనియు చేసిన అనువాదమిది. మూలముతో ఏమాత్రము పొత్తుకుదరని అనువాదమిది.

5 "ఏ సచ్ తో హై ఇస్ కమ్‌బఖ్త్ వాటిద్ నే నతో లక్డీ పూరీడాలీ ఔర్ న హీటర్ అబ్తక్ లగాయా. అర్జమంద్! జరా ఇస్‌ఘంటీకా బటన్ దబానా , చార్ చార్ తో హీటర్ హైం ఔర్ ఫిర్ భీ బైరే సర్దీమే సుకడాకరో. లో ఆజ్ తో కోయిలా భీ దోఆనేసే దోరూపయా హోగయా. బిజ్లీహి సస్తీహై.

సేవకుడు తనగదిలో వెచ్చదనము గలిగించుటకై కట్టెల మంటనుగాని ఎలక్ట్రిక్ పొయ్యినిగాని వెలిగించనప్పుడు ఒకరనిన మాటయిది. శాస్త్రిగారు "హీటరు"ను 'పేడ్' గాచదివి ఈ వాక్యము ననువదించిరి. "పేడ్" చెట్టుఅను అర్థము గ్రహించినను వాక్యమున కర్థముకూడ పొసగలేదు.

''ఇది నిజమేగదా! ఆ తాత్రిష్టుడు వాజద్ లేకపోతే కష్టమైనా పూర్తిగా వేశాడుగాడు. చెట్టుకూ పోలేదు. అరిజ్మంద్. కొంచెమంత బటను నొక్కి బెలుకు . . నాలుగునాలుగు చెట్లున్నాయి అయినా మళ్లీకూచో చలిలో ముడుచుకుపో'' పు—7.

ఇన్ని హీటర్లు ఉన్నా చలికి వణకివణకి పోవలసినదేనా అను మాతృకలోని భావమును గ్రహింపక పదమునకు పదమువేసి అనువదించిన విధాన మిది! హీటర్ అనుపదమును ఉర్దూలిపిలో వ్రాసినచో లిపివ్రాతలోను ఒకటిరెండు సంకేతములు తారు మారైనను "పేడ్" అను భ్రమకలుగుట కవకాశము కలదు. శాస్త్రిగా రీపదమును గ్రహించునప్పుడిట్టి భ్రమకు గురియైరి.

"వాజద్ చెట్టుగొట్టడానికి పొయ్యాడు" అని అనువదించుట కిదియేకారణము. దీనికి మూలము ''వాజిద్ హీటర్''లగానే చలాగయా" అని కలదు. పు—8

6 ''ఫ్రూట్‌సలాడ్ బగైర్ ప్రోన్స్‌కేబచ్చే తో చఖ్తేహి నహీ"

ప్రోన్స్‌లేని ఫ్రూటు సలాడ్‌ను పిల్లలు రుచియైనను చూడరని భావము. ''బగైర్'' అనుపదమునకు "లేకుండా" అను పదమునువేసి వాక్యము నట్లే అనువదించుటవలన వాక్యములోని అర్థము తారుమారైనది.

''ఫ్రూట్‌సలేడ్ లేకుండా ప్రోన్స్‌ను పిల్లలుకూడా ముట్టరు.''

పేదలకోరిక:- ఉపేంద్రనాథ్ అష్క్‌గారు రచించిన 'దాచీ' అను కథకు చంద్రమౌళిశాస్త్రిగారి తెలుగుసేత. వీరు కథను మాతృక ననుసరించి అనువదించి కథ పేరును మాత్రము మార్చిరి.

దాచీ' ఒక ఒంటెపిల్ల. బాఖర్ తన అల్లారుముద్దుమనుమరునకు దాచీని కొని సంతోషముతో స్వగృహమునకు పయనమై మార్గమధ్యమునగల గ్రామమునందు కొన్ని గంటలకాలము ఆగెను. ఒంటెకు చక్కని పక్కకొరకై అన్వేషణ మారంభించి గ్రామాధికారింటి కేగెను. గ్రామాధికారి అందమైన డాచీపై కన్నువేసి మారుచెప్పుటకైనను అవకాశమొసగక బాఖర్‌కు కొంత అధికధనము ముట్టజెప్పి దానినితనయింట నుంచుకొనెను. బాఖర్ కనినకల లన్నియు వ్యర్థములైనవి. చేయునది లేక నిట్టూర్పులువదలుచు స్వగృహమున కేగిన బాఖరు మానసికాందోళనము వర్ణనాతీతము.

ఈకథ ననువదించుట యందు ఉర్దూభాషలోని పలుకుబడిని పదానువాదపద్ధతిలో ననువదించుటవలన కొన్ని కొన్ని సందర్భములు పేలవముగ గన్పట్టుచున్నవి. బాఖర్ సంతకు వెళ్ళినపుడు తనఅమ్మాయికి ఏమైనను తెచ్చువాడు. ఒకసారి మిఠాయి, మరొకసారి ఆటబొమ్మలు తెచ్చి ఇచ్చువాడు. ఈసందర్భము నందలివాక్యము.

"ఎప్పుడైనా మిఠాయీ ఎప్పుడైనా ఆటబొమ్మలు తెచ్చి ఆమె వడి నింపుతోండేవాడు" పు—16. "కభీమిఠాయి కభీగుడియా" అను వాక్యమున కభీ అను పదమును 'ఎప్పుడైనా' అని శాస్త్రిగా రనువదించిరి.

గులాబి చెక్కిళ్ళు:— ఇబ్రిహీంజలీస్ గారు "జర్ద్ చహెరే" అను కథానిక యందు ఒకరికొకరు త్యాగముచేయ సంకల్పించిన సోదరీ సోదరుల అనురాగమును రసవంతముగ జిత్రించిరి. ఈకథానికలోని సంభాషణలు, వర్ణనలు, సన్నివేశములు కవితాసౌరభమును గుబాళింపజేయు నట్లున్నవి.

ఆసఫ్ అను యువకుడు వ్యాకులహృదయముగు తన సోదరి చెక్కిళ్ళపైని పచ్చనివర్ణము(వైవర్ణ్యము)నుజూచి విచారించుచుండెను సోదరివివాహ మతనికిసమస్యగా బరిణమించెను. తండ్రివలె వకీలువృత్తిని స్వీకరించి స్వతంత్రజీవనము గడపవలయునను ఆశయము కలవాడు ఆసఫ్. కాని తండ్రి అకాలమరణము వలన ఆదర్శమును మార్చుకొనవలసివచ్చినది. ఒక ఉద్యోగము సంపాదించి అహోరాత్రములు కష్టపడి ఆసఫ్ తన సోదరి వివాహము నిమిత్తమై కొంతధనము కూడబెట్టెను. వెదకి వెదకి వరునికూడ సంపాదించి సోదరివివాహముచేసెను. చెల్లెలు అత్తవారింటికి వెడలినప్పటి నుండి ఆసఫ్‌కు ఒంటరిజీవనము దుర్భరమైనది. నిర్విరామముగ కృషిచేసినందు వలన శరీరముకూడ కృశించియుండెను, దీనికి తోడుగ తా ప్రేమించిన యువతి తనకు లభించనందునను ఆసఫ్‌హృదయము ఛిన్నాభిన్నమయ్యెను. ఏకాకిగ జీవించుటకంటె తోడుగా నెవరినో యొకరిని పరిణయమాడుట శ్రేయస్కరమను నిశ్చయమునకు వచ్చి ఫాక్స్ అను క్రైస్తవయువతిని పెండ్లాడెను. కాని కొన్నినాళ్ళకే అతనిజీవితాంబరమున విషాదమేఘములు క్రమ్మినవి,

ఒకనాటి సాయంకాలము ఆసఫ్‌భార్య విరహగీతిక పాడుచుండెను. ఆ సమయమునందే తన సోదరిభర్త ఇంటియెదుట ప్రత్యక్షమయ్యెను. ఫాక్స్ ఆతనిని చిరునగవుతోనెదుర్కొనెను, అతడు తనకు చిరకాలమిత్రుడనియు తన్ను దర్శించుటకు వచ్చుచుండుననియు ఫాక్స్ తెలిపినపుడు ఆసఫ్ విర్విణ్ణుడయ్యెను.

బంతిపూలవలె పచ్చనివర్ణములో నుండిన తనసోదరిచెక్కిళ్లు వివాహానంతరము గులాబిచెక్కిళ్లుగా మారునని ఆసఫ్ ఆశించియుండెను తన సోదరికి దాంపత్యసుఖము లేదను విచారనుతోపాటు తనభార్య కుటిలప్రవృత్తియు ఆసఫ్‌కు విషాదహేతువులైనవి. తనచెల్లెలి దాంపత్యసుఖమునకు తనభార్యఅభ్యంతరము కలిగించుచున్నదని నిశ్చయించుకొని ఉన్మత్తఅవస్థలో నొకసారి మార్గమధ్యమునందే భార్యను కత్తితో పొడిచిచంపెను.

ఆసఫ్ ఆశయమును ప్రతిబింబించునట్లుగా కవి ఈకథపేరు జర్ద్‌చహెరే అని పెట్టియుండెను. అనువాదకులు గులాబిచెక్కిళ్ళుగా మార్చిరి. ఆసఫ్ తనసోదరి చెక్కిళ్ళయందు గులాబి రేఖలు చూడవలయునని సంకల్పించెను. అది నెరవేరినదో లేదో తెలియదు కాని అనువాదకులు మాత్రము కథానామమును మార్చి ఆసఫ్ ఆశయమును వ్యక్తీకరించిరి.

ఇబ్రహీంజలీస్‌గారి సజీవరచనను అనువదించుటలో చంద్రమౌళిశాస్త్రిగారు సామాన్యమైన అనువాదపద్ధతినే అవలంబించిరి. పాత్రల గుణశీల చిత్రణమునందు సన్నివేశకల్పనములందు జలీస్‌గారు కవితాసౌందర్యమును వర్షింపజేసిరి. అనువాదమునం దీగుణము మృగ్యము.

ఆసఫ్‌నే బర్జీస్‌జహాఁకే బాప్‌కో బేతకల్లుఫ్ దోస్తోఁ ఔర్ అజీజోఁసే కహలాభేజా కె వో బర్జీస్‌సే మొహబ్బత్ కర్తాహై.

"ఆసఫ్ బర్జీస్‌జహాఁ తండ్రికీ, ఆమె ఇబ్బందిలేని చుట్టాలకూ ఇంకాఅలాంటి సన్నిహితులకు కబురుపెట్టాడు, తాను బర్జీస్‌జహాఁను మనసారప్రేమిస్తున్నానని" పు–309

బేతకల్లుఫ్ అనుపదమును వీరు బేలక్లీఫ్‌గా స్వీకరించిరి. అర్థముకుదించిన అనువాద విధానము, పదసామ్యమువలన భిన్నఅర్థముగ్రహించుపద్ధతి ఇందును కన్పట్టును.

అల్బత్తా ఉస్‌కి జవానీకే ఖలామే ఉస్‌కో ఇత్నా సన్నాటా మహసూస్ ఔర్ డర్ మహసూస్ హోతాకే ఉస్కాజీ చాహతాకే ఇస్ ముహీబ్‌సన్నాటే మే ఉసతస్ కాంచ్‌కి చూడియాఁ బజ్నేలగీఁ.

ప్రేమించిన యువతి లభించనపుడు ఆసఫ్‌కు ఏకాకిగా జీవించుట దుర్భరమైనది. అగాధమైన ఈ ఏకాంతములో అప్పుడప్పుడు కంకణధ్వనులు వినిపించెడివి, అని మూలమునందలి భావము, 'బజ్నేలగీ' అనుపదమును బిక్నేలగీ అని అనువాదకులు గ్రహించిరి. దానిని అనుసరించి వాక్యమునుకూర్చుట మాతృకలోని అర్థమును రూపుమాపినదైనది ఈ వాక్యానువాదమును గమనించినచో నిది స్పష్టము.

"ఈ భయంకరమైన అల్లకల్లోలంలో అద్దాలగాజులు అమ్మటంమొదలెట్టింది." పు–309.

## కొత్త చట్టము

సాదత్ హసన్ మంటోగారి 'నయాఖానూన్' అనుకథను చంద్రమౌళిశాస్త్రిగారు కొత్తచట్టము అను పేర ననువదించిరి. ఇండియాచట్టము ప్రవేశపెట్టిన సందర్భమును పురస్కరించుకొని ఆచట్టము సామాన్య ప్రజానీకమునకు ఆశాభంగము గలిగించినదని మంటోగారీకథయందు సూచించిరి.

మంగూ విద్యావంతుడు కాకున్నను వినికిడివలన కొన్ని రాజకీయాంశములను గ్రహించుచుండెడివాడు టాంగా ఆతని జీవిక. కొత్తచట్టము రానున్నదని విని ఇక క్షణములో దేశము క్రొత్తఊపిరిపీల్చునని సంతసముతో గంతులువేసిన ఆశాజీవి అట్టి ఆవేశమున నొకసారి మంగూ ఒకానొక ఆంగ్లేయునితో స్పర్థవహించెను ముష్టాముష్టి రణంబువరకు వ్యవహారము ముదిరినది. ఫలితము మంగూ బందీఖాన పాలగుట.

మంటోగారిది సునిశితమైన లేఖిని. భాషయందును భావములందును తీవ్ర శక్తి కలదు ఎత్తిపొడుపు, అధిక్షేపధోరణి వీరిరచనకు ప్రాణమువంటిది అలతిఅలతి పదములతో వాడిచురుకులు వేయుశక్తి మంటోగారి లేఖినికి గలదు. శాస్త్రిగారి అను వాదమునందు మాతృక యందలి ఈధర్మములు లోపించినవి

వో ఆజ్ నయేఖానూన్ కా దేఖ్నేకేలియే ఘర్ సే నిక్లా ఠీక్ ఇస్‌తరహ్ జైసే గాంధీ యా జవహర్‌లాల్‌కే జులూస్‌కా ఇంతెజార్ కర్నేకేలియే నికల్తాథా. లీడ రోంకి అజ్మత్‌కా అందాజా ఉస్తాద్‌మంగూ హమేషా ఉన్‌కే జులూస్ కె హంగామోం ఔర్ ఉన్‌కే గలేమే డాలేహుయే ఫూలోంకే హారోంసే కియాకర్తాథా అగర్ కోయీ లీడర్ గేందేకేఫూలోంసే లదాహుఆహో తో ఉస్తాద్‌మంగూ కేనజ్దీక్ వో బడాఆద్మీథా. ఔర్ అగర్ కిసీ లీడర్‌కే జులూస్ మే భీడ్ కే బాఅస్ దోతీన్ ఫసాద్ హోతే రహ్ జాతేం తో ఉస్‌కీ నిగాహోంమే వో ఔర్ భి బడాథా. అబ్ నయేఖానూన్ కొ వో అప్నే జహన్ కే ఇసీ తరాజూ మే తోల్నా చాహతాథా.

''మంగూ కొత్తచట్టపు ఫలితాన్ని చూడబోయినాడు. ఊరేగింపుల వైభవ మును, అలజడిని, నాయకుల మెడలో వ్రేలాడు పూలదండలనుబట్టి మంగూ నాయకుల గొప్పతనాన్ని నిరూపించుకునేవాడు. పుష్పహారముల భారముతో క్రుంగినవాడు ఈతని దృష్టిలో మహానాయకుడు. ఊరేగింపులగుంపులో ఒకటిరెండు సంఘటనలు జరిగినట్లైన మంగూదృష్టికి అదొకగొప్ప. ఆనాయకుడే గొప్పనాయకుడు కొత్తచట్టాన్ని మంగూ ఈదృష్టితోనేచూడబోయాడు'' అని మాతృకలోనిభావము.

"అత డోనాడు కొత్తచట్టపు ప్రయోగాన్ని చూట్టానికని ఊళ్ళోకి బైల్దేరాడు ఎలాఅయితే గాంధిగారు జవహర్లాలుగారి ఉత్సవోత్సాహాన్ని చూడటానికి బయలు దేరుతారో అలా! గొప్పనాయకుల మెడలో దండలా మంగూపంతులు కొత్త చట్టాన్ని తనమెడలో ఎప్పుడుధరిస్తాడు. ఎవరైనా బంతిపూల దండవేసుకుంటే ఎంతఆనందంగా అందంగా అనిపిస్తుందో మంగూ పంతులుకు గూడా తన క్రొత్త ఖానూను మీద అలానే ఉండేది. సభలో నాయకుడికి ఉపన్యాసం మీద ఎంత ఉత్సాహమూ ఉబలాటమూ ఉంటుందో మంగూపంతులుకు తన కొత్త ఖనూన్ ప్రచారం చేయాలని అంతగానూ ఉండేది." పు—204

పామరులు ఊరేగింపులను గూర్చి దేశనాయకులగూర్చి వహించు అభిప్రాయ ములను, మంటోగారు హాస్య అధిక్షేపధోరణిలో వ్యక్తీకరించి యుండిరి. అనువాద మునందు మూలమునందలి అభిప్రాయముకాని, వ్యక్తీకరణవిధానముకాని మందునకైనను గన్పట్టవు.

ఆపా: ఒక యువకుని మనసారా ప్రేమించి, ఎన్నడును హృదయగతాను రాగమును స్పష్టముగ వ్యక్తీకరించక చివరకు కుమిలికృశించిన 'ఆపా' భగ్నప్రణయము నితివ్రలముగా గ్రహించి ముంతాజ్‌ముఫ్తీ గారు కరుణరసాత్మకమైన 'ఆపా'అనుకథను రచించిరి. చంద్రమౌళిశాస్త్రిగారు దానిని 'అప్ప'అనుపేర తెనిగించిరి ముఫ్తీ భాష, పలుకుబడి విశిష్టమైనది. ఏపదమునకాపదమును, ఏవాక్యమునకావాక్యమును భిన్నభిన్న ముగా నష్టముజేసికొని శాస్త్రిగారీకథ ననువదించినట్లుతోచును. ఏకసూత్రత మృగ్యము.

కథారంభమునందే ఈఅనువాదపద్ధతి ప్రత్యక్షమగుచున్నది.

జబ్‌కభీ బైరేబిరాయె ముఝె ఆపా యాద్ ఆతీహై తో మేరే ఆంఖోంకే ఆగే ఎక్ ఛోటాసా బిల్లోరిదియా ఆజాతాహై జొ మద్ధమ్ లూసే జల్‌రహాహో.

"అప్పుడప్పుడు నాకు కూమని కూచోబెట్టుకున్న అప్పజ్ఞాపకం వస్తోంటుంది. అప్పుడు నాకెలా అనిపిస్తోందంటే నా కండ్లఎదుటనే ఏదోఒక మధ్యలో వెలుగుచూన్న చిన్నబిళ్ళోరి అద్దాన్ని ఇవ్వవస్తోందా అన్నట్లుగా" పు—263

"బైరేబిరాయె" నుడికారములో "బిరాయె"ను విడిగాగ్రహించి "కూచోబెట్టు కున్న"అని అనువదించిరి. మద్దమ్‌ను మధ్యమ్‌అనుకొని ఏదోఒక మధ్యలో అని తెని గించిరి. బిల్లోరి దీపము బిళ్ళోరిఅద్దముగా మారినది. దియా అనగా దీపము. కాని అనువాదకులు 'దియాఆజాతాహై' అనుపదమును క్రియగాగ్రహించి "ఇవ్వవస్తోందా"

అని తెనిగించిరి. పూర్తివాక్యమున కర్థము గ్రహించుటయే కష్టముగనున్న వాక్యమిది. ఉర్దూపదములను రూపసామ్యముచేత భిన్నార్థములందు స్వీకరించిన సందర్భములిందును కొన్నికలవు.

1 వో భీగిభీగి ఆంఖేఁ ఛూలే మే నాచ్తేహుంయే షోలోంకి తరహ ఝూమ్తీఁ

''ఛూలే'' అను పదము శాస్త్రిగారు చదివినప్రతిలో నచ్చుపొరపాటువలన ఝూలె అని యుండవచ్చును. అందువలన ఊయెల అర్థమును గ్రహించి శాస్త్రిగా రీ వాక్యము నిట్లనువదించిరి

"ఇక ఆ తడిసినకళ్ళు ఉయ్యాల్లో ఎగురుతూ ఆడుతోన్న నిప్పుకణాల్లాగా ఊగుతోంటాయి " పు—269

ఊయెలలో నిప్పుకణము లెట్లుండునో ఊహింపరాని అంశము. కేవలము పదములనే కాక నుడికారములను కూడ శాస్త్రిగా రీపద్ధతిలో ననువదించిరి.

'ఇలాఅని ఆమె వంటింట్లోకి పోయింది నేను పండ్లు పటపటాకొరికినాను. అనుభావము మాతృక యందు కలదు.

2. ఏ కహకర్ తో వొ బావర్చీఖానెమె చలీగయీ ఔర్ మై దాంత్ పీస్ రహీథీ.

దాంత్ పీస్నా- ఇది ఒకజాతీయము పండ్లుకొరుకుటఅని అర్థము శాస్త్రిగారి అనువాద మిట్లుకలదు "ఈమాట అంటూ ఆమె వంటింట్లోకి వెళ్ళిపోయింది. మరి నేను పళ్ళు తోముకుంటున్నాను." పు—273

3 'బాజీకే ఖహఖహోఁసే కమ్రా గూంజ్ఉఠా. ఔర్ బుద్దూకీ బాత్ అగయీహోగయీ.

"అగయీ హోగయీ" ఉర్దూలో చక్కని పదబంధము. దీనికి శాస్త్రిగారి పదానువాదమిట్లున్నది. 'బుద్ధుమాట వచ్చింది పోయింది అయింది. పు—277

4. ''నీ ముఖమైనా చూచుకో, కొంచెం ఆ ముఖం కడుక్కొనిరా'' అని నుడికారార్థములో గలవాక్యము.

షక్ల్ తో దేఖో అప్నీ. పహలె ముహ్ ధోఆవో.

షకల్ అనుపదాన్ని ముష్కిల్ అనుకొని ఇట్లనువదించినారు శాస్త్రీగారు

మా ఇబ్బంది ఏమిటో చూడు. ముందు మొహం కడుక్కురా'' పు—279

5. ఉర్దూవాక్యము నందలి పదక్రమము నట్లే అనువాదమున పాటించిన సందర్భములు ఈఅనువాదమున గలవు

“ఆపా ఇస్‌సే మిల్నాతో క్యా దాత్‌తక్ కర్నా పసంద్ నహీ కర్తీ థీఁ.”

“అప్ప ఆమెను కలిస్తే ఏమాటదాక చెయ్యటానికి ప్రీతిపడదు” పు—273

“మాట్లాడటానికైనా ఇష్టపడదని” మూలమునుండ ఏమాటదాకచెయ్యటానికి” అనుటలో భావమేమియో తెలియదు.

ఉర్దూ వాక్యరచనా విధానమునకును, తెలుగు వాక్యముల కూర్పు పద్ధతికిని ఎంతయు భేదముకలదు. వాక్యరచనా సంప్రదాయమును పాటింపక చేసిన అనువాదము వలన వాక్యార్థమే తెలియుటలేదు. అన్వయముకుదరని ఇట్టివాక్యములు పదములు వీరి అనువాదమునం దెన్నియోకలవు

## అబ్బూఖాన్ – అతనిమేక:–

డా. జాకిర్‌హుస్సేన్‌గారు “అబ్బూఖాన్‌కీ బక్రీ” అనుపేర రచించిన కథానికకు వేమూరి ఆంజనేయశర్మగారొనర్చిన ఆంధ్రానువాదమిది జాకిర్‌హుస్సేన్‌గారు బాలబాలికల నిమిత్తమై యిట్టికథలు పదునాలుగు రచించిరి. ఇవిఅన్నియు “అబ్బూఖాన్ కీ బక్రీ ఔర్ చౌదాఅవుర్ కహానియాఁ” అను కథానికాసంపుటము రూపమున నిటీవల బ్రకటింపబడినవి.[1]

అబ్బూఖాన్ మేకలను పెంచుటయు నవియన్నియు స్వేచ్ఛాప్రాంతములకు పారిపోవుటయు తుదకు తోడేలున కాహారమగుటయు నిందలి కథాంశము మేకల పెంపకమునుగూర్చి అబ్బూఖాన్ వహించిన శ్రద్ధ, చాందినీ అను మేక నాతడు ప్రాణతుల్యముగ చూచుట మున్నగు అంశములు సరసమైన సరళిలో బాలురకు సుబోధమగునట్లును, హృదయాహ్లాదకరముగను వ్రాయబడినవి. ప్రాణికోటి స్వేచ్ఛాస్వాతంత్ర్యములు కోరుట సహజమనియు, నట్టిస్వేచ్ఛ ఒక్కొక్కసారి ప్రాణాంతకముగ బరిణమించుననియు పెద్దలఛత్రఛాయలు బాల్యదశలో నత్యవసరమనియు జాకిర్‌హుస్సేన్‌గారు ఈకథయందు సూచించిరి.

వేమూరి ఆంజనేయశర్మగారి అనువాదము మాతృకవలె సరళశైలిలో నడచినది. మేకలను అబ్బూఖాన్ ప్రేమించిన విధము. అనువాదములోని మాధురి మున్నగు

[1] మక్తబె జామియెనయీదహిలీ లిమిటెడ్‌వారీగ్రంథమును 1963 సంవత్సరములో బ్రకటించిరి.

నవి సరసముగ నిందుచిత్రింపబడినవి. శర్మగారి అనువాదవిధానమునకు ఈఘట్టము
తార్కాణముగచూపవచ్చును.

ఏబకీరి దేఖ్నే మేహి అచ్ఛీనథీ మిజాజ్ కీభీ బొహత్ అచ్ఛీధీ. ప్యార్
అబూఖాన్‌కా హాధ్ చాట్తీ. దూధ్ చాహేతో కోయీ బచ్చా దోహ్‌లే నలాత్‌మార్తీ
దూధ్‌కేబర్తన్‌కో గిరాతీ. అబూఖాన్‌తో ఇసపర్ లట్టూ హోగయేధే ఇస్కానా
చాంద్నీ రఖాధా.

" .. దాని స్వభావంకూడా మంచిదే, అబ్బూఖాన్‌చెయ్యి నాకుతు
ఉండేది. పసిపిల్లవాడువచ్చి పాలుపిండినా గంగగోవులాగా పాలిచ్చేది. అబ్బూఖాన
నకు మేకఅంటే ప్రాణంతో సమానం. దానికిచాందినీ అని పేరుపెట్టారు [1] పు.-1
మూలమును భావప్రధానముగ ననునదించిన సందర్భమిది, శర్మగా రనువదించిన క
లన్నియు విశ్లేషభావప్రధానముగ నున్నవి.

తల్లి: రుక్కైయ్యారీహానాపేర డాక్టరు జాకిర్‌హుస్సేన్‌గారు వ్రాసినకథఇది
పూర్వోదాహృత కథానికాసంపుటములోని కథలన్నియు మొదట రుక్కైయ్యారీహానాగా
పేర ప్రకటింపబడినవి. తరువాత జాకిర్‌హుస్సేన్‌గారు తమపేర ప్రకటించిరి. రు
య్యారీహానాగారు ఆ కథలను చెప్పిన ప్రకారము జాకిర్‌హుస్సేన్‌గారు రచించినట్ల
"అబ్బూఖాన్ కీ బకిరీ అవుర్ చౌదా అవుర్ కహానియా" అను గ్రంథపీఠికయందిట్ల
వివరించిరి.

మైనే ఇన్సే పాయిధీం ఇన్హీకే నామ్సే పహలే షాయికీం. ఫిర్ రుఖయాం
హనా హమేషాకో రుఖ్సత్ హోగయీం. జార్ మై ఏభీ నపూఛ్‌పాయూకే మైనే జిస్
తరహ్ ఇన్కీ కహానియోం కొ లిఖాహై వా ఇన్హే పసంద్‌భీహై యానహీ. లైకిన్
చూంకె మేరే హాధ్‌సే గయీంధీం ఔర్ లోగ్ ఇసేజానతేహైం ఇస్‌లియే అబ్ ఇన్హే
అప్నేహి నామ్సే షాయ కర్తాహూం.

హామిద్ అను యువకుడు తన తల్లి యొద్ద సెలవుగైకొని విద్యాభ్యాసమ
నిమిత్తము ఢిల్లీవెడలుట, విద్య పూర్తిగావించి ఉద్యోగముచేయుట, వివాహానంతరమ
కాపుర మచటనేచేయుట, ఈ ఏడేండ్లకాలమున హామిద్‌తల్లి పుత్రవియోగమున కుమి
కృశించుట, ఆమె తనకుమారునకు, మనుమలు మనుమరాండ్రకు అందమైనదుస్తుల

---

1 "తల్లి" ఉర్దూ కథానికా సంపుటము. ఆదర్శ సాహిత్యమాల- హైదరాబాదు.
ఏప్రిల్ 1957 ప్రచురణము.

కట్టియుంచుట, హామిద్ తల్లిని దర్శించుట మున్నగుఅంశములు "మా౹" అను కథలో వర్ణింపబడినవి. మాతృహృదయవేదనను జాకిర్ హుస్సేన్ గారు రసవంతముగ నిందు చిత్రించిరి.

ఆంజనేయశర్మగా రీకథనుకూడ మూలమునకు విధేయముగా రచించిరి. అనువాదము నందెట్టి మార్పులును లేవు.

మా౹కీ అంధీ అంఖోన్సే పానీకీ దోచార్ బూందే౹ టప్కే౹. ఔర్ ఇస్నే ఐసీ ఆవాజ్ మే జిస్మే నజానే మలామత్ కా జియాదా అసర్ థా యా మొహబ్బత్ కా కహా "బేటా తూ ఔర్ ఏ పూఛ్తాహై. ఏక్ ఏక్ దిన్ తేరేహీ ఇంతెజార్ మే కటాహై. సాత్ బరస్ మే ఏతయారీ కర్ పాయీ బేటా! సాత్ బరస్.

ఈఘట్టమునకు శర్మగారొనర్చిన అనువాదమును పరిశీలించిన వారి అనువాద రీతి సువ్యక్తమగును.

"తల్లి వేడివేడి కన్నీళ్ళు కార్చింది. మాతృదేవతావాత్సల్యం అనుపమానం .... నీకోసం నీపిల్లలకోసం ఈ వస్తువుల్ని సేకరించాను. నీకోసం ఎదురు చూసి చూసి కళ్ళు కాయలుగాచినవి. నాయనా! ఈ వస్తువుల్ని సేకరించటానికి ఏడుసంవత్సరాలు పట్టింది."[1]

వంకరగీత[2]: సాదత్ హసన్ మంటోగారు రచించిన కథకిది వేమూరి ఆంజనేయశర్మ గారొనర్చిన అనువాదము. ఒకసారి చదివినంతమాత్రమున వీరికథలో నంతర్నిగూఢముగ తొంగిచూచు అధిక్షేపధోరణి అర్థముకాదు ఇదిమంటోగారి రచనలోని విశిష్టత. తనభార్యతో లేచిపోయినవ్యక్తి చిత్రమైన చిత్తప్రవృత్తి ఇందు చిత్రితము. ఈతడు తన మిత్రునకు వ్రాసినలేఖలో లోకప్రకుత్సితప్రవృత్తిని ఆలోచనావిధానమును వంకరగీతలతో సూచించెను. ఆంజనేయశర్మగారు మూలమునందలి భావమునుమార్చక సంగ్రహరూపములో ఈ కథ ననువదించిరి. చిత్రమైన వ్యక్తి మనస్తత్వచిత్రణము నందు శర్మగారిఅనువాదము మూలమునకు సన్నిహితముగ నున్నది. ఒకటిరెండు సన్నివేశములను బరిశీలించినచో ఈఅంశము స్పష్టమగును.

"దోవ తిన్నగాఉన్నా ఆదోవలో అతడు సరిగానడిచేవాడుగాడు. జీవితమార్గం ఎప్పుడూ వంకరటింకరగా ఉంటుందని అతనిఅభిప్రాయం. అప్పుడప్పుడు మేమిద్దరం

---

1 పు—32

2 "తల్లి" కథానికాసంపుటములో ప్రకటితము.

కలిసి షికారుకు బయలుదేరితే అందమైన ప్రదేశాలు ఎన్నోఉన్నా అన్నింటినివదలి ఒకమూల వంకరటింకరగా ఉన్న పొదలదగ్గరకు వెళ్ళికూర్చునేవాడు." పు—87

''స్కూలులో చదువుకునేటప్పుడు ఒకసారి బ్లేడుపెట్టి కావలెనని చెయ్యికోసుకున్నాడు'' ఏమిటి యిది అంటే నొప్పిలోనే నా కానందమన్నాడు, ఎప్పుడూ టీకాలు వేయించుకునేవాడు. అటీకాలు మశూచికము, కలరా మొదలైనవి రాకుండా ఉండటానికి కాదు. టీకాలువేయించుకుంటే రెండురోజులుబాగా జ్వరంవస్తుందట. ఆజ్వరంలో వొళ్లు మండిపోతూఉంటె మనవాడికి ఆనందం.'' పు—89

ఆరోహణ—అవరోహణ[1]: ఖ్వాజా అహమ్మద్ అబ్బాస్‌గారు రచించిన కథను రవిగారుఅనువదించిరి. ఇది ప్రపంచకథలు అను కథానికాసంపుటమున ప్రకటితము. దూరపుకొండ నునుపు అను లోకోక్తిలోని అంతర్యమును అబ్బాస్‌గారు సరసముగా కథయందు సూచించిరి. కృతకమైన రంగురంగుల కాగితపుపూల కాకర్షితులై చేతిలోని మల్లెనువీడుట సాధారణమనస్తత్వము. నిర్మల్‌కుమార్ అను యువకుడు పాతకాలపుస్త్రీ అని భార్యయగుగోవిందిపై అప్పుడప్పుడు విసుగుకొనుచుండెను. ఉద్యోగము ఇల్లు రెండును ఆతనికి విసువును గలిగించినవి. గుమాస్తాగిరి తోపాటు గోవింది వంటి చలనములేనిప్రతిమతో సంసారము దుర్భరమనిపించినది. కథలు, గేయములు వ్రాసి సంపాదించిన కొంతడబ్బును కూడబెట్టుకొని రెండుమాసములు సెలవుతీసికొని కాశ్మీరమునకు విహారియాత్రకు వెడలినాడు. ప్రయాణములో శీరి అను అందాలబరిణతో పరిచయమైనది. స్నో, లిప్‌స్టిక్, రఫ్. పౌడరుమున్నగువానితో కన్నులుమిరుమిట్లుగొల్పు అందము నిర్మల్‌కుమార్‌ను ఆలోచనాసముద్రములో ముంచెత్తినది. శీరికి గోవిందికి స్వర్గమర్త్యముల అంతరమును కల్పించుకొనినాడు. శీరియు నిర్మల్‌కుమార్‌పై కొంత వ్యామోహమును ప్రకటించెను. ఎత్తయినకొండలపై విహరించునప్పుడు కళ్ళుతిరుగునని తనకు గోవింది ఒకచిన్నపొట్లములో నేదో కట్టియిచ్చియుండెను. పాతకాలపుబుర్ర అని చీదరించుకొని పొట్లమునట్లే జేబులో పడవేసియుంచెను. ఒకనాడు శీరికి కళ్ళుతిరిగినవి కొండలపైప్రయాణములో, తనకును అట్టిఅవస్థ ఒకసారి కలిగినది. గోవింది చిట్కా ఈసమయమున బాగుగ పనిజేసినది. శీరి అన్యులతోడను స్వేచ్ఛగా తిరుగుట చూచి నిర్మల్‌కుమార్ మనసు చలించినది. భారతీయ సంస్కారవిలసితయైన గోవిందియందు ఇపుడాతడు నిర్మలమైనప్రణయమును అర్థముచేసికొనగలిగెను. రవిగారి అనువాదము యథామాతృకము, ఆరోహణ అవరోహణలోని అంతరభావములను చక్కగావ్యక్తీకరించిరి.

---

[1] ప్రజాసాహిత్య పరిషత్తు తెనాలి 1954

మఱికొన్ని కథలు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన మఱికొన్ని అనువాదములు ఈ సందర్భమున పేర్కొనదగినవి. 'ఆగ్‌కా దరియా' అను సుప్రసిద్ధ నవలను రచించి ప్రశస్తివహించిన ఖురితుల్‌ఆయిన్‌హైదరీ గారి ఆస్మాన్‌భిహైసితమ్ ఈజాద్‌కియా, దేవేంద్రసత్యార్థిగారి లాల్‌మిట్టి, హయాతుల్లాఅన్సారీగారి చిచ్చాజాన్. అస్మత్‌చుగ్తాయిగారి దోజఖీ, రాజేంద్రసింగ్ బేదీగారి అప్నాదుఖ్‌ముఝేదేదో, ఖ్వాజాఅహమ్మద్ అబ్బాస్‌గారి డెడ్‌లేటర్ మున్నగు కథానికలను శ్రీబెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారు అనువదించిరి. అనువాదము మూలానుసారిగనున్నది ప్రత్యేకముగ గమనింపదగిన అంశము లిందులేవు.

ఇటీవల బహుముఖముగా విస్తరిల్లిన తెలుగుకథానికా సాహిత్యములో ప్రేమచంద్, క్రిష్ణచందర్ మున్నగు కథానికాకర్తల ఛాయలు అక్కడక్కడ గోచరించుచున్నవి. అనువాదసాహిత్యములో ఉర్దూ కథానికల ప్రభావమిట్టిది.

# శాస్త్రవాఙ్మయము

ఇలాజుల్ గుర్బా[1]: శాస్త్రగ్రంథానువాదములలో రెండు యూనానీ వైద్య గ్రంథములు ప్రత్యేకముగ పేర్కొనదగియున్నవి. వీనిలో ఇలాజుల్గుర్బా ప్రశస్తమైనది. ఇలాజుల్గుర్బా అను వైద్యగ్రంథమును గులాం అస్గర్గారు ఉర్దూ భాషయందనువదించిరి. ఉర్దూఅనువాదము ననుసరించి ఉమర్ అలీషా, మున్షీమహమ్మదు హుస్సేను అనువారు కలిసి ఆంధ్రమునందనువదించిరి పారశీక గ్రంథకర్తను గూర్చియు, ఉర్దూగ్రంథరచయితను గూర్చియు వివరించుటలో ఉమర్అలీషా, మున్షీ మహమ్మదుహుస్సేనుగారు కొంత పొరపడినారు గ్రంథకర్తను గూర్చి అనువక్తను గూర్చి అనువాదగ్రంథ ఉపోద్ఘాతమున వారిట్లు వ్రాసిరి.

"ఈ ఇలాజుల్గుర్బా" ఉర్దూభాషలో హకీం గులాం యిమాం తర్జుమా జేసెను."[2]

ఇది సరియైనది కాదు. హకీం గులాం ఇమాం పారశీ గ్రంథకర్త. అనువక్త అస్గర్ అలీ.

"ఈఇలాజుల్గుర్బా" అనగా పేదలచికిత్స అను పేరుతో తొలుత పారశీ భాషయందు మొహమ్మద్ అజ్గర్ అను వైద్యకులశేఖరునిచే రచింపఁబడినది."

ఇదియు పొరపాటు అనువక్త అస్గర్ అలీ. ఈఅంశము పారశీక మాతృకను, ఉరుదూ అనువాదమును బరిశీలించినచో స్పష్టమగును. పారశీక గ్రంథారంభమున గులాం ఇమాంగారు స్పష్టముగ వివరించియే యున్నారు. గులాం ఇమామ్గారు స్వహస్తమున వ్రాసిన గ్రంథప్రతిని ప్రకటన కర్తలు సంపాదించి ప్రకటించిన గ్రంథములో దొసగులుండుట అసాధ్యముకదా.

ఉరుదూ అనువాద గ్రంథ పీఠికలోని అంశములివి.

మహమ్మద్ అస్గర్ అలి, ఇబ్నె హకీం అమీర్ అలి, ఇబ్నె మౌల్వీ హాజి ఫజల్ అలీఖాన్ గోపామై ఖిద్మత్ అరిబాబ్ వ అఖల్ వ ఫహమ్ మై గుజారిష్ కర్తాహై

---

[1] వావిళ్ళవారి ప్రచురణము 1923.

[2] గ్రంథపీఠిక పుట—6.

.ఏక్ కితాబ్ మునమ్మె ఇలాజుల్గుర్బా ఛాపీగయీహై ఉస్కే మునన్నిఫ్ హాకీం గులాంఇమాం సాహెబు మర్హూమ్ నే. రైసే రైసే నుస్లె సహల్ ఔర్ ఆసాన్ హర్ మర్జ్‌కె ఉస్‌మే లిఖే సహల్ హాసిల్‌హో మున్షీ నవల్ కిశోర్ కి నజర్‌సే ఏ కితాబ్ గుజీ. ఇస్ ఖాక్సార్ బేమిఖ్దార్ కొ మామూర్ ఫర్మాయా కె కితాబ్ మజ్కూర్ కొ జబాన్‌ఫార్సీసే ఉరుదూ మే తర్జుమా కరే[1]

ఈ గ్రంథము హిందీ భాషయందును బ్రికటింపబడినది. గ్రంధప్రతుల సంఖ్య యొకటియే ఈ గ్రంథ ప్రాశస్త్యమును నిరూపించుచున్నది.

ఈ గ్రంథమునం దైదుపరికరణములు గలవు. 135 విధములగు రోగము లకు వివిధచికిత్స లిందు సూచింపబడినవి. ఔషధచికిత్సలతోపాటు ఆహారనియమముల గూర్చియు నిందు వివరములు కలవు. "ఇలాజుల్‌గుర్బా" ఒకటి రెండు అంశములలో విశిష్టమైనదిగ బరిగణింపబడుచున్నది. వాహటుని అష్టాంగహృదయమునందును, శుశ్రు తుని శారీరమునందును, మాధవుని నిదానము నందును, స్త్రీల రోగములగూర్చియు వంధ్యాపరికరణము నందా అంశములు అతివిపులముగా వివరింపబడినవి.

గ్రంధనామమున కర్థము పేదలచికిత్స, పేరుపొందిన వైద్యులను దర్శించి, వారుకోరిన ప్రతిఫలము నిచ్చి చికిత్స చేయించుకొనుటకు పేదలకు శక్తి చాలదు. అక స్మాత్తుగ గలుగు తలనొప్పి చెవినొప్పి మున్నగువానికి చికిత్స తక్షణమే జరుగవలయు నన్న ఆసమయమునకు వైద్యులసహాయముకాని వైద్యసౌకర్యముకాని లభించుట కొన్ని కొన్ని సందర్భములందు కుదురదు, కనుక సామాన్యపరిజ్ఞానము కలవారికి గూడ అర్థ మగునట్లు అతిసులభముగ స్వల్పధరలలో దొరుకు మూలికలద్వారా చికిత్సావిధానమిందు సూచింపబడినది. ఈ చిట్కాలు నేడును వాడుకలో నున్నవి.

వైద్యశాస్త్ర గ్రంధముల అనువాదము పద్యగద్య కావ్యములనుగాని తదితర శాస్త్రగ్రంధములగాని అనువదించుటవంటిది కాదు తక్కినగ్రంథానువాదములం దొకటి రెండుదొసగు లేర్పడినను ప్రమాదము కలుగదు, వైద్యశాస్త్రమునకు చెందిన అంశ ములు, చికిత్సావిధానము, మూలికల పేర్లు, మందుమోతాదు మున్నగుఅంశముల నను వదించు పట్ల ఏమాత్రము దారితప్పినను చికిత్సావిధానమును అనుసరించువారికి ప్రాణ హాని తప్పదు. వైద్యశాస్త్రగ్రంధానువాదము కత్తిమీదిసాము వంటిది. మనకు పరిచి తముకాని యూనానీవైద్యమునుగూర్చి వ్రాయునప్పుడు జాగరూకత మరింతఅవసరము.

---

[1] ఉరుదూ గ్రంధపీఠిక — పుట 3. జూలై 1900 నవలకిశోర ప్రెస్ లక్నో 16వ ప్రచురణము. 11వ ప్రచురణము వరకే ఈ గ్రంథము 23600 ప్రతులు వెలువడినవి.

హూస్సేన్ ఉమర్ అలీషాలు అనువాద మొనర్చుపట్ల పైఅంశమును ప్రధాన ముగ గమనించిరి. కొన్ని సందర్భములందు మాత్రము శాస్త్ర సంప్రదాయము ననుస రించి కొన్నిమార్పులు చేసిరి. మఱికొన్ని సందర్భములందు భావానువాద మొనర్చిరి.

ఇలాజ్ సఘాఒ. యానె దర్దెసర్ కే బయాన్ మే, అగర్ సర్ మే ఏక్ తరఫ్ దర్ద్ హో ఉస్కో షకీకా కహ్తే హైం. పస్ అగర్ ఉస్కా సబబ్ చారోం ఖిల్తోం సే కోయీ ఖిలత్ యా రీహ్ హో ఉస్కో మాదీ కహ్తే హైం ఔర్ అగర్ ఉస్కా సబబ్ ఇన్ మే సే కోయీ చీజ్ నహో ఉస్కో సాజజ్ కహ్తేహైం. ఔర్ అగర్ ధూప్ యా ఆగ్ యా హవా కీ గర్మీ యా దవాయె గర్మ్ ఖానే సే పైదా హో వొ హార్ సాజక్ హై. ఔర్ అగర్ హవాయె సర్ద్ కే ఇస్తమాల్ యా మఖామ్ సర్ద్ మే రెహ్నే యా ఔర్ సర్ద్ ఖానే సే పైదా హో ఓబార్ సాజక్ హై [1].

ఉమర్ అలీషాగారు దీని నిట్లనువదించిరి.

"తలలో నొకపైపు మాత్రము నొప్పి యుండిన యెడల ఒంటిపాశ్వపు నొప్పియందురు. ఎండ, అగ్ని, గాలి.వీనియొక్క వేడిమివల్లను, వేడిచేయు నౌషధ ములం దినుటవల్లను సంభవించు తలనొప్పి వేడివలన గలిగినదనియు చల్లనిగాలి సోకుట వలనగాని చల్లనినీరు త్రాగుటవలనగాని శీతలప్రదేశముల నుండుటచేత గాని చల్లని పదార్థములను తినుటవలన గాని కలుగు తలనొప్పి శీతలమువలన గలిగినదనియు భావించవలయును." [2]

మాతృకలోని ఒకభాగమును అనువాదకు లనువదించలేదు. మందుమోతా దులను వివరించునపుడు అనువక్తలు శాస్త్ర సంప్రదాయమును పాటించిరి ఇత్రిఫల్ కిష్నిజీ పూటకు 1 తులము మొదలు $1\frac{1}{2}$ తులములవఱకు మోతాదు పుచ్చుకొనవలయునని అనువాదకులు వ్రాసిరి. మూలములో 2 నుండి $2\frac{1}{2}$ తులముల వఱకు వాడవచ్చునని కలదు. ఈ గ్రంథము వ్రాయునప్పుడు అప్పటి మానవుల శారీరకశక్తి ననుసరించి ఎక్కువమోతాదు సూచింపబడెను. కాలక్రమానుసారముగ మానవుల ఔషధస్వీకరణ శక్తి తగ్గవచ్చును. ఈ శాస్త్రసంప్రదాయము ననుసరించి అనువాదకులు మోతాదును తగ్గించిరి.

యూనానీ వైద్యము నం దుపయుక్తములగు మూలికలకు మనభాష యందు పేర్లు కొన్ని లభించును. కొన్ని మూలికలు లేహ్యములు మన కపరిచితములు. పారశీక

---

1 ఇలాజుల్‌గుర్బా — ఉర్దూ అనువాదము పు—11

2 తెలుగు అనువాదము, పుట—14

నామములకు సరియైన పేర్లు లభించనప్పుడు అనువాదకులు మాతృకలోని పదజాల మునే ఉపయోగించుకొనిరి. ఇది ఉత్తమమైన పద్ధతి. రోగములను, చికిత్సావిధానము లను వివరించుపట్ల అనువాదకులు మూలమును వ్యాఖ్యాన ప్రాయముగ నొనర్చిరి. యూనానీ వైద్యగ్రంథము ననువదించి తెలుగువారికి సుబోధమొనర్చి ఉమర్ అలీషాగారు వాఙ్మయమునకును వైద్య విద్యకును మహోపకారమొనర్చిరి.

## "తిబ్బె అక్బర్ షాహి":-

హకీం డి. రహమతుల్లాగారు ప్రాచీన యూనానీవైద్యగ్రంథము నాధారముగ గొని "తిబ్బె అక్బరు షాహి" అను ప్రశస్తగ్రంథమును రచించిరి. ఇందు యూనానీ వైద్య చరిత్ర, మానవశరీరనిర్మాణ పద్ధతి, తత్తదవయవములం దేర్పడు రోగములు వాని లక్షణములు, చికిత్సావిధానము, రోగిపరీక్షావిధానము, వివిధౌషధములు. లేహ్య ములు, షర్బతులు మున్నగునవి తయారుచేయుపద్ధతులు, ఈగ్రంథములో పరళభాషలో వివరింపబడినవి తెలుగువారి కిది ఉపయుక్తమగు గ్రంథము. రహమతుల్లాగారు ఈ గ్రంథమును ఆంధ్రభాషలో గ్రామ్యపదములతో "ననువదించితి"నని పీఠికలో వివరించినారు.

రహమతుల్లాగారు యూనానీ గ్రంథము నందలి పదములకు సంస్కృతము తెలుగు హిందీ మున్నగుభాషలందు పర్యాయపదముల నొసగిరి. గ్రంథాంతమునందు చేర్చబడిన ఈపదసూచి పారిభాషిక పదజాలమును గ్రహించుటకు చక్కగా దోడ్పడు చున్నది.

# వివిధ గ్రంథములు

## అబ్దుల్ రజాక్[1]

కమాలుద్దీన్ అబ్దుల్‌రజాక్ సమరఖండ దేశవాసి. పారశీక చక్రవర్తి సుల్తాన్‌షారూక్ దర్బారులో నుండిన ఈతడు పారశీక రాయబారిగ ఇమ్మడి దేవరాయలు మల్లికార్జునరాయల కాలములో విజయనగరమును సందర్శించెను. రజాక్ రచించిన "మల్లాఉస్సయీదయిన్" అను గ్రంథము చారిత్రిక ప్రాధాన్యము గలది. ప్రథమ సంపుటమునందు తైమూరు చక్రవర్తి వృత్తాంతము విపులముగా వర్ణితము రెండవ సంపుటమునందు తైమూరు వంశీయుల చరిత్రము మొదలుకొని కడపటిపారశీక సుల్తాను

[1] భారతి సం 1 సంచి 9-12

హసన్‌మిర్జా వృత్తాంతము వఱకుగల చరిత్ర ముల్లేఖింపబడినది. రజాక్ 1442 ప్రాంతమున విజయనగరమును సందర్శించి విజయనగరమును గూర్చియు, నిచటి మత, సాంస్కృతిక, రాజకీయ, విషయములను గూర్చియు, గ్రహించిన విశేషాంశముల నీ గ్రంధము లందు వివరించెను. పారశీకమునందు రచింపబడిన ఈ గ్రంధమును బెంగాలు సివిల్ సర్వీసులో కొంతకాలము పనిచేసిన సి. జే. ఓల్డుఫీల్డు గారాంగ్లము నందనువదించి యుండిరి. ఈ అంగ్లానువాదము ననుసరించి భావరాజు వేంకటకృష్ణారావుగారు ఆంధ్రదేశమునకును. విజయనగరమునకును సంబంధించిన భాగములను మాత్రము ఆంధ్రీకరించిరి. ఇది స్వేచ్ఛానువాదము. కళ్ళికోటకు అబిసీనియా, జింజిబారు దేశీయులు వర్తకము నిమిత్తమై వచ్చుట. ఆంధ్రదేశమునందు మహమ్మదీయులు మసీదులు కట్టించుట, రంజాను మున్నగు పండుగలు వానివిశేషములు, ఉత్తమాశ్వములు, పట్టునూలు మున్నగు వానికి సంబంధించిన వ్యాపారము, మొదలగు అంశములన్నియు నిందు వివరింపబడినవి. పారశీకాంగ్లభాషా పరిచయము లేనివారికి భావరాజుగారి అనువాదము విజయనగర విశేషములు గ్రహించుటకు చక్కగా తోడ్పడుచున్నది.

## ఔరంగజేబు లేఖలు[1]:—

మేధాశాలిగను మతావేశపరుడుగను చరిత్రప్రసిద్ధుడైన మొగలాయి చక్రవర్తి ఔరంగజేబు తన అవసానకాలమున కుమారునకు కొన్ని లేఖలు వ్రాసియుండెను. వీనిని పురిపండ అప్పలస్వామిగారు ఆంగ్లానువాదము ద్వార తెలుగొనర్చిరి. ఈ లేఖలందు ఔరంగజేబు భగ్నహృదయము అతడు పశ్చాత్తాపము నొందిన అంశము వ్యక్తమగుచున్నవి. ఈ లేఖానువాదములోని ఒకభాగ మిట్లుకలదు.

## కడసారి కుమారుడగు కామబక్షునకు:—

**ఆత్మాధికుడా!** నే నిపుడు ఒంటరిగ పోవుచున్నాను. నీ నిస్సహాయతకెంతయు శోకించు చున్నాను, కాని ప్రయోజనమేమి? నేను గావించిన ప్రతిహత్యయు నే నొనర్చిన ప్రతిపాపమును నేను సలిపిన ప్రతిదోషమును వీనిఫలితము నాతో మోసికొని పోవుచున్నాను.

కఠినచిత్తుడగు ఔరంగజేబు అంత్యదశలో ఎంత వ్యాకులము నొందెనో ఈ లేఖలు నిరూపించుచున్నవి. యువరాజు అగు ఆజమునకు కనిష్ఠపుత్రుడగు కామబక్షునకు ఔరంగజేబు వ్రాసినరెండులేఖలను పురిపండ అప్పలస్వామి గారు అనువదించిరి. ఆలంగీర్ వ్రాసిన పారసీ లేఖలు చాల కలవు. షిబ్లీగా రీలేఖలను "రుఖఆత్ ఆలంగిరి" అనుపేర ప్రకటించియుండెను. వీని ననువదించినచో లేఖాసాహిత్యమునకు క్రొత్త రూపురేఖ లేర్పడుననుటకు సందేహములేదు.

---

[1] భారతి— సంపు 7— సంచి—4 ఏప్రిల్ 1930

# పరిశిష్టము

ప్రాచీన కాలమునుండి నేటివఱకు తెలుగుపై ఉరుదూపారశీకముల ప్రభావమును గూర్చి విభిన్నదృక్పథములతో పరిశీలించుట జరిగినది. దీనికి సంబంధించిన అంశములలో ఒక్కొక్కదానిని గూర్చి ఇంకను విపులముగ పరిశోధనమొనర్చి వ్రాయుట కవకాశము, సాధనసామగ్రియు కలదు. ఈ గ్రంథము నందు అతిప్రధానములైన అంశములు మాత్రమే స్పృశింపబడినవి. ఈవిషయమును గూర్చి వ్రాయవలసిన దింతియ యనుట సాహసమే యగును అతివిస్తృతమైన పరిధి గల విషయమిది. శక్త్యనుసారముగ కొంతవఱకు సాధించితినను తృప్తిమాత్రము కలదు. సాహిత్యఅకాడమీవారు నిర్ణయించిన పరిమిత పరిధిలోమాత్రమే రచన సాగినది. వ్రాయదగినదియు, వ్రాయవలసినదియు నింకను గలదు గ్రంథవిస్తరణ భీతిచే ఎన్నియో అంశములు స్థాలీపులాకన్యాయమున మాత్రమే పరిశీలింపబడినవి.

ఇందు ప్రాచీన కావ్యములందలి ప్రయోగములు పెక్కు చూపబడినవి. కాని ఆధునిక వాఙ్మయములోని విభిన్న ప్రక్రియలలో కన్పట్టు ప్రయోగము లన్నియు వివరించుటకు సాధ్యము కాలేదు. ప్రాచీన కావ్యములలోని ప్రయోగములు కూడ కొన్ని పరిశీలింప దగినవి కలవు వచనములు, యక్షగానములు, దండకములు, శతకములు,[1] జానపదగేయములు, చాటువులు మున్నగు వానిని నిశిత దృష్టితో పరిశీలించినచో మఱి కొన్ని ప్రయోగములు లభించును. అముద్రిత కావ్యములందును పెక్కు ప్రయోగములు కన్పించునను విశ్వాసము కలదు. ఆధునిక వచనవాఙ్మయములోని విభిన్న ప్రక్రియలు, నవలలు, కథానికలు, శాస్త్రగ్రంథములు, చరిత్రలు, డైరీలు, లేఖలు మున్నగు వానినుండి ప్రయోగములు సేకరించ వలసి యున్నది స్థానికచరిత్రలు, కైఫియతులు, శాసనములు మొదలగువానిలో చక్కని ప్రయోగములు ఇంకను లభించును. గ్రంథస్థమగు భాషతోపాటు, సామాన్య వ్యవహారమునందును, ప్రభుత్వ వ్యవహారమునందును, కన్పించు పదజాల మనంతము. పత్రికలను, ప్రభుత్వ వ్యవహారములను చూచిన వేలకొలది ప్రయోగములు లభించు ననుటకు సందేహము లేదు. వీనియందు సామాన్య

---

1 నేను ఆంధ్రశతకవాఙ్మయమునుగూర్చి సిద్ధాంత గ్రంథము వ్రాసిన సందర్భమున శతకములలో ప్రయోగింపబడిన ఉరుదూపారశీక పదములను సేకరించినాను.

పదములతోపాటు పారిభాషిక పదములపై ప్రత్యేకముగ దృష్టి కేంద్రీకరించుట అవసర మని తోచును ఈ గ్రంథమున బందోబస్తు విధానమునకును, రాచరికమునకును, సంబంధించిన కొన్నిపదములే ఉదాహృతములు. గమనింప దగినవి మఱికొన్ని కలవు. వివిధ శాస్త్రగ్రంథముల యందు, బందోబస్తు విధానమునకు సంబంధించిన వ్యవహార పత్రములందును, ఖాస్వామ్యము, నీటిఫారుదల, విద్య, వైద్యము, తంతితపాల, మద్య నిషేధము, వ్యవసాయము, వివిధపరిశ్రమలు మున్నగువానికి సంబంధించిన వ్యవహార పత్రములందు ప్రత్యేక పరిశీలనమున కర్థము లైన ప్రయోగము లెన్నియో లభించును. ఇపుడు దేశము నందు కాని, రాష్ట్రమునందుకాని ఉరుదూపారశీకములకు అధికార భాషా స్థాయి లేదు కొన్ని రాష్ట్రములలో మాత్రమే ఉరుదూ అనుబంధ అధికారభాషగ స్వీక రింప బడినది. ఇట్టి పరిస్థితు లందును ఉరుదూపారశీక ప్రభావము ప్రసరించుచున్న అంశము విస్మరింపరానిది. పత్రికలభాష, వివిధసంస్థల ప్రకటనలు, ప్రభుత్వశాసన ములు, చట్టములు, వ్యవహారభాష మున్నగువానిని కొన్ని పరిశీలించినచో ఈఅంశము సుస్పష్టమగును బందోబస్తు పత్రములు మున్నగునవి ప్రత్యేకముగ పరిశీలింపదగినవి. పజేలుపట్వారీలు నిర్ణీతపత్రములందు వివిధ అంశములు వ్రాసి ప్రభుత్వమునకు పంపు చుందురు. పూర్వపు హైదరాబాదురాష్ట్రము నిర్ణయించిన పత్రములలో నేడు కొన్ని మార్పులు మాత్రమే కన్పించుచున్నవి. ఇందును ఉరుదూపారశీకపదముల ప్రయోగ ములు తప్పలేదు. ఇట్టి పత్రముల నమూనాలు నలుఏదివఅకు ఉన్నవి. వీనిలోనికొన్ని ప్రయోగములివి.

నఖల్‌పహాణిపత్రిక, పట్టా లేక ఇనాంభూమి, ఖబ్జాదారుపేరు, హక్కుల రికార్డు, కౌలురకం, తతిమ్మ, ఖానాలో చూపిన అంశము, హస్తుమాహి, చార్‌మాహి, ఫైసల్‌పట్టి, ఖాస్రాపహాణి మున్నగునవి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించుచున్న శాసనము లందును ఇట్టి పారిభాషిక పదములు పెక్కు చేరినవి.

ప్ఫ్యాక్టరీల చట్టము – తెలుగుతర్జుమా:—

1. ఫ్యాక్టరీ యొక్క "అనుభవదారు" అనగా ఫ్యాక్టరీ వ్యవహారములపై పూర్తి అధికారముగల వ్యక్తి అని అర్థము.
2 రోజువారీ గంటలు.
3 కొన్ని మినహాయింపులు విధింపబడినవి.
4. షరతులు విధింపబడినవి.
5. యజమాని అను పదమునందు ఆవరణయొక్క గుత్తదారు లేక ఆవర ణము స్వాధీనమునందుగల తాకట్టుదారు చేరును.

## వివిధ ప్రకటనలు:—

1. టెండరు :— పసుల జాబితా : ...... దిగువ సంతకందారు పేర సక్రమంగా తనఖా పెట్టవలయును.
2 కలప వేలం నోటీసు : ఇతర షరతులకు అధికారి నుండి తెలిసికొనవచ్చును.
3. ఉద్యోగ ప్రకటనలు : అభ్యర్థులు దరఖాస్తులను .. వివరాలతో దాఖలు చేయవలయును.
4. వ్యాపార ప్రకటనలు : జంపఖానా ... వగైరాలకు .. ఏజంట్లు కావలెను.
5. హెచ్చు పాటదారుల పాటలను ....కమిటీవారి అంగీకారమును పొంది ఖాయపఱచబడును.
6. వేలము రద్దు చేయుటకుగాని నిలుపుదల చేయుటకుగాని సర్వహక్కులు కలవు.
7. పదరు భూములగూర్చి ఎట్టి లావాదేవీలు లేవు.
8. సమను జారీ అయినది.
9. సమావేశము వాయిదా పడినది.
10. నాలుగు వాయిదాలలో చెల్లించవలయును.

## పత్రికలు:—

1. రైళ్ళ బస్సుల అటకాయింపు.
2. అమెరికాలో చేతి సంచులుగా పాన్‌దానులు.
3. వర్తకుల హర్తాళ్.
4. అన్ని స్థానాలు భర్తీ.
5. విద్యార్థులు పరీక్షలకు గైర్‌హాజర్ అయినారు.
6. కార్యదర్శి రాజీనామా.
7. ఆరసీదు పుస్తకాలను పోస్టాఫీసుకు దాఖలా చేయవలసి ఉంటుంది.
8. దుకాణాలు బంద్.

వ్యవహారములోని ప్రయోగములు:—

1. మజాకా (పరిహాసం) అనుకున్నావా ?
2. వొయ్యి (బహీ) తీసికొని రా !
3. నాకు యాది (జ్ఞాపకం) లేదు.
4. నీకింత దిమాకీ (గర్వం) ఎక్కడినుండి వచ్చినది

శిష్టేతరుల వ్యవహారములోని కొన్ని ప్రయోగములు:—

1. నేను భీ (కూడా) వస్తా.
2. ఇది లేదు న అది లేదు.

పదబంధములు, ప్రత్యయ ఉపసర్గ సహితములైన రూపములు, ఇంచుగా గమక్రియలు, అవ్యయములు, సంఖ్యావాచకములు, తద్ధితములు మున్నగు వానిని సేకరించుట వానిని గూర్చి పరిశీలించుట అవసరము.

కొన్నిలోకోక్తులు సామెతలు కూడ ఇందు చేర్పదగినవికలవు తెలుగువారు మహమ్మదీయుల సంప్రదాయములను పురస్కరించుకొనియు, వారిభాషలోని నుడికారములను, లోకోక్తులను రూపొందించుకొనిరి. "ఉంటే పీరుసాబు లేకుంటే ఫకీర్‌సాబు" "తిండికి లేదు ఎల్లికొ బులావ్'' కొన్నిసామెతలను ఆభాషలనుండి యధాతధముగ వ్యవహృతములగుచున్నవి. ఊపర్ షేర్వాని అందర్ పరేషాని. మాన్ న మాన్ మై తేరా మహమాన్, మున్నగునవిఇట్టివి. జనవ్యవహారమున నున్న ఇట్టి సామెతలను సంపాదింపవలసియున్నది. తెలంగాణా మండలమునందు వ్యవహారములో ప్రచలితములైన సామెతలు పెక్కు లభించగలవు.

కొన్ని పదముల స్వరూపమునందును అర్థములందును ఏర్పడిన మార్పులను భాషాశాస్త్ర దృష్టితో పరిశీలింప వలయును. వాయిదా అనగా వాగ్దానము తెలుగులో Postpone, Instalment అను అర్థములందు ప్రయోగింప బడుచున్నది తెలుగు దేశములోని వివిధ మండలములందు ప్రయోగింపబడుచున్న పదముల మాండలిక స్వరూపమును, మాండలికములతో ఏర్పడిన అర్థభేదములను, వ్రాతయందు కన్పించు తారతమ్యమును, ఉచ్చారణ రీతులను భాషాశాస్త్ర దృష్టిలో నిశితముగ పరిశీలించినచో ఎన్నియో నూతన విషయములు వెల్లడియగును

ఇట్లు సేకరించిన పదములనుగూర్చి కొన్ని వ్యాసముల రూపమున పరిశీలన మొనర్చుటతో తృప్తిపడరాదు. ఈ పదజాలమునకు నిఘంటువులందు సముచిత స్థానము లభింపజేయుట నిఘంటుకారుల ధర్మమై యున్నది. తెలుగులో వెలువడిన నిఘంటువు లలో ఉర్దూ పారశీకములకు సంబంధించిన పదజాలము అధికముగా కన్పించదు. బ్రౌను పండితులు పరిశ్రమ మొనర్చి ప్రకటించిన మిశ్రభాషా నిఘంటువునందు ఇట్టి ప్రయోగ ములను బహుళ సంఖ్యలో చేర్చిరి. అందును చేరదగినవి ఎన్నియో కలవు. ప్రామా ణికములగు ఆంధ్ర నిఘంటువులలో పదముల స్వరూపమును గూర్చియు, పదముల మూలమును గూర్చియు, అర్థవివరణమును గూర్చియు, వ్రాయునపుడు ప్రమాద వశమున కొన్ని దొసగులు దొరలినవి. వానిని సంస్కరించు అవసర మెంతయుకలదు. బహుజనపల్లి సీతారామచార్యులుగారు శబ్దరత్నాకరమును వ్రాయుట కేర్పరచికొనిన నియమ విధాన క్రమములోని ఒకటి, రెండు అంశములిట పరిశీలింపదగియున్నవి. అన్యదేశీయ శబ్దములగూర్చి వారిట్లు వ్రాసిరి.

"తెలుగు వాడుకలోనికి వచ్చిన యన్యదేశీయ శబ్దములుకొన్ని యీ గ్రొత్త కూర్పునందుఁ జేర్పబడినవి. బ్రౌన్యు నిఘంటువులోనుండి యిట్టి శబ్దములుకొన్ని చేర్చబడినవి. ఇట్టి శబ్దములకు గ్రంథ దృష్టాంతములు దొఱకుట దుస్సాధ్యము గాన నట్టివాని నిందు జేర్పలేదు."

పెక్కు ప్రయోగములకు గ్రంథస్థ దృష్టాంతములు లభించని అంశము ఈ నా గ్రంథమునందు ఉదాహృతములైన ప్రయోగములను బరిశీలించిన స్పష్టము. ఇటీవల శబ్దరత్నాకరమునకు చక్కని అనుబంధమును చేర్చిన శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి కృషి ప్రశంసనార్హము. ఈ అనుబంధమున పెక్కు ఉర్దూ పారశీక పదములు చేర్ప బడినవి. తెలుగు నిఘంటువులందు ఇంకను చేర్పదగిన ప్రయోగములు ఎన్నియో కలవు. శబ్దరత్నాకరమున ఉర్దూ పారశీకములను హిందీ పదములను ఆచార్యులవారు హిందుస్తానీ పదములు స్వీకరించి వానికి "హిం" అను సంకేతమును స్వీకరించిరి. కొన్ని అన్యదేశ్యములను వీరు దేశ్యములనియే పేర్కొనిరి ఈ సందర్భమున గ్రహిం చిన నియమమును వారిట్లు వివరించిరి.

"సంస్కృతము, వైకృతము, దేశ్యము, గ్రామ్యము వీని కాయా సంజ్ఞ లిడఁబడును. అన్యదేశ్యము దేశ్యముతో జేర్పబడినదిగాన దానికి బ్రత్యేకముగా సంజ్ఞ యిడఁబడదు.'' ఆంధ్రభాషా ప్రశంస యొనర్చు సందర్భమున ఆచార్యుల వారిట్లు వ్రాసిరి.

"దేశ్యము, ఆంధ్రదేశ్యము, అన్యదేశ్యమని ద్వివిధము, ఆంధ్రదేశ్యము తల్లి తండ్రిలో" నగునది,

ఆచార్యులవారు స్వీకరించిన నియమవిధాన క్రమమునకు, అన్యదేశ, శబ్ద లక్షణ వివరణమునకును, వానికి చూపిన సంకేతములకును ఏ విధముగను పొత్తు కుదురుటలేదు. ఇప్పటికైనను నిఘంటువులు కూర్చు వారీ విషయమున ప్రత్యేకముగ శ్రద్ధ వహించి జాగరూకతతో నిర్దుష్టమైన మార్గము ననుసరించుట సమంజసమని తోచుచున్నది.

ప్రయోగములను సేకరించి నిఘంటువు లందు చేర్చుట ఒకయెత్తు. వానికి ప్రామాణికత కలిగించుట మఱియొకఎత్తు. ఆ యాపదముల మూలరూపమును అరబీ, పారశీ, ఉర్దూ, హిందీ మూలకములని నిర్ణయించి చూపుటయు అవసరము. ఈ సందర్భమునందు శ్రీ తూమాటి దోణప్పగారు రాజమార్గమును చూపించి యున్నారు. శ్రీనాథుని యుగములోని అన్యదేశ్యములనుగూర్చి వారువివరించినపద్ధతి పరమ ప్రామాణిక మనుటకు సందేహ లేదు. లకసాని చక్రధరరావుగారి పరిశోధనగ్రంథము వెలుగునకు వచ్చినచో అన్యదేశ్యముల స్వరూపమును గూర్చి ఇంకను క్రొత్త విషయములు వెల్లడియగును.

ప్రాచీన లాక్షణికులు అన్యదేశ్యములను గూర్చి స్పష్టముగ వివరించలేదు. అథర్వణాచార్యులమార్గము మాత్రము విశిష్టముగా గన్పట్టు చున్నది. కావ్యములందు అన్యదేశ్యములను ప్రయోగింపవచ్చునని చెప్పినవారిలో అథర్వణాచార్యులు ప్రథమ గణ్యులు. అన్యదేశ్యములకు సంబంధించిన వర్ణములు, అవ్యయములు మున్నగువానిని గూర్చియు, క్రియాస్వరూపమునుగూర్చియు, సంధిసమాసకార్యములగూర్చియు ప్రాచీన లాక్షణికులుకొందఱు ఏమాత్రము శ్రద్ధవహింపలేదనుట నగ్నసత్యము. చిన్నయసూరిగారుకూడ ఈసందర్భమున అనుసరించిన విధానమును వ్యాఖ్యాతలువిమర్శించియున్నారు. తత్సమ పరిచ్ఛేదమునందలి 55వ సూత్రమును వ్యాఖ్యానించుచు విద్వాన్ దూసిరామమూర్తి శాస్త్రిగా రిట్లువ్రాసిరి.

" . ...కాగా దేశ్యాన్యదేశ్యములు దీర్ఘాంతములు బహ్వక్షర శబ్దములైనను వానికి దీర్ఘము సామాన్యముగ గలుగదని తేలినది. కాని 'హ్రస్వో దేశ్యే తు వాక్వచిత్' అని యథర్వణుడు దీర్ఘాంత దేశ్యములకును గొన్నియెడల హ్రస్వమునుశాసించి "కల్వలకోరియు; చక్కెరభాణపుఁదేజి; మున్నగువానికి గతికల్పించుచుండ సూరి యట్టివానిని దలంపకుండుట చింత్యమనక తీరదు."

ఆధునిక లాక్షణికులలో మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారును వజ్ఝమూడి గోపాలకృష్ణయ్యగారును అన్యదేశ్యములకు సంబంధించిన అంశములను సూత్రీకరించి యున్నారు. బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు ఆంధ్రభాషానుశాసనతద్ధిత ప్రకరణమునందు కూర్చిన సూత్రమిట్లుకలదు.

సూ: "కొన్నికొన్ని శబ్దములకు తాచ్ఛీల్యము మున్నగు నర్థవిశేషములందు మారి, పోతు, కోరు, వారు, గొట్టు మొదలగు ప్రత్యయములగును.

ఉదా:— మాయలమారి, తిండిపోతు, జగదాలకోరు, పెత్తనదారు మొదలగు నవి. తక్కుంగల తద్ధితవిశేషములను ప్రయోగవ్యవహారముల దెలియునది.

కోరు, దారు మున్నగు ప్రత్యయములతో నేర్పడిన తద్ధితములు ఈపరిశీలక గ్రంధమున కొన్నింటినిమాత్రము చూపితిని. ఇట్టివి ఇంకను పలువు లెక్కైన అంశ ములగూర్చియు లాక్షణికులు శ్రద్ధవహించి వానికి ప్రామాణికత గలిగించినచో లక్షణ గ్రంధములును సర్వసమగ్రమగును భాషకు పుష్టి చేకూరును.

ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీవారు నిర్ణయించిన విషయము ననుసరించి ఈగ్రంధమున తెలుగుపై ఉర్దూపారశీకముల ప్రభావము మాత్రమే నిరూపింపబడినది. ఉర్దూపారశీకములందు అరబీభాషనుండి పెక్కుపదములు ప్రవేశించినవి. కనుక పరో క్షముగ అరబీపదములుకూడ తెలుగులో చేరినవనుట నిశ్చయము. అరబీ మూలకము లగు పదములు కొన్నింటికి ఇందు ప్రయోగములు చూపబడినవి. ఉరుదూ పారశీక ములు రాజభాషగా తెలుగుపై ముద్రవేసినవి. అరబీకి అట్టి స్థానములభించలేదు. ఐనను మహమ్మదీయులతో ఆ భాషయు వచ్చినది, మతగ్రంధము లా భాషయందు కలవు. చారిత్రకదృష్టితో చూచినచో ద్రావిడభాషలపై అరబీభాష ప్రభావమే మొట్టమొదట కలిగినట్లు కన్పించును. డా. చిలుకూరి నారాయణరావుగారు పరిశ్రమయొనర్చి నావికుల పరిభాషనుపరిశీలించి పదజాలమును సేకరించి ఆంధ్రభాషా చరిత్రమున ప్రకటించి యున్నారు. ఆ పదజాలమును భాషాశాస్త్రజ్ఞులు, పండితులు సూక్ష్మముగ బరిశీలించినచో అమూల్యములైన అంశములు వెల్లడియగును.

నేడు భాషాశాస్త్రము బహుముఖముగ అభివృద్ధినొందినది. వర్ణములు, పద ములు, మాండలికములు, ఉచ్చారణరీతులు, ధ్వనివిపరిణామము, అర్థవిపరిణామము మున్నగునవి అధునాతన శాస్త్రీయదృక్పథముతో పరిశీలింపబడుచున్నవి. ఈ అంశము లీగ్రంధమునందు శాస్త్రీయదృష్టితో గ్రహింపబడినవి. ఇంకను వివరింపవలసిన అంశ

ములు కొన్నికలవు. ఒక్కొక్క మండలమున ఒక్కొక్క పదము ఉచ్చారణరీతులలో పొందినమార్పును భాషాశాస్త్రజ్ఞులు శాస్త్రీయదృక్పథముతో దేశ భౌగోళిక మండలముల పటముల ద్వార నిర్ణయించి సూచించుచున్నారు. డా. భద్రిరాజుకృష్ణమూర్తిగారు వ్యవసాయవృత్తిపదకోశము నందిట్టివిధానము ననుసరించి యున్నారు. అన్యదేశ్యముల మాండలిక భేదములను కూడ ఇట్టి దృష్టితో పరిశీలింపుట అవసరము. ఈదృక్పథము తోడనే తెలంగణామండలముపై ఉరుదూపారశీకముల ప్రభావమునుగూర్చి సమగ్రముగ పరిశీలింపవలసి యున్నది. గోలకొండ సుల్తానులు అసఫ్‌జాహివంశీయుల పరిపాలనా కాలములో ఉరుదూపారశీకములు రాజభాషా గౌరవమునొంది తెలుగుపై ప్రగాఢమైన ముద్రవేసినవి. గ్రామీణ ప్రాంతమునందలి ప్రభుత్వవ్యవహారభాష యందును, నిత్య వ్యవహారభాషయందును ఈముద్ర ప్రస్ఫుటముగ కన్పించుచున్నది. పటేల్ పట్వారీల భాష తౌరుక్యాంధ్రమునకు అచ్చమైన ప్రతిబింబము. పటేలుపట్వారీలు గిర్దావరుకుకాని తహసీలుదారు మున్నగు అధికారులకుగాని వ్రాసిన విన్నపములను గ్రామమునకు సంబంధించినరికార్డులను పరిశీలించినచో అది తెలుగుభాషయేనా అను సందేహము కలుగును. వారిభాష మచ్చున కిట్లుండును.

1. బఖిద్మత్ షరీఫ్ ఆలీజనాబు తాసిల్దారు సాహెబుకు మొజె.. తాలుకా . పటేలు దాఖలుచేయు మహజరు ఇదిగదాంకె.

సర్కారు సాల్‌హాల్ జమాబంది అమలుచేయుటకు హుకుంజారీచేసియుంటిరి. దానిప్రకారము జనాబ్ గిర్దావర్ సాహెబుచే మోఖామూనాయచేయించి తఫ్సీల్లు మామూలు ప్రకారం తయారుచేసి ఉంచినాను జేరుబావులీ కాష్తజరిగే భూముల సిల్సిలాలో సాఫుగా వ్రాసినాను. గుజిష్తాసాల్‌కంటె ఈసాలులో పంటలుచాలా కమ్మీఅయినవి. తాలాబు మరమ్మతుకై తమరి హుకుం లభించినది. అయినా ఆబీతాబీ ఫసళ్ళు దెబ్బతిన్నవి. రియాయామీద మెహర్బానీచేసి మాల్గుజారీ మాఫు చేయిస్తే గరీబ్‌పర్వరీ అవును.

2. తఖ్తా నెంబరు ఫలాన ప్రకారం, రహనుమాయె జమాబందీలోని ఫికా ప్రకారం నకలుసహీ.

బందోబస్తురికార్డులు, పల్లెటూరివ్యవహారపత్రములు ప్రత్యేకముగసేకరించిన "తౌరుక్యాంధ్రము" యొక్క సమగ్రస్వరూపమును నిరూపించుట కవకాశము లభించును.

తెలాంగణమున నిత్యవ్యవహారమునందు ప్రయోగించు పదజాలమనంతము. పలుకుబడి, వాక్యవిన్యాసరీతి, అచ్చముగా అనుకరించుట గమనార్హము. తెలుగు చక్కగావచ్చిన తెలుగువారుకూడ ఉర్దూపారశీక పదములను స్వేచ్ఛగా ప్రయోగింతురు

భారతము, రామాయణము, భర్తృహరి త్రిశతి మున్నగువాని నుండి నీతిసూక్తులను ఉదాహరించునట్లే గులిస్తాఁ బోస్తాన్ కావ్యములనుండి నీతిసూక్తుల నుల్లేఖింతురు.

ఈపదజాలమును సేకరించినచో కలుగు ప్రయోజన మేమియని కొందరికి సందేహము కలుగుట సహజమే. కాని బందోబస్తు, రాజరికవ్యవహారములకు సంబంధించిన పారిభాషిక పదములు బహుసంఖ్యలో లభించుననియు వానిని మార్పులతో చేర్పులలో స్వీకరించుట కవకాశము కలదనియు, అట్లగుచో రాష్ట్ర అధికారభాషతెలుగులో వ్యవహారము కొనసాగించుటకు అన్ని కార్యాలయములందును, అన్ని రంగములందును సంపూర్ణముగతెలుగులో వ్యవహారము ప్రారంభించుటకు తోడ్పడుననియు నిస్సందేహాగ చెప్పవచ్చును. ఆంధ్రప్రదేశ్ శాసనసభ సచివాలయమువారు 1963 లో ప్రకటించిన పారిభాషికపదకోశ నిర్మాణమున ఉర్దూపారశీక పదము లధికముగ దోడ్పడినవి.[1] ఈ ఉదాహరణములు పరిశీలించినచో ఈ అంశము స్పష్టమగును.

| | |
|---|---|
| Cash bill = నగదు పుస్తకము; | Duplicate = ప్రతి, నకలు. |
| Mill = గిర్ని, మర, | Millmade = మిల్లుతయారీ. |
| Right = హక్కు; | Plain = సీదా, కపటములేని. |

పారిభాషిక పదకోశనిర్మాణమున జాగరూకత ఎంతయు అవసరము. విలక్షణమైన శాస్త్రీయమార్గమును అనుసరించుట ఉచితము. కొన్ని పదములు తెలంగాణము వారికి మాత్రమేసులభముగ అర్థమగును. తదితర మండలములవారికి అట్టిపదములతో అంతగా పరిచయములేదు. అన్నిమండలములందును సులభముగఅర్థమగు పారిభాషిక పదములనుమాత్రమే స్వీకరించుట న్యాయము. అన్యదేశ్యముల మాండలిక స్వరూప పరిశీలనము భాషాశాస్త్రదృష్టితో జరిగినచో ఏపదము అన్ని మండలములకు పరిచితమో సులభముగా నిర్ణయింపవచ్చును. పారిభాషిక పదములరూపొందించుకొనుటలో తెలుగువారు ఉదారదృష్టివహించుటయు అవసరమే. ప్రతి పదముకూడ అచ్చమైనతెలుగు పదముగా మాత్రమే ఉండవలయునను నిర్బంధమును పూనినచో కార్యము క్లిష్టతరమగును. సంకుచిత దృష్టితో మడిగట్టుకొని పారిభాషిక పదములను తెలుగు పదముల తోడనే బలవంతముగ నిర్మించుకొనినచో అవి బహుజన ఆదరపాత్రములుకాక వ్యవహారమును కష్టతరమొనర్చును. శాస్త్రగ్రంథముల ననువదించుపట్ల పూర్వపుహైదరాబాదు ప్రభుత్వమువారు "దారుల్తర్జుమా" అనువాద కార్యాలయమును ఏర్పరిచి యుండిరి.

[1] పారిభాషిక పదకోశము.- A glossary of Parliamentary, Legal and Administrative terms with Telugu equivalents.

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ఇట్టిశాస్త్రగ్రంథములను అనువదించునపుడు మాదు మూలపదములను సులభముగా అర్థముకాని అరబీపారశీ పదములతో పూర్ణమైన పారిభాషికపదములను కూర్చి యుండిరి ఆ ప్రయత్నము సర్వజన ఆమోదయోగ్యముకాక విఫలమైనదని విజ్ఞులమతము. ఈఅనుభవమును పురస్కరించుకొని తెలుగువారు నియమ విధానక్రమమును రూపొందించుకొనుట సమంజసముగా గన్పట్టును. సాధ్యమైనంత వఱకు తెలుగుపదములను బహుళముగ స్వీకరించుట ధర్మము, న్యాయము. విధి లేనపుడు వింతిగొలుపు పదములను, చిత్రవిచిత్రములైన పదములను నిర్మించుకొనుట శాస్త్ర సిద్ధమైన మార్గముకాదు. జేబురుమాలు, గుండీ, అంగీ, కుర్తా, టోపి, అమలు, వాయిదా, వంటిపదములకు సమానార్థకములగు తెలుగుపదములను ప్రత్యేకముగ కృషి సలిపి నిర్మించుకొనుట వృథాశ్రమయని అనుభవజ్ఞుల అభిప్రాయము అన్యదేశ్యములను స్వీకరించినంత మాత్రమున తెలుగుభాష శక్తికికాని, గొప్పతనమునకు కాని, ఎట్టిలోటు రాదు. తెలుగువారికి అది అవమానకారణ మనుటయు భ్రమయే. కొందఱు లాక్షణికులు కవులు అన్యదేశ్యములను కావ్యములందు ప్రయోగించుటను నిషేధించినారు అట్లు నిషేధించినవారి కావ్యములందే అన్యదేశ్యములు కన్పట్టుచున్నవి. వావిలికొలను సుబ్బారావుగారు రోజు జమ, ఖర్చు మున్నగు అన్యదేశ్యములు ప్రయోగార్హములు కావని "సులభవ్యాకరణము"లో వ్రాసియుండిరి. వారురచించిన "సుభద్రావిజయ"మనుకావ్యమున "కంతుతేజీ" అని ప్రయోగించిరి. 'తేజీ' అన్యదేశ్యముకదా? అని గిడుగువారు విమర్శించుట[1] ఈసందర్భమున గమనింపదగినది.

నిత్యపరివర్తనశీలమైన భాషకు నిర్బంధములు తగవు. అన్యభాషలనుండి పదముల స్వీకరించినంత మాత్రమున తెలుగుభాష గౌరవప్రతిష్ఠలకెట్టి భంగము వాటిల్లదు. తెలుగు ఇంకను పరిపుష్టమగును. ఆంగ్లము ప్రపంచమునందలి భిన్న విభిన్నములైన భాషలనుండి వేలకొలది పదముల స్వీకరించినది. ఆ భాష పరిపుష్టమగుటకు అదికూడ ఒక కారణమే. అందు ఉర్దూ పారశీకముల నుండియు ఎన్నియో పదములు చేరినవి. కొన్నిపదములవలన విలక్షణమైన అర్థమును విశిష్టరీతిలో వెలువరించుటకు సాధ్యమైనపుడు అట్టివానిని స్వీకరించుటలో తప్పులేదు. ఆంగ్లములో చక్కగా వ్రాయజాలుఆంగ్ల న్యాయాధిపతులు తమతీర్పులలో "మునాఫా" అనుపదమును యథాతథముగ ప్రయోగించి యుండుట పరిశీలింపదగినది.

దాక్షిణాత్య భాషలపై ఉర్దూపారశీకముల ప్రభావమును తులనాత్మకముగ పరిశీలించి తెలుగుపై ప్రసరింపజేసిన ప్రభావవైశిష్ట్యమునుకూడ నిరూపించుటకు పండితులు

---

1 బాలకవి శరణ్యము— పుట—227

కృషి యొనర్పవలసియున్నది. డాక్టర్ అబ్దుల్‌హక్‌గారు మరాఠీపై పారశీ ప్రభావమును గ్రంధరూపమున పరిశీలించియున్నారు ఇది ఉర్దూలో వ్రాయబడినది[1]. ఈగ్రంధము నందలి అంశములను పరిశీలింప తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావమే అధికమని నాకుతోచినది. ఇతరభాషలపైగల ప్రభావమును పరిశీలించిన అనంతరమే ఇందుగల సత్యము తెలియగలదు. ఇట్టిపరిశోధనకు కృషికి పునాదిగా పనికివచ్చునది పదజాలము. ఈపదజాలమును నిఘంటువురూపమున సంతరించుట ఎంతయుఅవసరము[2] ఇది ఒకరి వలనఅగు కార్యముకాదు. బహుభాషజ్ఞులగుపండితుల సహాయముతో సాహిత్యసంస్థలు, అకాడమీలు బృహత్ప్రణాళికను సిద్ధముచేసి సాధింపదగిన కార్యము. ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీవారు ప్రౌఢ్యమును మరల ప్రకటించి మహోపకార మొనర్చియున్నారు. అన్యదేశ్య నిఘంటువునుకూడ నిర్మించుటకు వారే సాహసింపవలయునని వినయపూర్వ కముగ విన్నవించుకొనుచున్నాను.

ఇక సాహిత్యముపై ఉరుదూపారశీక ప్రభావమును గూర్చియు కొంత కృషి జరుగవలసియున్నదని గ్రంధమునందలి విషయము నిరూపించుచున్నది. పద్య సాహి త్యమునందును, నవల, కథానిక మున్నగు వచనప్రక్రియలందును, ఉరుదూపారశీకముల ప్రభావము నిరూపించుటకు వలయుసామగ్రికలదు. ఈగ్రంధమున కొన్ని గ్రంథముల గూర్చియే వివరించుటకు సాధ్యమైనది. మణిప్రవాళశైలిని గూర్చి ఇంకను వ్రాయుట కవకాశముకలదు. అముద్రిత రచనలు పెక్కు కలవు. అవి వెలువడవలసియున్నవి. ఉదయరాజు శేషగిరిరావుగారు ఉరుదూపారశీక పదములతో మణిప్రవాళశైలిలో పద్య ములు వ్రాసినట్లు మిత్రులవలన తెలిసికొంటినికాని అవి నాకు లభించలేదు ఇట్టిరచనలు సంపాదింపుటకు కృషి చేయవలయును. పద్యసాహిత్యములో సదాశివగారి మౌలానా రూమీ మస్నవీల అనువాదము, కాళోజీ నారాయణరావు గారి అనువాదములు కూడ ఇందు చేర్పదగినవి. ఉమర్‌ఖయ్యామ్, షేక్‌సాదీ మున్నగువారి కావ్యానువాదములు అముద్రితములు కొన్ని కలవు.

గజల్, ఖవాలీలు మనకు క్రొత్త. దాశరథిప్రభృతుల అనువాదములవలనను అనుకరణగేయముల వలనను ఆధునికగేయసాహిత్యము పరిపుష్టమైనది. 'ఖవాలీ' గమ కముతో డా. సి. నారాయణరెడ్డిగారు ఒకగేయమును కూడ వ్రాసిరి. అంత్యప్రాసలు, రదీఫ్‌ఖాఫియాల, గమకముతో తెలుగుగేయము సంతరించుకొనిన అందచందములను

---

[1] మరాఠీపై ఫార్సీ కా అసర్.

[2] తెలుగులో ప్రవేశించిన ఉరుదూపారశీక పదములను కొన్నింటిని సేకరించినాను. వీనిని 'అన్యదేశ్యపదసూచిక' రూపములోప్రకటించు సంకల్పముకలదు.

ఛందోరీతులతో పరిణతప్రజ్ఞులగు పండితులు నిరూపించుట కవకాశముకలదు. ఈఅంశ మీ గ్రంథమున సూచ్యప్రాయముగ మాత్రమే వివరింపబడినది. ఆధునిక గేయము లందును, చలనచిత్రమునకు వ్రాయబడిన గేయములందును ఈ విశిష్టధర్మము ప్రస్ఫుటముగా గన్పించుచున్నది. భావపుష్టికి అన్యదేశ్యప్రయోగములు తోడ్పడినఅంశమింకను విపులముగ పరిశీలింపదగియున్నది.

వివిధగ్రంథఅనువాదములలో సదాశివగారి ఉరుదూసాహిత్య చరిత్ర పేర్కొనదగినది. ఉరుదూపారశీక సాహిత్యమునుగూర్చియు, ఉరుదూ కవిత్వవైశిష్ట్యమునుగూర్చియు డా బూర్గుల రామకృష్ణరావుగారును, సదాశివగారును చక్కనివ్యాసములువ్రాసియున్నారు. ఇవి సుజాత, స్రవంతి, భారతి మున్నగుసాహిత్యసంచికలలో ప్రకటితములు

ఉరుదూపారశీక భాషాసాహిత్యముల పరిభావ మింతగా తెలుగుపై ప్రసరించినపుడు తెలుగు పరిభావ మాభాషాసాహిత్యములపై పడలేదా? అనుశంక కలుగుట సహజము. ఈ అంశము గ్రంథవిషయ పరిధికి అతీతమగుట పరిశీలించలేదు. పరస్పరప్రభావమును నిరూపించుటకు వీలుకలదు. దక్కనీ ఉరుదూభాషలోని పదజాలముపై తెలుగుముద్రకలదని దక్కనీ ఉరుదూనుగూర్చి పరిశోధనమొనర్చిన పండితులు భావించుచున్నారు. గోలకొండ సుల్తానులలో సుప్రసిద్ధుఁడగు మహమ్మద్ ఖులీ మున్నగువారు దక్కనీభాషను అభిమానించి యుండిరి వారు వ్రాసిన ఉరుదూపద్యములు దక్కనీ ఉరుదూలో కలవు. మహమ్మద్ ఖులీవ్రాసిన "కులియాత్ ఖులీ" అనుపద్యకావ్యమునందలి ప్రయోగములను, తదితర దక్కనిభాషా కావ్యములను ఓపికతో పఠించి, నిశితదృష్టితో పరిశీలించినచో తెలుగుముద్ర కొంతయైనను కనిపించునని విశ్వాసముకలదు యూనానీ వైద్యగ్రంథములందు దక్కను ప్రాంతములందు లభించు ఓషధుల నామములు తెలుగు రూపములో గన్పించును. ఖుతుబ్ షాహిప్రభువులు దక్కనీయూనానీ వైద్యవిధానమును రూపొందించినట్లును, ప్రాంతీయఓషధులను అందు బహుళముగ వినియోగించినట్లును, యూనానీ వైద్యుల అభిప్రాయము. అట్టి ఓషధుల నామములందు ప్రాంతీయభాషయగు తెలుగుఛాయ గోచరింపవచ్చు ననుటకు సందేహములేదు.

కొన్నికొన్ని సంప్రదాయములను ఉరుదూభాషలో వ్యక్తీకరించుట ఇట పరిశీలింపదగిన అంశము. ఒకరిని దర్శించివెడలునపుడు "మరలవచ్చెద"ననుట అమంగళమును పరిహరించుటకే. పోయెద, వెళ్ళెద ననిఅనుట అశుభము. దక్కనుముసల్మానులు "హాజిర్ హోతాహు" అందురు. ఔత్తరాహుల కిట్టి వ్యక్తీకరణ విధానము అపరిచితమట.

ఇటీవలి అదానప్రదాన మీ రెండు భాషలకును బహుళముగ జరుగుచున్నది. శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు తెలుగు సాహిత్య చరిత్రను ఉరుదూభాషలో వ్రాసిరి అంజుమన్ తరక్కీ ఉరుదూ అను సాహిత్యసంస్థ కేంద్రప్రభుత్వమువారి ఆర్థిక సహాయమున రెండు నిఘంటువులను ప్రకటించినది. తెలుగు-ఉరుదూ నిఘంటువును నేనుకూర్చితిని. ఉరుదూ తెలుగు నిఘంటువును కూర్చినవారు డా॥ బి రామరాజుగారు ఇవి సామాన్యభాషాజ్ఞానము కలవారికిని, విద్యార్థులకును ఉపయుక్తమగునట్లు కూర్చబడిన నిఘంటువులు. ఇట్టివి మరికొన్ని వెలువడినవి. శ్రీ కొండిలరావుగారి నిఘంటువులు ఈశాఖకు చెందిన ప్రశస్త నిఘంటువులనుట కెట్టి సందేహము లేదు. తెలుగుసాహిత్యమునుగూర్చియు, గోలకొండ సుల్తానుల కాలము నాటి తెలుగు కవులను గూర్చియు నేను ఉరుదూలో కొన్ని వ్యాసములు ప్రకటించితిని. డా॥ దివాకర్ల వేంకటావధానిగారి పర్యవేక్షణమున శ్రీమతి వసుమతీదేవి గారు ఖుతుబ్‌షాహి సుల్తానుల పోషణలో తెలుగు సాహిత్యమునుగూర్చి పరిశోధన గ్రంథమును వ్రాసిరి. కేంద్రరాష్ట్ర సాహిత్య అకాడమీవారు తెలుగులోని రచనలకు ఉరుదూ అనువాదములు వెలువరించుచున్నారు తెలుగు–ఉరుదూ; ఉరుదూ–తెలుగు వాచకములు ఆయాభాషల నభ్యసించు వారికి తోడ్పడు రీతిగ కొన్ని రచింపబడినవి.

ఆదాన ప్రదాన పద్ధతి ఉభయ భాషాసాహిత్యములకు లాభదాయకము. ఉరుదూపారశీకములోని ప్రశస్తకావ్యములు మఱికొన్ని ఆంధ్రీకరింపబడుటకు మార్గము సుగమ మగుచున్నది. ఉరుదూ పారశీకములను పెంపుడుబిడ్డగా ఆదరించిన తెలుగు వారికి ఇది సాహిత్య చరిత్రలో విశిష్టస్థానము నొందుటకు తోడ్పడుగాక అని ఆశింతము.

# ఆధార గ్రంథములు


1. శ్రీనాథుని కావ్యములు
2. నందిమల్లయ ఘంటసింగనలు : ప్రబోధచంద్రోదయము (చింతామణి ముద్రణాలయము 1904)
3 శ్రీకృష్ణదేవరాయలు : ఆముక్తమాల్యద (వేదంవారి వ్యాఖ్య) 1927.
4. రామరాజ భూషణుడు · వసుచరిత్ర (సవ్యాఖ్య) 1926
5. సారంగు తమ్మయ్య : వైజయంతీ విలాసము, కాకినాడ 1926
6. కుమారధూర్జటి · కృష్ణరాయ విజయము, వావిళ్ళ 1914
7 గోన బుద్ధారెడ్డి : రంగనాథ రామాయణము, (రెండవకూర్పు) వావిళ్ళ 1914
8 అయ్యలరాజు నారాయణకవి. హంసవింశతి. వావిళ్ళ 1920
9. శేషము వేంకటపతి : శశాంక విజయము, వావిళ్ళ 1918
10. చరిగొండ ధర్మన్న : చిత్రభారతము, వావిళ్ళ 1934
11. రుద్రకవి. నిరంకుశోపాఖ్యానము, వావిళ్ళ 1935
12 దిట్టకవి నారాయణకవి : రంగరాయ చరిత్రము, వావిళ్ళ 1914
13. దామెర్ల వేంగళభూపాలుడు. బహుళాశ్వ చరిత్ర, 1606
14 మొల్ల : రామాయణము, (వీరేశలింగపరిష్కృతము) 1906
15 పాలవేకరి కదరీపతి : శుకసప్తతి, వావిళ్ళ 1935
16 పొన్నగంటి తెలగన్న : యయాతి చరిత్ర.
17. సురవరము ప్రతాపరెడ్డి : ఆంధ్రుల సాంఘిక చరిత్ర. మూడవ ముద్రణము.
18. కవిత్వవేది ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహము.
19. డా దివాకర్ల వేంకటావధాని. ఆంధ్రవాఙ్మయ చరిత్ర,
20 ఆచార్య ఖం లక్ష్మీరంజనము. ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము.
21 కందుకూరి వీరేశలింగము పంతులు : ఆంధ్రకవుల చరిత్ర.
22. గురజాడ శ్రీరామమూర్తి : కవిజీవితములు
23. చాగంటి శేషయ్య : ఆంధ్రకవితరంగిణి సంపుటములు.
24. దువ్వూరి రామిరెడ్డి : గులాబితోట-పండ్లతోట.
25. లక్ష్మణరాయ పరిశోధకమండలి : తెలంగాణశాసనము II 1960
26. శ్రీకోరాడ రామకృష్ణయ్య : భాషాచారిత్రిక వ్యాసములు, 1954
27. డా. చిలుకూరి నారాయణరావు : ఆంధ్రభాషా చరిత్ర, I, II సం.
28. డా. బూర్గుల రామకృష్ణారావు : సారస్వత వ్యాసముక్తావళి.
29. కేకుమళ్ళ కామేశ్వరరావు : వాడుకభాష.
30. వడ్లమూడి గోపాలకృష్ణయ్య : వ్యావహారికాంధ్రభాషావ్యాకరణము

31. డా. బి రామరాజు : ఆంధ్రజానపదగేయ వాఙ్మయము.

32. బి. సీతారామాచార్యులు : శబ్ద రత్నాకరము. (నిడుదవోలువారి అనుబంధ సహితము)

33. బులుసు వేంకటరమణయ్య : ఆంధ్ర కవిసప్తశతి.

34. కొమర్రాజు లక్ష్మణరావు : మహమ్మదీయ మహాయుగము. ప్రథమభాగము 1961

35. బ్రౌను : మిశ్రభాషా నిఘంటువు. అకాడమీ ప్రచురణము.

36. అధర్వణాచార్యులు : అధర్వణ కారికావళి.

37. చిన్నయసూరి . బాలవ్యాకరణము. (దూసివారివ్యాఖ్య)

38. వజ్ఝల చినసీతారామశాస్త్రి : బాలవ్యాకరణోద్యోతము.

39. మల్లాది సూర్యనారాయణశాస్త్రి : ఆంధ్రశబ్దానుశాసనము. మున్నగునవి. పత్రికలు
భారతి, ఆంధ్రప్రదేశ్, ఆంధ్రపత్రిక, స్రవంతి, సాహితి మున్నగు సంచికలు

ఉర్దూపారశీక గ్రంథములు:—

1. మిర్జా మహమ్మద్ అస్కరీ : తారీఖె అదబె ఉర్దు (అనువాదము) 1952
2. హామిద్ హుస్సేన్ ఖాదరి : దాస్తానె ఉర్దు, 1957 ప్రచురణము
3. నసీరొద్దీన్ హాషిమ్ : దక్కన్ మే ఉర్దు.
4. డా. జోర్ : ఉరుదూ లిస్సానియాత్.
5. డా. అబుల్‌హక్ : మరీపర్ పార్సీకా అసర్.
6. డా. జోర్ : సైరె గోల్కొండ.
7. అబ్దుల్ మజీద్ సిద్దీఖి : తారీఖె గోల్కొండ.
8. మహమ్మద్ ఖులి : కులియాతె ఖులి.
9. గాలిబ్ : దీవానె గాలిబ్.
10. జఫర్ : నవాయె జఫర్ 1958
11. మీర్ : ఇంతెఖాబ్ మీర్
12. ఉమర్ ఖయ్యామ్ : రుబాయియాతె ఖయ్యామ్
13. నుఖూష్ : అఫ్సానా నంబరు.
14. సర్మద్ : రుబాయియాత్ సర్మద్
15. సాదీ : గులిస్తాఁ సాది.
16. డా. అబ్దుల్ హక్ : ఉరుదూ సర్ఫ వ నహూ.

ఆంగ్ల గ్రంధములు:—

1 Caldwell · Comparative grammar of Dravidian Languages IIIEd.
2 Bloomfield : Language
3 V. N. Datar : The Nector of grace, 1941
4 South Indian Inscriptions : Vol X